

# శ్రీరామ రూప వైభవము

శ్యామాభిరామం నయనాభిరామం
గుణాభిరామం వచనాభిరామం
విశ్వప్రమాణం కృతభక్త కామం
శ్రీరామచంద్రం సతతం నమామి ॥

శ్యామసుందరుడును, నేత్రములకు ఆనందమును కూర్చువాడును, సుగుణ మనోహరుడును, చక్కని వాక్యములను పలుకువాడును, విశ్వవంద్యుడును, భక్తుల అభీష్టములను తీర్చువాడును అగు శ్రీరామచంద్రుని సదా నమస్కరించుచున్నాను.

***I constantly bow down to Sri Ramachandra, who delights all with his dark brown hue and captivates all with His delightful words, who is adored by the universe and who accomplishes the desire of His devotees.***

# అరణ్యకాండము





# శ్రీరామ
# జయరామ
# జయ జయ రామ....



## తొలకరి

పసిపాపకు తల్లి ఎద
తాపసికి అడవిపాద
అవశ్యం. అనివార్యం.
తియ్యని పాలకై తల్లి పాలిండ్ల కోసం
తడుముతూ తల్లడిల్లుతుంది పసిపాప.
తీపిబ్రతుకుకై తండ్రిపాదాలను వెతుక్కుంటూ
తపిస్తాడు పసిహృదయం గల తపస్వి
కడుపు ఆకలి తీరేది
కంటికి కునుకు పట్టేది కూనకు తల్లి ఒడిలోనే ...... ఆ గుడిలోనే
ఇంద్రియ కుదుపు ఆగేది
వీర్యపాదుపు సాగేది తాపసికి వనంలోనే .... అరణ్యంలోనే
అయోధ్యను విడిచాం. అరణ్యంలో ప్రవేశిస్తున్నాం.

### ఇది అరణ్యకాండము

కరుణా రసపూర్ణ సుమధుర సాధనా కాండము.
"ప్రవిశ్య" ....... "ప్రవేశించు" అంటూ ఈ కాండమును ప్రారంభిస్తున్నాడు వాల్మీకి.
జీవికి ప్రవేశద్వారము బంధమా!
అయితే, నిర్గమద్వారము మోక్షమే.
ప్రవేశ నిర్గమ ద్వారాలు రెండూ ఈ కాండములోనే గోచరిస్తాయి.
దండకావనంలో ప్రవేశం ..... "తద్వనం" లో నిష్క్రమణం.
మాతృగర్భం నుండి ప్రవేశం ....... ముక్తిసౌధం లోకి నిష్క్రమణం.
ఈ మధ్య నడిచేదే అరణ్యకాండము
అదియే జీవులకు జీవనభాండము.
ఇది అరణ్యం ... వనం... నందనవనం....... తపోవనం..... తద్వనం.

సీతారామలక్ష్మణులు ప్రవేశించిన దండకావనం.
అత్రి అనసూయలు వీడ్కొల్పిన నందనవనం.
సుతీక్ష్ణ శరభంగ అగస్త్యాదులు వసించిన తపోవనం.
పరమపావని శబరి దర్శింపజేసిన తద్వనం ..... ఇదే అరణ్యకాండము.
సాధన ప్రసూనాలను పరిమళింపజేసే కాండము.
పసిడి బ్రతుకును పల్లవింపజేసే కాండము.
ఖరదూషణులను అసురులూ ఇక్కడే
సుతీక్ష్ణ శరభంగులనే ఆచార్యులూ ఇక్కడే ......
కామం కరిగిపోవాలి అని చెప్పేందుకు రాక్షసుల వేట
ప్రేమ వెలిగిపోవాలి అని తెలిపేందుకు ఋషుల మాట.
అసురులై పుట్టి అసురులుగా అంతరించిన ఖరదూషణాదులు
అసురులై పుట్టినా ఆనందంగా తరించిన విరాధ కబంధాదులు.
వైరుధ్యమును నిర్మూలించిన విరాధుడు
బంధము వీడే మార్గము తెలిపిన కబంధుడు
రాక్షసవృత్తి మంచిది కాదన్న మారీచుడు .........
శరభంగుని తపస్సుతో ఆరంభం. శబరి మోక్షంతో సమాప్తం.
"నాథా! ఆ మృగాన్ని తెచ్చి నా కివ్వరాదా!
చాలా ముద్దొస్తుంది;" అంటూ ఉల్లములను ఉరకలెత్తించే మగువ మంజుభాషలు.
తరులను, విరులను వాటేసుకుని, "నా సీత ఎక్కడ?"
అని ఎద చేసే బాధతో కుదిపేసే రాముని విప్రలంభము ......
మాసాలు చెప్పుకున్నా తనివితీరని రుచికరమైన సమాసాలు
సాహితీద్వారము తెరచి ఆకలి తీరేలా వడ్డించిన కమ్మని ఉపమాలు
కమనీయ వేదాంతాన్ని కలబోసి వాల్మీకి చక్రవాకం వార్చిన వాక్పాకం.
ఆర్తి ఆకలిని ఆర్పేందుకు
ఆదికవి చేసిన వంట లెన్నని? .......
బంధాలను విడగొట్టే పదబంధాలు
అందాలను అందించే అక్షరశిల్పాలు
సంధుల సంవిధానం కూర్చిన శిల్పవిధానం
సమకూర్చిన అక్షరసోపానాలతో అమర్చిన మధురాక్షరసౌధం.

చెట్టు పచ్చన
కోయిల నల్లన
గానము తియ్యన ........
పచ్చని కవితాశాఖలపై కూర్చుని
వెచ్చని, నులివెచ్చని పోకడలతో
వాల్మీకి కోకిల తియ్యగా పాడిన తీరు - ఆ జోరు
వర్ణించను సనకాదులే సరిపోరు.
సీతాపహరణంలో
రణం తప్పదు. అదే, -
రావణుని మరణం
మగువకు జరిగిన అన్యాయాన్ని ప్రతిఘటించిన జటాయువు
అసుర జీవనాన్ని ఎదిరించి ఎండగట్టుటకు వీచిన వాయువు
ఆయువు తీరిన జటాయువును
గుండె కత్తుకున్న గుణాభిరాముడు
ఎదురు చూచిన జటాయువు ఆర్తి బాపుటకా?
ఎత్తి మోసిన గరుడుని అప్పు తీర్చుటకా?
పక్షి అయితే నేమి? అక్షి చేసిన పుణ్య మెంతని?
కుక్షి శుద్ధి పడాలి. ముక్తి ముంగిట నిలవాలి.
శబరి పుణ్యలోకానికి ........
రాముడు పంపా తీరానికి .......
కుదురుతుంది వీడని పొత్తు.
ఇక వదుల్తుంది పట్టిన మత్తు.
చివరగా, మనలో మనమాట.
అయోధ్యాకాండము అంతా అయోధ్యలోనే జరుగలేదు.
అరణ్యకాండము మటుకు అరణ్యం లోనే, వనం లోనే, ఆంధ్రావనం లోనే.
అయ్యా! ఈరోజు ఏ వారము? అంటే,
"రాముని వారము" అని మునుపెవరో అన్నారట.
అదేమోగాని, మనము మాత్రము రాముని వారమే
రాముని పరివారమే
మన గమ్యము ఎప్పుడూ రామకృపా పారావారమే ......

అరణ్యాకాండమంతా ఆంధ్రావని లోనే జరిగింది.

భవ్యమైన రామభద్రునికి
భద్రాచలమే వాసమైంది
భద్రత కుంటుపడినా - అతనికి
ఆర్ద్రత వంట బట్టింది - మనకు .......
ప్రతి పురంలో రామమందిరం
ప్రతి కాపురంలో రామనామం
తేపొస్తే 'రామా' తుమ్మొస్తే 'రామా'
ఎవరికుంది ఈ భాగ్యం? - ఆంధ్రావని సౌభాగ్యం!
చోటిచ్చిన తెలుగమ్మను మరువని రామయ్య తండ్రి
పెట్టాడు ఆంధ్రావనికి సువర్ణభిక్ష
మరులు పొందలేని భక్తిభిక్ష
రామభక్తి భిక్ష!

కనుకనే,
తెలుగువారు వెలుగువారే
రామభక్తిలో మెలుగువారే
తెర తొలుగుతూ ఉంది.
తెలుగు నేలపై రామపాదం కదలబోతోంది.
దర్శించండి. తరించండి.

రామపాదం సోకిన రమణీయ నేలపై
రంగరంగ వైభవంగా
రంగవల్లులు తీర్చాలనే రచనానురక్తిలో
రంగోపజీవి
మీ
స్వామి సుందర చైతన్యానంద

# చైతన్య రామాయణము

## అరణ్యకాండము

### దండకారణ్యంలో దాశరథి

జీవులకు ఈ ప్రపంచం ఒక విరామస్థానము. జననమరణ రాకపోకల ప్రయాణంలో జీవితము ఒక విశ్రాంతి నిలయము. దీనికి జన్మ ప్రవేశద్వారము. మృత్యువు నిష్క్రమణ ద్వారము.

వచ్చేవాళ్ళు వస్తుంటారు. పోయేవాళ్ళు పోతుంటారు. వచ్చేది పోయేందుకే. పోయేది తిరిగి వచ్చేందుకే.

"గచ్ఛతా" అని అయోధ్యాకాండము ప్రారంభమైంది. అంటే వెళ్ళడం. "ప్రవిశ్య" అంటూ అరణ్యాకాండము ప్రారంభమవుతూ ఉంది. అంటే ప్రవేశించడం. నిష్క్రమించే వాళ్ళని గూర్చి అయోధ్యాకాండ ప్రవచిస్తే, ప్రవేశించే వాళ్ళను గూర్చి అరణ్యకాండ ప్రబోధించడం ప్రారంభించింది.

ఎక్కడ్నుంచో తెలియదుగాని అందరము తల్లిగర్భంలో ప్రవేశించాము. నరకయాతన అనుభవించాము. తల్లిగర్భం నుండి విశ్వగర్భంలో కాలూని జీవించాము. చెప్పలేని బాధల్ని చవిచూశాము. తీరినకాలం తీర్పుచెప్పిందని తలవంచి శ్మశానంలో ప్రవేశిస్తాము.

ఈ మధ్యలో ఎన్ని ప్రవేశాలో? ప్రవేశ దరఖాస్తులో? పాఠశాల్లో ప్రవేశము, ఉద్యోగంలో ప్రవేశము, గృహస్థాశ్రమంలో ప్రవేశం, వ్యాపారంలో ప్రవేశము, గృహప్రవేశము-ఎన్ని ప్రవేశాలో? కానీ ప్రవేశాలన్నీ నేటివరకు ప్రమాదాల్ని అందించాయే గాని ప్రమోదాన్ని ముందుంచలేదు.

అంతేమరి. దారిలో దుఃఖం తప్పదు. దరిచేరితేనే సుఖం. అందరం దారిలో పడి వున్నామే గాని దరిని చేరలేక పోతున్నాము. పడేవారంతా బాధపడేవారే.

బాధలలో బోధల్ని గ్రహించాలి.దివ్యమైన గాథలన్నీ దుర్భరమైన బాధలనుండి పుట్టినవే. బురదనుండే పద్మము ఆవిర్భవించునట్లు, బాధలనుండే భవ్యమైన బ్రతుకు ప్రాదుర్భవిస్తుంది. పద్మం వికసిస్తే అంతా విలసనమే. బ్రతుకు విరబూస్తే అంతా వికాసమే.

బాటలో కంటకాలు - బ్రతుకులో ఆటంకాలు, మార్గంలో ముళ్ళు తప్పవు. బ్రతుకులో బాధలు వదలవు. అలల మధ్యే జలకమాడాలి. ఆవేదనల మధ్యే జీవితం సాగాలి.

అలలు స్నానాన్ని అడ్డగించవు. అలజడులు బ్రతుకును నిరోధించవు. ప్రగతిని నిరోధించవు. కెరటాల మధ్య క్రీడించడం ఒక కళ. కష్టాల మధ్య జీవించడం కూడా కళే. అదే జీవనకళ.

జీవికి నూతన కళల్ని ప్రసాదించే కాండము అరణ్యకాండము.

లక్ష్మణుడు వెంట రాగా సీతారాములు అరణ్యములో ప్రవేశించారు. అదే దుర్గమమైన దండకారణ్యము.

దారి ఎక్కడో, దరి ఏమిటో తెలియని బాటసారుల్లాగా దట్టమైన చెట్లమధ్య నడచి వెళ్తున్నారు దండకారణ్యంలో సీతారామలక్ష్మణులు.

**ప్రవిశ్యతు మహారణ్యం దండకారణ్య మాత్మవాన్**
**రామో దదర్శ దుర్ధర్ష స్తాపసాశ్రమ మండలమ్**

"బుద్ధిశాలీ, ఎవరిచేతను ఎదిరింప శక్యము కానివాడు అగు శ్రీరాముడు దండకారణ్యములో ప్రవేశించాడు. అక్కడ అనేక మున్యాశ్రమాలను చూశాడు."

అరణ్యప్రయాణం అగచాట్లకు, ఆపదలకు నిలయం. అరణ్యంలో ప్రవేశించేవాడు దుర్ధర్షుడై ఉండాలి. అంటే ఎదిరింప శక్యము కానివాడై ఉండాలి. జీవితమనే అరణ్యములో ప్రవేశించే వారుకూడా దుర్ధర్షులై ఉండాలి. కామక్రోధాది రాక్షసుల్ని ఎదిరించి జయించ గలవారై ఉండాలి.

దండకారణ్యంలో ప్రవేశించగనే రాముడు మున్యాశ్రమాలు చూశాడు. జీవితారణ్యంలో సంచరించే వారంతా చూడవలసింది సినిమాల్ని కాదు. సాధువుల్ని. సన్యాసుల్ని. సత్పురుషుల్ని. వారి పవిత్రాశ్రమాల్ని.

సీతారామలక్ష్మణులు దండకారణ్యంలో నడుస్తున్నారు. రాముని నారపంచె ముళ్ళచెట్టుకు తగుల్కొంటుంది. వెంటనే వంగి, దానిని తొలగించి రాముని నారబట్టకు నమస్కరిస్తాడు లక్ష్మణస్వామి.

చెట్టునుండి పండుటాకు ఒకటి రాలి రాముని అంబులపాదిపై వాలింది. సీతమ్మ దానిని తీసింది. ఈ ఆకు ఎంత పుణ్యం చేసుకున్నదో రాలిపోతూ రాముని చేరింది అని భావించిన జానకి ఆ పండుటాకును కళ్ళకద్దుకుంది.

రామునికి ఇరుప్రక్కల నిలబడి దివ్యమైన సేవలందిస్తూ, దాశరథితో కలిసి దండకారణ్యంలో చరిస్తున్న సీతాలక్ష్మణులు భరతుడు చెప్పినట్లు ఎంత ధన్యాత్ములో? ఎంత పుణ్యాత్ములో?



ఈ అదృష్టాన్ని తనకు కూడా ప్రసాదించమని గానం చేస్తాడు త్యాగరాజస్వామి. సీతాలక్ష్మణుల వలె రాముని ప్రక్కన నిలబడి సేవించే భాగ్యాన్ని అనుగ్రహించమని ఆరాటపడతాడు భక్తాగ్రగణ్యుడైన త్యాగరాజస్వామి.

**ప్రక్కల నిలబడి కొలిచే ముచ్చట బాగా తెల్పరాదా!**
**చుక్కల రాయని గేరు మోముగల**
**సుదతి సీతమ్మ సౌమిత్రి రాముని కిరు** ॥ప్రక్కల॥

అని జానకీలక్ష్మణులు రామునికి చేసిన సేవను హృదయానందంగా మనసులో దర్శించి పరవశిస్తున్నాడు త్యాగరాజస్వామి.

సీతారామలక్ష్మణులు దండకారణ్యంలో ప్రవేశించి నడుస్తున్నారు. వారికి ఆ ప్రదేశాల్లో నారబట్టలు, పవిత్రమైన దర్భలు, కృష్ణాజినాలు, యజ్ఞసంభారాలు కన్పించాయి.

అదొక రమణీయమైన, మనోహరమైన మునిపల్లె. అక్కడ ప్రతి పర్ణశాల ముంగిట చక్కగా అలికి ముగ్గులుపెట్టి ఉన్నారు. ప్రాణులన్నీ నిర్భయంగా సంచరిస్తున్నాయి. అనేక మృగాలు, పక్షులు ఉల్లాసంగా తిరుగుతున్నాయి.



మధుర ఫలభరితమైన మహా వృక్షాలు గగనాన్ని స్పృశిస్తున్నట్లు నిలబడి ఆ ఋష్యాశ్రమాల్ని దివ్యంగా ప్రకాశింప చేస్తున్నాయి. ఆశ్రమ కుటీరాలనుండి వేదఘోషలు వినిపిస్తున్నాయి. పూలచెట్లు విరగ బూసి వున్నాయి.

అక్కడ మునిపుంగవులు అగ్నిహోత్రం లాగా, సూర్యబింబం లాగా వెలిగిపోతున్నారు. వారంతా నియతాహారులు. వేదవేత్తలు. పుణ్యమూర్తులు. దివ్యప్రకాశంతో భువికి కదలివస్తున్న దివాకరునివలె కీర్తిమంతురాలైన సీతమ్మతో కలిసి వస్తున్న దివ్యజ్ఞాన భాస్కరుడైన రాముని చూచి, ఋషులందరూ ఎదురొచ్చి ఆహ్వానం పలికారు.

ఋషులను చూడగానే రాముడు ధనుస్సుయొక్క నారిని విప్పేశాడు. వినయశీలుడై వారిని సమీపించాడు. నమస్కరించాడు.

**వైదేహీం లక్ష్మణం రామం నేత్రైరనిమిషై రివ**
**ఆశ్చర్య భూతాన్ దదృశుః సర్వే తే వనవాసినః**

"అరణ్యవాసులైన ఆ మునులందరు దివ్యమైన రూపసౌందర్యమును గల సీతారామ లక్ష్మణులను రెప్ప వాల్చకుండా చూశారు;" అంటాడు వాల్మీకిమహర్షి.

జీవితారణ్యంలో సాధన చేసి తరించాలని భావించి జీవించే ముముక్షువులు ఎలా ఉండాలో ఈ సన్నివేశంలో రామునియొక్క, ఋషులయొక్క చర్యల ద్వారా వాల్మీకి మనకు తెలుపుతున్నాడు.

ఋషులను చూడగానే ధనుస్సుయొక్క నారిని రాముడు విప్పేశాడు. వేటాడే అవసరం ఆ సమయంలో లేదని రాముడు గుర్తించడమే నారిని విప్పేయడంలో ఉద్దేశ్యము.

మనసనే ధనుస్సుకు వాసనలనే నారిని కట్టి కోరికలనే బాణాల్ని మనం నిత్యమూ సంధిస్తూనే వుంటాము. విషయపిపాస, విషయాభిలాష అనే ఈ వేటలో అలసిపోతూ ఉంటాము.

మహర్షులను దర్శించిన తరువాత వాసనలు విజృంభించవు. అందుచేత కోరికలు కదలవు. విషయపిపాస ఉదయించదు. ఊరట చెందిన మనసు వేటలో ఊరేగాలని ఉబలాటపడదు. వాసనలు ఊరడంలేదు గనుక మనసు ఊరకుండిపోతోంది.

అందుచేతనే **"సా న కామాయమానా నిరోధ రూపత్వాత్"** "నిరోధ స్వభావము కలది కనుక భక్తి కోరికలను కదలనివ్వదు. కలగనివ్వదు" అంటాడు భక్తిసూత్రాలలో నారదమహర్షి.

ధనుస్సునుండి నారిని వేరుచేసిన రాముడు వినయశీలుడై మహర్షులను సమీపించాడు. వినయము లేనివానికి విద్య రాదు. ముముక్షువు వినయశీలుడై ఉండాలి. రాముడు ఈవిధంగా ఋషులను సమీపించి ముముక్షువు లైనవారు ఎలా ఉండాలో ప్రదర్శించి చూపాడు.

దండకారణ్యంలోని మునులు సీతారామలక్ష్మణుల రూపసౌందర్యమును గాంచి రెప్ప వాల్చకుండా చూశారు అంటాడు వాల్మీకి.

ఈ ప్రపంచంలో మనకు గోచరించే సౌందర్యాలన్నీ మతాబుల కాంతి వంటివి. జగత్తు లోని అందాలన్నీ ఆరిపోయే దీపాలే. పారిపోయే వెలుగులే.

భగవ త్సౌందర్యము నిత్యమైంది. అది ఆరని వెలుగు. దానిని దర్శించడము లోనే జీవికి సంతృప్తి లభిస్తుంది. భగవంతుని సాధకులు లేదా భక్తులు ఎలా దర్శించాలో ఋషులు ఆచరించి చూపారు.

**"అనిమిషైరివ దదృశుః"** రాముని రెప్ప వాల్చకుండా చూశారు ఋషులు అంటాడు వాల్మీకి. రెప్ప వాల్చకుండా దర్శించడమంటే అన్యమైన ఆలోచన ఏదీ కదలకుండా మనసును భగవంతుని యందు లగ్నం చేయడమని భావం.

ఋషులందరూ రాముని సేవించారు. ఫలపుష్పాదులు సమర్పించి, వినయవంతులై ఇలా భాషించారు.

"రామా! నీవు ధర్మజ్ఞుడవు. పూజ్యుడవు. మాకంతా నీవే శరణ్యం. అయోధ్యలో వున్నా, అరణ్యంలో వున్నా నీవే మా రాజువి. మేము జితేంద్రియులం. జితక్రోధులం. మాకు అపకారం చేసినవారిని కూడా మేము దండించం. మేము నీ బిడ్డలం. తల్లిలాగా నువ్వు మమ్మల్ని రక్షిస్తూ ఉండాలి;" అని ప్రార్థించారు.

రాముడు ఆ రాత్రి ఆశ్రమంలోనే గడిపాడు. మహర్షుల ఆతిథ్యాన్ని స్వీకరించాడు. సూర్యోదయానికి ముందే లేచి మహర్షుల అనుమతిని పొంది అరణ్యంలో ప్రవేశించాడు.



## విఱ్ఱవీగిన విరాధుడు

అరణ్యం ఎంతో భయంకరంగా ఉంది. క్రూరమృగాలు గుంపులు గుంపులుగా తిరుగుతున్నాయి. పెద్దపెద్ద చెట్లు కూలి పడివున్నాయి. పక్షుల రవములు, అడవి ఈగల రొదలు వినిపిస్తున్నాయి. సమీపంలో జలాశయము ఎక్కడా కనిపించడం లేదు.

రాముడికి ఒక రాక్షసుడు ఎదురుపడ్డాడు. వాడి శరీరము కొండశిఖరమంత ఉంది. వాడి అరుపు మబ్బు ఉరిమినట్లుంది. వికారరూపంతో గోచరిస్తున్న ఆ రాక్షసుడు చాలా భయంకరంగా ఉన్నాడు.

అప్పుడే ఒలిచిన పులిచర్మాన్ని చుట్టుకొని ఉన్నాడు. వాడు తీరికగా కూర్చుని తివడానికి మూడు సింహాలను, నాలుగు పులుల్ని, పది దుప్పుల్ని, ఒక పెద్ద ఏనుగును ఇనుప శూలానికి గుచ్చి భుజాన పెట్టుకొని వున్నాడు.

సీతారామలక్ష్మణులను చూసి ఆ రాక్షసుడు మండిపడ్డాడు. భూమి దద్దరిల్లేటట్లు, గగనం గుల్లబారేటట్లు పెద్దగా అరచి, క్రుద్ధుడైన యమునివలె పరుగెత్తి, ఇలా పలికాడు.

"ఎవర్రా మీరు? ధనుర్బాణాలూ, ఖడ్గములూ ధరించి ఈ అరణ్యంలో ప్రవేశిస్తారా? ఎంత ధైర్యంరా మీకు? మీ ఆయువు మూడింది. ఈ భూమికి మీ ఋణం తీరిపోయింది.

"మునుల వేషం ధరించారు. ప్రక్కనే అందమైన మగువతో కలిసి వస్తున్నారు. పాపాత్ములారా! అధర్మపరులైన మీరు ఎవరురా?

"నా పేరు విరాధుడు. నేను మునుల మాంసాన్ని తింటూ ఈ అరణ్యంలో జీవిస్తూ ఉంటాను. ఎవర్రా ఈ మగువ? చాలా ముచ్చటగా బొమ్మలాగుంది. ఇది నా పెళ్ళామవుతుంది. మీ ఇద్దరి రక్తాన్ని గుటగుట త్రాగేస్తాను;" అని మేఘగర్జనం చేశాడు విరాధుడు.

వాడి మాటలను విని సీత చాలా భయపడింది. గాలివానలో అరటిచెట్టులాగా వణకుతూ ఊగిపోయింది. ఈలోగా విరాధుడు ముందుకు వంగి సీతమ్మను చేత్తో ఎత్తుకొని ఒడిలో పెట్టుకున్నాడు. విరాధుడి ఒడిలో వున్న సీతను రాముడు చూశాడు. దుఃఖముతో క్రుంగిపోయి లక్ష్మణునితో ఇలా పలికాడు.

"లక్ష్మణా! జనకచక్రవర్తి కూతురు, నా అర్ధాంగి, సుగుణవంతురాలు అయిన సీత సుఖంగా జీవించింది. యశస్విని యైన సీతకు ఏగతి పట్టిందో చూశావా?

"ఏది మనసులో పెట్టుకొని కైకేయి రాజుగారిని వరాలు కోరిందో అది మనకు సంప్రాప్తిం చింది. తన కుమారుడికి రాజ్యాభిషేకం జరగడంతో సంతోషించకుండా, నన్ను అరణ్యాలకు ఎందుకు పంపిందో ఇప్పుడు అర్థమవుతూ వుంది.

**పరస్పర్శాత్తు వైదేహ్యాః న దుఃఖతర మస్తి మే**
**పితుర్వినాశాత్ సౌమిత్రే స్వరాజ్య హరణ త్తథా ॥**

"లక్ష్మణా! తండ్రి మరణం కంటె, రాజ్యాపహరణము కంటె, పరపురుషుడు సీతను స్పృశించుట నాకు దుర్భరంగా ఉంది. దీనికి మించిన శోకము మరొకటుండదు" అని రాముడు దుఃఖించాడు. అతని ముఖం వాడిపోయింది.

విరాధుడు సీతను స్పృశించడాన్ని రాముడు భరించలేక పోయాడు. ఏ కైకేయిని నిందించడం సబబుకాదని భరతుని రాముడు చిత్రకూటంలో నివారించాడో ఆ కైకేయి ప్రసక్తిని ఇక్కడ తీసికొని వస్తున్నాడు. విరాధుని ఒడిలో భీతితో దుఃఖిస్తున్న సీతను చూచి, ఈ భయంకర సన్నివేశాన్ని కైకేయి ఊహించే ఇలా చేసింది అని ఆరోపిస్తున్నాడు. ఇలాంటి సందర్భాలలో రామునియందు మానవస్వభావం సుస్పష్టంగా తెలుస్తుంది.

దుర్భర దుఃఖాలు చుట్టుముట్టినపుడు, ఊహించని భయంకర సన్నివేశాలు తలఎత్తినపుడు మానవుని అంతర్యంలో నిగూఢంగా నిలిచి, నివురు కప్పిన నిప్పులా నిలిచియున్న సత్యాలు బుసలు కొడుతూ బహిర్గత మౌతాయి. మన అంతర్యంలో తిష్ఠవేసియున్న విషయాల ముందు మనకు బాహ్యంలో గోచరించే విషయాలు చాలా పేలవంగా ఉంటాయి.

**What lies behind us and what lies before us are tiny matters compared to what lies within us.**

"మనలో నిలిచియున్న విషయాలతో పోల్చినపుడు మన ముందు, మన వెనుక ఉన్నవన్నీ చాలా స్వల్పమైనవి" అంటాడు ఆలివర్ హోమ్స్.

రాముని మాటలను ఆలకించి. లక్ష్మణుడు చింతాక్రాంతు డయ్యాడు. క్రుద్ధుడై, కంటతడి బెట్టుకుంటూ అడ్డగింపబడిన కోడెత్రాచులాగా బుసలుకొడుతూ ఇలా పలికాడు.

"రామా! నీవు సకల జగత్తుకు నాథుడవు. ఇంద్రునితో సమానుడవు. నీ దాసుణ్ణి నేనుండగా నీవెందుకు అలా చింతిస్తున్నావు? నా బాణంతో కూలిపోయిన విరాధుని రక్తాన్ని భూమి పానంచేస్తుంది.

"నీ రాజ్యాన్ని అపహరించి, నిన్ను వనాలకు పంపే సమయంలో కోపంతో బాణ ప్రయోగం చేయడానికి ఉద్యుక్తుడనైన నన్ను నీవు ఆపావు. ఈనాడు చూద్దువుగానీ! దేవేంద్రుడు పర్వతముపై వజ్రాయుధమును ప్రయోగించినట్లు ఈ విరాధునిపై శరసంధానం చేస్తాను. వాడియైన నా బాణముల తాకిడికి వాడి శరీరంనుండి ప్రాణాలు పరుగులు తీస్తాయి."

విరాధుడు రామలక్ష్మణులను మళ్ళీ ప్రశ్నించాడు. "ఎవరు మీరు? నోరు విప్పరేం? ఎక్కడికి పోతున్నారు? నేనడుగుతున్నాను. చెప్పండి."

"మేము క్షత్రియులం. ఇక్ష్వాకు వంశీయులం. సత్ప్రవర్తన గలవారం. ఇంతకీ ఈ దండకారణ్యంలో చరించే నీవెవరు?" అన్నాడు రాముడు.

"నేనెవరో చెప్తాను. విను. నేను జవుని పుత్రుడను. నా తల్లి శతహ్రద. నన్ను విరాధుడు అంటారు. నన్ను ఎవరూ చంపలేరు. శస్త్రాలతో చంపలేరు. అస్త్రాలతో వధించలేరు.

"నేను చేసిన తపస్సుకు మెచ్చి బ్రహ్మదేవుడు నాకీ వరం ప్రసాదించాడు. నా మాట వినండి. ఈ సుందరాంగిని మరచిపోండి. తొందరగా ఇక్కడనుండి పరుగెత్తి పొండి. మీ ప్రాణాలతో నాకు పనిలేదు" అని పలికాడు విరాధుడు.

విరాధుని మాటలు విన్న రాముడు కోపముతో కళ్ళెర్రజేశాడు. విరాధునితో ఇలా పలికాడు. "నీచుడా! నీవు నీ చావును వెతుక్కుంటున్నావు. అది నీకు తప్పక లభిస్తుంది. నిన్ను ప్రాణాలతో విడిచిపెట్టను;" అని పలికి ధనుస్సును ఎక్కుపెట్టి వాడియైన బాణాలతో విరాధుని కొట్టాడు.



రాముడు ప్రయోగించిన బాణాలు వాయువేగంతో పయనించి విరాధుని దేహానికి గ్రుచ్చుకున్నాయి. వెంటనే విరాధుడు సీతను క్రిందికి దింపి, శూలమును చేతపట్టుకొని రామలక్ష్మణుల మీదికి పరుగెత్తాడు. రామలక్ష్మణులు వాడిపై బాణవర్షం కురిపించారు.

శరీరమంతా బాణాలు గ్రుచ్చుకోగా ఆ రాక్షసుడు ముళ్ళపందిలాగా గోచరించాడు. అయినా వాడు చలించలేదు. భయంకరంగా హాహాకారాలు చేస్తూ ఆవులించాడు. బాణాలన్నీ క్రింద పడిపోయాయి.

బ్రహ్మదేవుని వరప్రభావం వల్ల వాడి ప్రాణాలు పోలేదు. క్రుద్ధుడైన విరాధుడు రామ లక్ష్మణుల మీదికి ఉరికాడు. శూలమును పైకెత్తాడు. రాముడు ఆ శూలాన్ని బాణప్రయోగంచే ఆకాశమునందే ఖండించాడు.

త్రాచుపాముల వలె యున్న రెండు ఖడ్గములను రామలక్ష్మణులు చేతపట్టుకొని విరాధుని పైకి దుమికి వాడ్ని తీవ్రంగా కొట్టారు. విరాధుడు రామలక్ష్మణులను పట్టుకొని చిన్నపిల్లలను ఎక్కించుకొనునట్లు భుజాలపై ఎక్కించుకొని బయలుదేరాడు. రాముడు వాడి అభిప్రాయమును గ్రహించి అలా వాడితో వెళ్ళడం మంచిదేనని లక్ష్మణునికి చెప్పాడు. రామ లక్ష్మణులను భుజాలపై ఎక్కించుకొనిన విరాధుడు ఒక భయంకరమైన అరణ్యములో ప్రవేశించాడు.

విరాధుడు రామలక్ష్మణులను మోసుకొని పోవడం చూచి సీతమ్మ తీవ్రంగా రోదించింది.

"అయ్యో! నా రాముడు సత్యవంతుడు. శీలవంతుడు. ధర్మాత్ముడైన రాముని, లక్ష్మణుని ఈ రాక్షసుడు తీసికొని పోతున్నాడు. నన్నిక పులులు, సింహాలు భక్షిస్తాయి.

"ఓ రాక్షసుడా! నీకు దండాలు. సత్పురుషులైన రామలక్ష్మణులను విడచిపెట్టు. నన్ను తీసికొని పో!" అని సీతమ్మ రోదించింది.



రామలక్ష్మణులకు తన వల్లే ఈ ప్రమాదం వచ్చిపడిందని సీతమ్మ ఊహించింది. రాక్షసుడు తనను భక్షించినా ఫరవాలేదు. కానీ రామలక్ష్మణులు రక్షింపబడాలని భావించి అలా పలికింది.

సీతమ్మ మాటలను రామలక్ష్మణులు ఆలకించారు. దుష్టుడైన విరాధుని వధించాలని నిశ్చయించుకున్నారు. రాక్షసుని ఎడమ భుజాన్ని లక్ష్మణుడు ఖండించగా కుడిభుజాన్ని రాముడు ఖండించాడు. భుజములు విరిగిపోగానే విరాధుడు తెగిపడిన పర్వత శృంగము లాగా నేలపై కూలాడు.

రామలక్ష్మణులు వాడ్ని పిడికిళ్ళతో గ్రుద్దారు. మోచేతులతో కుమ్మారు. పాదాలతో తొక్కారు. ఎత్తి ఎత్తి క్రింద పడేశారు. బాణాలతో, కత్తులతో చిత్రవధ చేశారు. అయినా వాడు చావలేదు.

"లక్ష్మణా! వరప్రభావ కారణంగా అస్త్రశస్త్రాలతో వీడు మరణించడు. వీడ్ని పూడ్చిపెట్టడమే ఏకైక మార్గము. తమ్ముడూ! ఏనుగు కొరకు తీసినట్లు పెద్ద గొయ్యిని తవ్వు. వీడ్ని పాతిపెట్టేస్తాము" అన్నాడు రాముడు. విరాధుని శరీరంపై రాముడు పాదముతో త్రొక్కిపట్టి నిలబడ్డాడు.

## విరాధ వధ

రాముని పాదస్పర్శ తగలగానే విరాధునికి పూర్వస్మృతి కల్గింది. "రామా! అజ్ఞానినైన నేను నిన్ను గుర్తించలేక పోయాను. నీవు కౌసల్యా తనయుడవు. రాముడవు. నిన్ను నేను గుర్తించాను. జానకిని, లక్ష్మణుని కూడా గుర్తించాను.

"నేను పూర్వము తుంబురుడు అనే గంధర్వుడను. కుబేరుని శాపకారణంగా నేను రాక్షసుణ్ణయ్యాను. నా దుఃఖమును చూచి జాలిపడిన కుబేరుడు నన్ను అనుగ్రహించాడు. దశరథరాజ కుమారుడైన రామునితో పోరాడిన సమయంలో శాపవిమోచనం కలుగుతుందని చెప్పాడు.

"రామా! నన్ను ఉద్ధరించావు. నాకు శాపవిముక్తిని ప్రసాదించావు. మీకు శుభం కలుగుతుంది. నేను నీచే చంపబడి మా లోకానికి వెళ్తాను.

"తండ్రీ! ఇక్కడికి ఒకటిన్నర యోజనముల దూరంలో శరభంగుడనే మహర్షి ఉన్నాడు. అతడు ధర్మాత్ముడు. వీర్యవంతుడు. భాస్కర తేజోసమానుడు. నీవు అతనివద్దకు వెళ్ళు. నీకు శుభం కలుగుతుంది.

"రామా! నన్ను గోతిలో పాతిపెట్టు. రాక్షసులకు ఇది వంశానుక్రమంగా వస్తున్న ధర్మము;" అని పలికాడు విరాధుడు.

లక్ష్మణుడు గొయ్యిని తీశాడు. బాణముల తాకిడికి తీవ్రంగా గాయపడి, దుఃఖిస్తూ అరుస్తున్న విరాధుని లక్ష్మణుడు గోతిలోకి తోశాడు. అస్త్ర శస్త్రాలతో వధించుటకు సాధ్యపడని విరాధుని గోతిలో పూడ్చడం ద్వారా రామలక్ష్మణులు వధించారు. రాళ్ళతో, మట్టితో ఆ గోతిని పూడ్చేశారు.

విరాధుడు మరణించాడు. సంతోషించిన రామలక్ష్మణులు సూర్యచంద్రులవలె ప్రకాశించారు. సీతమ్మ సంతోషంతో రాముని సమీపించింది. ఈవిధంగా దండకారణ్యంలో ప్రథమంగా దుష్టుడైన విరాధుని రామలక్ష్మణులు వధించారు. ఈ సంఘటన వెనుక నిలిచి శోభిస్తున్న ఆధ్యాత్మిక విషయ వైభవాన్ని దర్శించి ఆనందిస్తాము.

**"విరాధః"** అంటే విరోధము అని అర్థము. విరోధము గలవాడే రాక్షసుడైన విరాధుడు. ప్రబలమైన శత్రువు అని భావము. రామలక్ష్మణులను ముందుకు పోనివ్వకుండా నిరోధించాడు.

మనిషికి ప్రబలమైన శత్రువు కామము లేదా కోరిక. కామమే విరాధుడు. జీవితారణ్యంలో ప్రవేశించి పయనించే వారి ప్రగతిని నిరోధించేది కామమే. విరాధుడు దండకారణ్యంలో సీతను అపహరించినట్లు జీవితారణ్యంలో కామము మనసును హరిస్తుంది.



రామునికి దూరమై సీతమ్మ వ్యథ చెందినట్లు, ఆత్మకు దూరమైన మనస్సు బాధలతో అల్లాడిపోతుంది. విరాధుని వధించాలని రామలక్ష్మణులు ఎన్నో అస్త్ర శస్త్రాలను వాడిపై ప్రయోగిస్తారు. అయినా వాడు చావడు. సాధకులు ఎంతగా ప్రయత్నించినా కామాన్ని జయించలేరు.

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః**
**మహాశనో మహా పాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥**

"రజోగుణము వలన పుట్టిన కామము సఫలం కానపుడు అది క్రోధముగా పరిణమిస్తూ వుంది. కామము తృప్తిచెందదు **(మహాశనః)**. గొప్ప పాపము గలది **(మహాపాప్మా)**. దీనిని విరోధిగా తెలుసుకో," అంటాడు భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ.

ప్రతి మనిషికీ తృప్తిచెందని కామమే విరోధి. ఆ విరోధియే అరణ్యకాండములో విరాధుడుగా తెలుస్తున్నాడు. నశించని విరోధిగా అగుపిస్తున్నాడు.

ఆధ్యాత్మిక సాధనలు నిరోధ స్వభావం కలవి. విషయపిపాసను, కామమును నిరోధిస్తాయి. భక్తి నిరోధరూపమని నారద భక్తిసూత్రాలు ప్రవచించిన విషయాన్ని ఈ కాండము ఆరంభమునందే మనం చర్చించాము.

భక్తి ప్రేమమయం. కనుక అది నిరోధరూపము. విషయపిపాస కామమయం. కనుక అది విరోధ స్వరూపము. విరోధ స్వరూపమే విరాధుడు. వధించుటకు సాధ్యపడిన కామమే విరాధుడు.

చివరగా విరాధుని శాశ్వతంగా భూమిలో పాతిపెట్టారు రామలక్ష్మణులు. అంతటితో వాడి పీడ విరగడైపోయింది. అక్కడనుండి సీతారామలక్ష్మణులు అరణ్యంలో సంతోషంగా ముందుకు వెళ్ళారు.

మనంకూడా నిత్యశత్రువైన ఈ కామమనే విరోధిని వధించాలి. కామమును జయించుట సులభసాధ్యం కాదు. విరాధుని రామలక్ష్మణులు భూమిలో పాతిపెట్టినట్లు, మన విరోధియైన కామాన్నికూడా హృదయ మడుగులోకి దింపి, మళ్ళీ లేవకుండా చేయాలి.

బహిర్ముఖమయ్యే మనస్సును అంతర్ముఖం చేసి, హృదయ గుహలోనికి మరలించి, అక్కడనుండి కదలకుండా చూడాలి. అప్పుడే మనసుకు స్వస్థత లభిస్తుంది.

ఈవిధంగా కోరికలచే బహిర్ముఖమయ్యే మనసును అంతర్ముఖం చేయడమే ఆధ్యాత్మిక సాధన. ఇదియే కర్మయోగము. భక్తియోగము. జ్ఞానయోగము. అన్నీ యోగాలూను. విరోధియైన కామాన్ని సంహరించుటకు ఉపకరించే ఉపాయాలన్నీ యోగాలే.

**హృత్ స్థలే మనః స్వస్థతా క్రియా**
**భక్తి యోగ బోధాశ్చ నిశ్చితం**

"హృదయగుహలో మనసును స్వస్థతగా ఉంచుటయే కర్మయోగము. అదియే భక్తియోగము. అదియే రాజయోగము. అదియే జ్ఞానయోగము. ఇది నిశ్చయము" అని భగవాన్ రమణమహర్షులవారు ఉపదేశసారంలో చెబుతారు.

నిరోధింపబడిన కామము ఆ తరువాత మనకు విరోధి కాదు. ఇంతవరకు విషయాలను అభిలషించింది. ఇకమీదట పరమాత్మను అభిలషిస్తుంది. వైషమ్యాలు ప్రేమలుగా మారిపోతాయి. విరాధుడుకూడా రామునికి నమస్కరిస్తూ మరణించాడు. శాపవిముక్తిని పొందగానే విరాధుడు రాముని ప్రార్థిస్తూ ఒక విషయాన్ని విచిత్రంగా కోరుతాడు. ఇది అధ్యాత్మ రామాయణంలో ఉంది.

**ఇతః పరం త్వచ్చరణారవిందయోః**
**స్మృతి స్సదా మేఽస్తు భవోపశాంతయే**

"రామా! ఇకమీదట నీ చరణకమలములు సదా నా స్మృతిలో నిలిచియుండుగాక! సంసారిక తాపత్రయాలన్నీ నశించుగాక!" అని విరాధుడు ప్రార్థించాడు.

విరోధియైన కామం ఆంతర్యంలో నిలిచియున్నంత కాలము మనకు శాంతి కలగదు. తాపత్రయాలు నశించవు. పరమాత్మయొక్క పాదపద్మాలు ఎవరికి స్మృతిలో ఉంటాయో వారిని తాపత్రయాలు బాధించవు. పైగా దూరమవుతాయి. ఇది విరాధ వధలోని విమలసందేశము.

## శరభంగ మహాముని

శ్రీరాముడు విరాధుని వధించాడు. వ్యథచెంది దుఃఖిస్తున్న సీతమ్మను ఓదార్చాడు. లక్ష్మణునితో ఇలా పలికాడు.

"లక్ష్మణా! ఈ దండకారణ్యం చాలా దుర్గమంగా వుంది. ఆపదలకు నిలయంగా తెలుస్తోంది. మనకు అరణ్యసంచారము అలవాటు లేదు. తొందరగా శరభంగ మహాముని వద్దకు వెళ్ళడం ఉత్తమం" అన్నాడు రాముడు.

జానకీలక్ష్మణులు రాముని అనుసరించి నడిచారు. శరభంగుని ఆశ్రమ సమీపానికి వచ్చారు. ఆ సమయానికి ఇంద్రుడు అక్కడికి వచ్చియున్నాడు. సూర్యబింబంలా వెలిగిపోయే రథంలో ఆసీనుడై, భూమిపైకి దిగకుండా ఆకాశంలోనే నిలిచి శరభంగునితో సంభాషిస్తున్నాడు ఇంద్రుడు.

"లక్ష్మణా! ఆకుపచ్చని అశ్వములతో తేజోవంతంగా శోభించే ఆ రథములో ఆసీనుడై యున్న దివ్యపురుషుడు మనం పూర్వము ఆలకించిన ఇంద్రుడే అని నా అభిప్రాయము. నీవు సీతతోకూడా ఇక్కడే ఉండు. నేను తెలుసుకొని వస్తాను" అని రాముడు శరభంగాశ్రమము వైపు నడువసాగాడు.

రాముడు తనను సమీపించుటకు వస్తున్నట్లు గ్రహించిన ఇంద్రుడు శరభంగునితో ఇలా పలికాడు.

"రాముడు నన్ను సమీపించుటకు వస్తున్నాడు. అతడు నాతో భాషించే లోపుగా నేను వెళ్ళిపోతాను. అతనికి కార్యసిద్ధి లభించిన పిదప అతనిని దర్శిస్తాను. అతడు గొప్ప కార్యము సాధించవలసి ఉంది. ఈలోగా నేను అతనిని చూడకూడదు" అని పలికి, శరభంగుని సమాధానమును ఆలకించి మహేంద్రలోకానికి వెళ్ళాడు ఇంద్రుడు.



ఇంద్రుడు వెళ్ళడం గమనించిన రాముడు లక్ష్మణుని, సీతను వెంటబెట్టుకొని శరభంగుని వద్దకు వచ్చాడు. శరభంగమహర్షికి పాదప్రణామం చేశారు ముగ్గురూ. మహర్షి వారిని ఆహ్వానించాడు.

"మహాత్మా! ఆ వచ్చిన వ్యక్తి ఇంద్రుడని అభిప్రాయపడుతున్నాను. నిజమేనా? ఇంద్రుడైతే, ఎందుకు వచ్చినట్లు?" అని ప్రశ్నించాడు రాముడు.

"రామా! నిజమే. ఆయన వరప్రదాత యగు ఇంద్రుడే. తపస్సుద్వారా పునీతమైన నన్ను బ్రహ్మలోకానికి తీసికొనిపోవాలని వచ్చాడు.

"రాఘవా! నీవు దగ్గరికి వచ్చియున్నావని గ్రహించిన నేను నిన్ను దర్శించకుండా బ్రహ్మలోకానికి వెళ్ళుటకు సమ్మతించలేదు. నిన్ను దర్శించాను. ఇక బ్రహ్మలోకం చేరుతాను;" అన్నాడు శరభంగమహర్షి రామునితో.

కార్యసిద్ధి అయ్యేవరకు రాముని దర్శించ నని పలికి ఇంద్రుడు వెళ్ళిపోయాడు. ఇంద్రియాలకు ప్రభువే ఇంద్రుడు. తపస్సు నాచరించు వారిని ఇంద్రియ విషయాలు కలత పెట్టకూడదు. తరించిన వానిని ఇంద్రియాలు మోహానికి గురిచేయలేవు.

బ్రహ్మలోకానికి తీసికొనిపోవుటకు ఇంద్రుడు వచ్చినా శరభంగుడు అందుకు అంగీకరించలేదు. రాముని దర్శించనిదే రాలేనని చెప్పాడు. తపస్సు కారణంగా అనేక సిద్ధులు సంక్రమించవచ్చు. లోకాలు ప్రాప్తించవచ్చు. సత్యదర్శనం చేయనిచో ఏ లోకాలను చేరినా శోకాలు దూరంకావు. పరమపురుషార్థమైన మోక్షమును పొందుటయే జీవికి ఏకైక లక్ష్యము. అందుచేత మహేంద్రుడు అభ్యర్థించినా శరభంగుడు నిరాకరించాడు.

యవ్వనమనే కాలం అనుకూలంగా వున్నా, ఇంద్రియాలు సానుకూల వాతావరణాన్ని దర్శింపజేసి ప్రేరేపించినా, ఆశల అంబారీలో ఊరేగాలనే ఆత్రుతను కనబరచనివాడే శరభంగుడు.

మనసు సంధించే ఆశా శరములను భంగమొనర్చినవాడే శరభంగుడు. ఆశలు దుఃఖానికి కారణములు. అనిత్యమైన ప్రపంచంలో ఏది ఆశించినా మనిషికి దుఃఖమే కలుగుతుంది. అనిత్య విషయాలు నిత్యశాంతిని ఎలా ప్రసాదిస్తాయి?

**If a thing is not loved, no quarrels will arise concerning it, no sadness will be felt if it perishes, no envy if another has it, in short no disturbances of the mind. All these spring from the love of that which passes away. But the love of a thing eternal and infinite fills the mind wholly with joy, and is unmingled with sadness.**

"ఒక వస్తువును మనం ప్రేమించకపోతే దానిని గూర్చి మనకు తగాదాలుండవు. అది నశిస్తే మనకు బాధ కలుగదు. దానిని మరొకరు పొందితే అసూయ ఉదయించదు. ఒక్క మాటలో చెబితే, మనోసంక్షోభమే ఉండదు. గతించే వాటిని ప్రేమించడం వల్లనే మనకు దుఃఖాలన్నీ సంక్రమిస్తాయి. అయితే అనంతము, శాశ్వతము నైన దానిని మనం ప్రేమించగలిగితే దుఃఖమిశ్రితం కాని పూర్ణానందంతో మనసు నిండుతుంది" అంటాడు స్పైనోజా.

అందుచేత ఆశల పల్లకీలో కూర్చోవాలని భావించలేదు శరభంగుడు. ఆశయసిద్ధికై పరితపించాడు. రాముని దర్శించాడు. రామదర్శనం ప్రాప్తించిన పిదప ఏ లోకాల్లో సంచరించినా, ఏ శోకాల్లో గమించినా దుఃఖాలు దరిచేరవు. కనుక ఇప్పుడు ఇంద్రుడు అభ్యర్థించినట్లు బ్రహ్మలోకానికి వెళ్ళడానికి శరభంగుడు సమ్మతించి, రామునితో ఇలా పలికాడు.

"రామా! నా తపస్సు కారణంగా అనేక పుణ్యలోకాలను నేను ఆర్జించాను. వాటిని నీకు సమర్పిస్తాను. స్వీకరించు," అన్నాడు శరభంగ మహాముని.

ఇది సమర్పణభావం. త్యాగజీవనం. సర్వధర్మాలను పరిత్యజించి, పరమాత్మని ఒక్కడినే శరణువేడడం.

కానీ రాముడు తాను దేవుడని అంగీకరించడు. ఆదర్శాన్ని అందించేందుకు అవతరించిన మర్యాద పురుషోత్తముడు తాను ఆత్మారాముడని అంగీకరించడు. అందుచేత శరభంగ మహాముని సమర్పించిన పుణ్యాన్ని సమ్మతించక, సాధకులైనవారు ఆచరించవలసిన ఆదర్శాన్ని అమలుపరుస్తూ ఇలా భాషించాడు.

**అహమేవా హరిష్యామి సర్వాన్ లోకా న్మహామునే**
**ఆవాసం త్వహమిచ్ఛామి ప్రదిష్ట మిహ కాననే ॥**

"మహర్షీ! నీవు చెప్పిన పుణ్యలోకాలన్నీ నేనే ప్రయత్నించి సంపాదించుకుంటాను. ఈ వనంలో నేను వసించుటకు యోగ్యమైన ప్రదేశమును చూపిస్తే చాలు" అన్నాడు రాముడు.

ఈమాటే సాధకులకు శ్రీరామరక్ష. సాధకుడు ఋజు మార్గానువర్తియై ఉండాలి. శోధించి సాధించేవాడే సాధకుడు. తన సాధన ద్వారా సాధ్యవస్తువును సాధించుకో గలవాడే ధీరుడైన సాధకుడు.

ఏ సాధనలు చేయకుండా, ఏ గురువైనా మోక్షాన్ని పొట్లంకట్టి ఇస్తాడేమో? అని ఎదురు చూచే దద్దమ్మ సాధకుడు కాడు. తస్కరుడు. దొంగ. దొంగ రాజెలా అవుతాడు? సింహాసనాన్ని ఎలా అధిరోహిస్తాడు?

సాధకుడు పాపాన్ని చూసి భీతిచెందాలే కానీ సాధనను చూసి కాదు. సోమరిపోతు పొందేదేమీ ఉండదు మృత్యువు తప్ప. శరభంగుడు ఇస్తున్నా రాముడు అంగీకరించడం లేదు. తాను సాధించుకున్నప్పుడే తనకు తృప్తి అని భావిస్తున్నాడు.

మనంకూడా గురువులను ఆశ్రయించి శాస్త్రాన్ని, సాధనల్ని నేర్చుకోవాలి. వాటిని సంతోషంతో ఆచరించాలి. అంతేకాని గురువులు మాయలు చేయాలని, మహిమలు చూపాలని, దీవించి దివికి పంపాలని, కరుణించి కైవల్యాన్ని ప్రసాదించాలని అభిలషించకూడదు.

నాకు సన్నిహితుడైన భక్తుడు నేను వాళ్ళ ఊరికి వెళ్ళినపుడు పసుపు కుంకుమ పెట్టిన ఒక ఇటుకరాయిని చేతపట్టుకొని నాముందు ప్రత్యక్ష మవుతాడు.



"స్వామీ! ఆశీర్వదించండి," అంటాడు తాను నిర్మించబోయే భవనం శోభాయమానంగా రూపుదిద్దుకోవాలని భావిస్తూ. ఇలా చాలాసార్లు జరిగింది. నేను ఆ ఇటుకను చేత్తోతాకి ఇస్తూ ఉంటాను. ఏం చేసేది?

నేను అనుకుంటూ ఉంటాను. ఈ కిటుకేమిటో అర్థంకాదుగాని ఎప్పుడూ ఇటుకతోనే వస్తాడు. కూలిపోయే వాటికి, కాలిపోయే వాటికి ఆశీర్వాదం ఇమ్మంటాడేగాని, కైవల్యసిద్ధికి ఆశీర్వదించండి అని అడగడే? చెప్పే ఉపన్యాసాలన్నీ ఏమైనట్లు? వ్రాసిన పుస్తకాలన్నీ ఎక్కడికి పారిపోయినట్లు? అని.

చివరికి అతని ఉబలాటాన్ని నిరోధించలేకపోయినా నన్ను నేను ఊరడించుకుంటూ ఉంటాను. పోనీలే ఏమైంది? మనం చెప్పే జ్ఞానం ఆయనకు అవసరంలేదు. ఆయన కోరేది ఇచ్చే శక్తి ఎలాగూ నాకు లేదు. ఏదీలేనిచోట అనవసరంగా చింత మాత్రం ఎందుకు? అని సరిపెట్టుకుంటాను.

మనమంతా మోక్షాన్నే వాంఛించాలి. శరభంగునివలె అన్యమైన ఆశలను త్యజించాలి. అలాగే ప్రలోభాలకు గురికాకుండా, ఋజుమార్గంలో రామునివలె జీవించి, సాధించుటకు ప్రయత్నించాలి.

శరభంగ మహాముని రామునితో ఇలా పలికాడు.

"రామా! ఈ అరణ్యంలో సుతీక్ష్ణుడనే ముని ఉన్నాడు. ఆయన గొప్ప తేజోవంతుడు. పరమ ధార్మికుడు. నియమశీలుడు. ఆ మహాత్ముని ఆశ్రయించు. ఆయన నీకు శ్రేయస్సు కలిగే ఉపాయము చెప్తాడు.

"రామా! చిన్నచిన్న తెప్పల్లాగా పుష్పపంక్తులు తేలియాడుతూ వెళ్తున్న ఈ నదీ ప్రవాహము ననుసరించి వెళ్తే ఆ మహాత్ముని ఆశ్రమం వస్తుంది;" అన్నాడు శరభంగుడు.

విజ్ఞాన సుమములతో నిండి ప్రవహించే సనాతనధర్మ స్రవంతిని అనుసరించి పయనించువారికే మహాత్ముల సందర్శనం లభిస్తుంది. మహాత్ముల సహచర్యంలో జ్ఞానం, శాంతి ప్రాప్తిస్తుంది.

తనకు రామదర్శన భాగ్యం లభించింది. సుతీక్ష్ణ మహామునికి కూడా రామదర్శనం ప్రాప్తించాలని శరభంగుడు ఆలోచించాడా? ఏమో! అదీ నిజమే కావచ్చు. **"స తరతి లోకాం స్తారయతి"** తాను తరించి, లోకాన్ని తరింపచేయడమే కదా సనాతనధర్మ జీవన వైభవము.

శరభంగుని మాటలను ఆలకించి శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై సుతీక్ష్ణాశ్రమాన్ని దర్శించేందుకు ఉద్యుక్తు డయ్యాడు. అది గమనించిన శరభంగ మహాముని ఇలా పలికాడు.

"రామా! ఏష పన్థా - సుతీక్ష్ణముని ఆశ్రమానికి వెళ్ళే దారి ఇదే. రాఘవా! తండ్రీ! ఒక క్షణం ఆగు. నన్ను చూడు. పాము కుబుసమును విడుచునట్లు ఈ నా దేహాన్ని త్యజిస్తాను" అని పలికి, అగ్నిని ప్రతిష్ఠించి, ఆజ్యహోమం చేసి హోమగుండంలో ప్రవేశించాడు.



శరభంగుని దేహాన్ని అగ్నిదేవుడు దగ్ధం చేశాడు. కొన్ని క్షణాల్లో శరభంగుడు నవ యౌవనవంతుడై అగ్నిహోత్రం లాగా హోమ గుండం నుండి పైకిలేచి శోభించాడు.

శరభంగ మహాముని బ్రహ్మలోకానికి పయనమై వెళ్ళాడు.

**పితామహ శ్చాపి సమీక్ష్య తం ద్విజం**
**ననన్ద సుస్వాగత మిత్యువాచ హ ॥**

బ్రహ్మదేవుడు శరభంగుని చూచి, సంతోషించి, "సుస్వాగతం" అని ఆహ్వానించాడు.

రాముని ఎదుట, రాముని అనుగ్రహ వీక్షణాలు పడుతూ ఉండగా శరభంగుడు రాముని దర్శిస్తూ దేహాన్ని త్యజించాడు. శరభంగుని భాగ్యమే భాగ్యము!

**"సర్వము న్నతని దివ్యకళామయము"** అని భాగవతోత్తముడు ప్రహ్లాదుడు దర్శించినట్లు రామదర్శనంలో రమ్యచరితు డయ్యాడు శరభంగ మహాముని. ఆయన మనసంతా రామునియందే నిలిచింది. నేత్రాలలో రాముడే నిలిచిపోయాడు. ఆహా(.... తపోమహిమ ఎంత వైభవము?

**నేను ఎచట జూచినను నీవై యున్నది**
**భానువంశ తిలకనీదు భక్తుడనుచు పేరుగనుక ॥**
**కపటమౌ మాటలెల్ల కమ్మనైనది**
**తపము యోగఫలము నీవే త్యాగరాజ సన్నుత ॥**

ఇది శరభంగుని విభవమా! త్యాగయ్య ప్రాభవమా!

**జై జై శరభంగ మహర్షికీ!**

## అభయప్రదానం

శరభంగ మహాముని బ్రహ్మలోకం వెళ్ళాడు. ఆయన వెళ్ళిన తరువాత అక్కడ నివసించే ఋషులందరూ వచ్చి రాముని దర్శించారు. ఆ ఋషిగణములో వైఖానసు లున్నారు. వాలఖిల్యు లున్నారు. ఇంకా, చంద్ర కిరణములను ఆహారముగా తీసికొనువారు, పత్రాహారులూ, ధాన్యాహారులూ, నీటిపై తేలుతూ తపస్సు చేయువారు, చేతులే తలగడాగా పెట్టుకొని శయనించువారు, జలాహారులూ, వాయుభక్షకులూ, ఆకాశమున నిలిచి తపస్సు చేయువారు,



నేలమీద పడుకొనేవారు, తడిబట్టలు కట్టుకొనేవారు, పంచాగ్ని తపస్సు చేయువారు - ఈ విధంగా అనేక సాధనలు చేయు మహర్షులు శరభంగాశ్రమములో శ్రీరాముని దర్శించారు. మునులందరూ బ్రహ్మ వర్చస్సుతో శోభిస్తున్నారు. యోగులైన వీరంతా జితేంద్రియులు, జితక్రోధులై ఉన్నారు. వారంతా రాముని సమీపించి ఇలా పలికారు.

"రామా! దేవతలకు దేవేంద్రుడులాగా ఇక్ష్వాకువంశానికి, మాకు నీవు నాథుడవు. నీ కీర్తివైభవాలు ముల్లోకము లందును వ్యాపించి ఉన్నాయి. సత్యము, ధర్మము, పితృభక్తి నీలో పుష్కలంగా ఉన్నాయి.

"దాశరథీ! నీవు ధర్మాత్ముడవు. మహాత్ముడవు. ధర్మాసక్తుడవు. నీవద్దకు మేము యాచకులమై వచ్చాము. అందుకు నీవు మమ్మల్ని క్షమించాలి.

"ప్రభూ! ఏ రాజు ప్రజల ఆదాయంలో ఆరోవంతు పన్నుల రూపంలో గ్రహించి, ప్రజలను కన్నబిడ్డలవలె పాలించడో అట్టి రాజుకు గొప్ప పాపం సంక్రమిస్తుంది.

"తన రాజ్యములోని పౌరులను కన్నబిడ్డలవలె, ప్రాణతుల్యంగా సదా రక్షిస్తూ ఉంటాడో అట్టి రాజునకు శాశ్వతమైన కీర్తి లభిస్తుంది. ఆ తరువాతకూడా బ్రహ్మలోక ప్రాప్తి సిద్ధిస్తుంది.

"ప్రజలను ధర్మబద్ధంగా పాలించే రాజుకు కందమూల ఫలాలు మాత్రమే ఆరగించి మహర్షులు చేయు తపస్సులో నాల్గవవంతు లభిస్తుంది.

"రామా! నీలాంటి ధర్మాత్ముడు ప్రభువుగా ఉన్నప్పుడు కూడా తాపసులకు దుఃఖం తప్పడంలేదు. ఈ దండకారణ్యంలో భయంకరమైన పరిస్థితులు కొనసాగుతున్నాయి. రాక్షసులు పవిత్రులైన అనేకమంది మునులను పొట్టన పెట్టుకున్నారు.

"రామా! నదీతీరముల యందు పడియున్న వారి శరీరాలను చూడు. పంపా తీర వాసులు, మందాకినీనదీ తీరవాసులు, చిత్రకూటపర్వత వాసులు అయిన మునులను రాక్షసులు తీవ్రంగా బాధించి వధిస్తున్నారు.

"ప్రభూ! ఈ రాక్షసులు పెట్టే బాధలు మేము భరించలేము. మేము నీకు శరణాగతులము. మమ్ము రక్షించు. రామా! నీవు అసమాన పరాక్రమవంతుడవు. నీవే మమ్మల్ని రక్షించాలి;" అని పలికారు మునులు. మహర్షుల మాటలను ఆలకించి రాముడు ఇలా పలికాడు.

"మునీశ్వరులారా! మీరు నన్ను ఇలా ప్రార్థించడం ధర్మం కాదు. మీరు మహర్షులు. నన్ను ఆజ్ఞాపించండి. నేను నా వ్యక్తిగత కార్యార్థమై ఈ అరణ్యంలో ప్రవేశించాము. అయినా మిమ్మల్ని బాధావిముక్తుల్ని చేస్తాను. మీ కార్యమును సాధించిపెట్టడం నా భాగ్యంగా భావిస్తాను. నాకు అదెంతో లాభదాయకము.

"మా శత్రువులైన రాక్షసులను మేము తప్పక సంహరిస్తాము. మీరందరూ మా అన్నదమ్ముల శక్తి సామర్థ్యములను వీక్షించండి;" అని రాముడు మునులకు అభయప్రదానం చేశాడు. సీతాలక్ష్మణులతో పాటు మునులు కూడా వెంటరాగా శ్రీరాముడు సుతీక్ష్ణమహాముని వద్దకు బయలుదేరాడు.

## సుతీక్ష్ణాశ్రమ ప్రవేశం

సీతారామలక్ష్మణులు మహర్షులతో కలిసి చాలాదూరం నడిచారు. అనేక నదులను దాటారు. చివరికి మేరుపర్వతమువలె యెత్తయిన పర్వతాన్ని చూశారు. అదొక భయంక రారణ్యంలా గోచరిస్తోంది. దట్టమైన వృక్షాలతో శోభిస్తూ వుంది.

అక్కడ అందమైన, ప్రశాంతమైన ఆశ్రమం ఒకటి కన్పించింది. అదే సుతీక్ష్ణాశ్రమం. ఆశ్రమం బయట నారబట్టలు ఆరేసి వున్నాయి.

రాముడు ఆశ్రమంలోకి ప్రవేశించాడు. తపోధనుడైన సుతీక్ష్ణమహర్షి అక్కడ ఆసీనుడై ఉన్నాడు. ఆయన దేహమంతా దుమ్మూ, ధూళీ నిండి ఉంది.

"పూజ్య మహర్షీ! నేను రాముణ్ణి. నిన్ను దర్శించుటకు వచ్చాను.నన్ను అను గ్రహించు;" అని సున్నితంగా సూక్ష్మంగా భాషించాడు రాముడు. సుతీక్ష్ణుడు రాముని ఆలిం గనం చేసుకొని ఇలా పలికాడు.

"రామా! రఘుకులశ్రేష్ఠా! స్వాగతము. నీవు పాదము మోపుటచేత ఈ ఆశ్రమం నేడు రక్షింపబడింది. రామా! నేను నీకొరకు నిరీక్షిస్తున్నాను. రాజ్యాన్ని పోగొట్టుకొని నీవు చిత్రకూటం చేరావని విన్నాను. నీ దర్శనభాగ్యం లభిస్తుందని విశ్వసించి, ఈ దేహాన్ని త్యజించి స్వర్గలోకం వెళ్ళలేదు.

"రామా! నేను తపస్సుచే సాధించిన పుణ్యలోకాలన్నీ నీకు సమర్పిస్తున్నాను. నీవు వాటిలో విహరించి అనుభవించు;" అన్నాడు సుతీక్ష్ణుడు

"మహాత్మా! సత్కర్మలను ఆచరించి ఆ పుణ్యలోకాలను నేనే సంపాదించుకుంటాను. ఈ వనంలో వాసయోగ్యమైన స్థానాన్ని మీరు చూపిస్తే చాలు" అని శరభంగునితో పలికినట్లే సుతీక్ష్ణునితో కూడా పలికాడు శ్రీరాముడు.

"రామా! ఈ ఆశ్రమంలో అనేకమంది ఋషులు వసిస్తున్నారు. కందమూల ఫలాలు ఇక్కడ సమృద్ధిగా లభిస్తాయి. ఈ ఆశ్రమంలోనే నీవు జీవించవచ్చు.

"ఈ ఆశ్రమ సమీపానికి క్రూరమృగాలు వచ్చి భయపెట్టి, నిర్భయంగా వెళ్తూవుంటాయి. అవి ఎవ్వరినీ చంపవు. ఇక్కడ మృగముల వల్ల తప్ప మరొకవిధమైన బాధ లేదు" అన్నాడు సుతీక్ష్ణమహర్షి.

"మహర్షీ! క్రూరమృగాలు ఈ ఆశ్రమ ప్రాంతంలో గోచరించినపుడు నేను వాటిని వధించవచ్చు. వాటిపై మీకు దయ ఉండవచ్చు. వాటిని నేను చంపుటవల్ల మీకు బాధ కలుగవచ్చు. కనుక ఈ ఆశ్రమంలో ఎక్కువకాలం ఉండటం మంచిది కాదని భావిస్తు న్నాను;" అని పలికి రాముడు వెళ్ళి సంధ్యావందనం చేశాడు. ఆ రాత్రి అతిథులైన సీతారామ లక్ష్మణులకు సుతీక్ష్ణుడు స్వయంగా ఆహారాన్ని సమర్పించాడు.

ప్రాతఃకాలమున దేవతార్చనము పూర్తిచేసికొని, సూర్యుని దర్శించి, సుతీక్ష్ణుని దగ్గరకు వచ్చారు సీతారామలక్ష్మణులు. రాముడు సుతీక్ష్ణునితో ఇలా భాషించాడు.



"మహాత్మా! మీ ఆతిథ్యముతో మేము సంతృప్తి చెందాము. ఈ మునులందరు తొందర పెడుతున్నారు. మేముకూడా దండకారణ్యము లోని మున్యాశ్రమాలను దర్శించాలని కుతూహల పడుతున్నాము. మాకు అనుజ్ఞను ప్రసాదించండి" అని సుతీక్ష్ణమహర్షి పాదములను స్పృశించారు రామలక్ష్మణులు. వారిని లేవదీసి ఆలింగనం చేసుకొని మహర్షి ప్రేమభాషణం చేశాడు.

**అరిష్టం గచ్ఛ పన్థానం రామ సౌమిత్రిణా సహ**
**సీతయా చానయా సార్థం ఛాయయేవాను వృత్తయా**

"రామా! లక్ష్మణునితో, నీడవలె అనుసరిస్తున్న సీతతో కలిసి మంగళకరమైన మార్గము నందు పయనించు.

" రామా! తపస్సుచేత పవిత్రులైన మహర్షులు ఈ దండకారణ్యములో అనేకులున్నారు. వారి రమ్యమైన ఆశ్రమాలను దర్శించు. రామా! ఆశ్రమాలను, వనప్రదేశాలను దర్శించిన తరువాత, మరల ఈ ఆశ్రమానికి తప్పక రా!" అని పలికాడు సుతీక్ష్ణుడు. 'అలాగే' అని పలికి మహర్షికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి రాముడు బయలుదేరాడు.

సీతమ్మ అంబులపొదులను, ధనుస్సులను, ఖడ్గములను తెచ్చి రామలక్ష్మణుల కిచ్చింది. వారు వాటిని గ్రహించి ధరించి ఆశ్రమమునుండి బయలుదేరారు. ఇంతవరకు మనం చూసిన కథలో సీత ధనుర్బాణాలను, ఖడ్గమును తెచ్చి వారికిచ్చినట్లు లేదు. ఇక్కడే సీతమ్మ తాముగా తీసికొనివచ్చి వారికి అందించడం చూస్తున్నాము.

ప్రత్యేకించి ఇంత చిన్న విషయాన్ని ఎందుకు ప్రస్తావించానంటే, ఆశ్రమము నుండి బయలుదేరిన తరువాత మార్గమధ్యంలో సీతమ్మ ఒక సమస్యను చర్చిస్తుంది. ఆ సమస్యకీ ఇక్కడ ధనుర్బాణాలు తెచ్చి ఇవ్వడానికీ సమన్వయం ఏదైనా కుదురుతుందేమో ఆలోచిస్తారని ఇక్కడ ఆ విషయాన్ని ప్రస్తావించాను.

## ధర్మపత్నిగా సీతమ్మ

సీతారాములు దారిలో నడుస్తున్నారు. సీతమ్మ రాముని చూచి ఊహించని రీతిలో ఇలా భాషించింది.

"ఈ మునివృత్తి చాలా జాగ్రత్తగా ఆచరింప వలసింది. మునిధర్మం చాలా సూక్ష్మ పద్ధతిని అవలంబించి ఆచరించాలి. కామము వలన పుట్టిన వ్యసనాలకు దూరంగా ఉన్నవాడే దీనిని ఆచరించగలడు" అంటూ ప్రారంభించి మెల్లగా చెప్పసాగింది సీతమ్మతల్లి.

సీతమ్మ రామునితో చెప్తోంది.

"కామము వలన కలిగే వ్యసనాలు మూడుగా తెలుస్తున్నాయి. మొదటిది అసత్యభాషణం. ఇది చాలా పెద్ద వ్యసనం. తక్కినవి రెండు దీనికంటె గొప్పవి. అవి పరస్త్రీ గమనము, అకారణ హింస.

"రామా! మొదటి వ్యసనమైన అసత్యభాషణము నీకు అలవడలేదు. పూర్వము నీవు ఎప్పుడూ అసత్యమాడి ఎరుగవు. ఇకముందు కూడా నీవు అబద్ధమాడవు;" అన్నది సీతమ్మ.

ఈవిధంగా, అంటే రామునిలాగా ఎందరు పురుషులు భార్యల దగ్గరనుండి ఈవిధమైన యోగ్యతాపత్రాన్ని పొందగలరు? "ఆ- ఆయనంతే! పొరపాటున కూడా భార్యతో నిజం చెప్పకూడదని పెళ్ళిపీటలమీదనే ఎవరికి వినిపించకుండా లోపలే ప్రమాణం గొణిగేసుకున్నాడట. ప్రాణాన్నైనా త్యజిస్తాడు గాని నిజం మాత్రం చెప్పడు," ఇలాంటి మాటలే ఎక్కువశాతం భార్యల నుండి వింటుంటాము.

భార్యకు తనపై పూర్ణవిశ్వాసం ఉండేలా జీవించగలవాడే భర్త. మెడలో తాళికట్టడం, గుడిలో గంటకొట్టడం ఏమంత ఘనమైన కార్యం కాదు. కళా కాదు. ఎవరైనా చెయ్యొచ్చు. రామునిలా ఆదర్శాన్ని నిలపగలవారే భర్త అనే పదానికి వన్నె తెస్తారు.

సీతమ్మ ధారావాహికంగా మట్లాడేస్తోంది.

"రామా! మొదటి వ్యసనమైన అసత్యభాషణము నీవెలా ఎరుగవో, రెండవ వ్యసనమైన పరభార్యా గమనము నీ విషయంలో అసంభవము. పరస్త్రీ వాంఛ నీకు గతంలో కలగలేదు. ఇప్పుడు లేదు. భవిష్యత్తులో ఉండబోదు" అన్నది సీతమ్మ.

## జై జై శ్రీరామచంద్ర భగవాన్ కీ!

"రామా! నీ అర్ధాంగిని తప్ప మరొక స్త్రీని నీ మనసు వాంఛించదు. నీవు ధర్మాత్ముడవు. సత్యసంధుడవు. పితృవా క్యపరిపాలకుడవు. సత్యధర్మాలు నిన్నే ఆశ్రయించి ఉన్నాయి. నీవు జితేంద్రియుడవు.

"రామా! ఇంతవరకు నీలో ఈ మూడు వ్యసనాలు ఉండేవి కావు. కానీ ఈనాడు వన వాస సమయాన ఆకస్మికంగా మూడవ వ్యసనము నీకు కల్గింది. అదియే నిష్కారణ హింస, నిర్హేతుక శత్రుత్వము.

"దండకారణ్యములోని సాధువులను రక్షించుటకు రాక్షసులను వధిస్తానని నీవు ప్రతిజ్ఞ చేశావు. ఇప్పుడు నీ మనస్సు ఆ విషయమునందే లగ్నమై ఉంది. ఈ విషయము నా మనసును కలత పెడ్తూవుంది. సదా అన్నివిధాల నీ క్షేమాన్నే ఆశించు నా మనస్సు తీవ్రంగా వ్యథ చెందుతూవుంది.

"రామా! నీవు దండకారణ్యంలో ప్రవేశించుట నాకు సమ్మతం కాదు. కారణంకూడా చెప్తాను. విను. దండకారణ్యంలో ఎదురుపడిన క్రూరమృగాలను చూసి వాటిపై బాణాల్ని సంధించకుండా ఉండగలవా? రాక్షసుల్ని సంహరించకుండా ఉండగలవా?

"అగ్నికి దగ్గరగా వున్న కట్టెలు అగ్నియొక్క తేజస్సును, బలాన్ని వృద్ధిచేస్తాయి. అలాగే క్షత్రియునికి దగ్గరగా వున్న ధనుర్బాణాలు అతని తేజోబలాలను పెంపొందిస్తాయి. దీనికి ఒక చిన్న ఉపాఖ్యానముంది. అదికూడా చెబుతాను.

"పూర్వము ఒక పవిత్రమైన ఆశ్రమం ఉండేది. ఆశ్రమవాసి యైన ముని సత్యమునే పలుకుచుండేవాడు. ఆ ఆశ్రమ సమీపంలో మృగాలు, పక్షులు కూడా నిర్భయంగా చరిస్తుండేవి.

"ఒకనాడు ఆ మహర్షి తపస్సును భగ్నం చేయాలని సంకల్పించిన ఇంద్రుడు భటుని రూపమును ధరించి, చేతిలో ఖడ్గమును పట్టుకొని ఆశ్రమానికి వచ్చాడు. "మహాత్మా! నేను



మళ్ళీ వచ్చి తీసుకుంటాను. అంతవరకు ఈ ఖడ్గాన్ని మీదగ్గర దాచండి" అని చెప్పి దానిని మునికి ఇచ్చి వెళ్ళాడు.

"ఇక అప్పట్నుంచి తన విశ్వాసాన్ని ఋజువు చేసుకొనే ప్రయత్నంలో ఆ ఖడ్గాన్ని వదలి పెట్టకుండా చేతపట్టుకొనే తిరిగేవాడు ఆ మహర్షి.

"ఎప్పుడూ ఖడ్గాన్నే పట్టుకొని తిరగడంవల్ల క్రమేపీ తపస్సు క్షీణించింది. వీరకృత్యాలు సాగించాలనే ఉబలాటం కలిగింది. అంతే. స్వధర్మం పూర్తిగా పోయింది. వీరకృత్యాలు - ఘోరకృత్యాలై దుర్భర నరకాన్ని ప్రసాదించాయి.

"అగ్ని సంబంధము ఎలా ప్రమాదకరమో శస్త్ర సంబంధము కూడా ప్రమాదకరమే. రామా! ఈ ఉపాఖ్యానముగాని, శస్త్రముల విషయంగాని నీకు తెలియదని నా ఉద్దేశ్యం కాదు. నీయందు నాకు గల గౌరవము, ప్రేమలే నాచే ఇలా మాట్లాడించాయి.

"రామా! నీకు, దండకారణ్యంలోని రాక్షసులకు ఏవిధమైన వైరమూ లేదు. వారిని నిష్కారణంగా నీవు చంపాలని నిర్ణయించుకోవడం నాకు నచ్చడంలేదు. నీకు అపరాధం చేయని వారిని చంపడం మంచిదికాదు. స్వధర్మాన్ని అనుష్ఠించే క్షత్రియులకు ఆర్త రక్షణం కొరకు ఆయుధాలు ఉపకరించాలి.

**క్వచ శస్త్రం క్వచ వనం క్వచ క్షాత్రం తపః క్వచ**

"ఆయుధ మెక్కడ? అరణ్య మెక్కడ? క్షత్రియధర్మము ఎక్కడ? తపస్సెక్కడ?

"రామా! ఇదంతా పరస్పర విరుద్ధము. చూడు. ఆయుధము పట్టడంవల్ల మనసు వికారం చెందుతుంది. మనం తిరిగి అయోధ్యకు వెళ్ళిన తరువాత అపుడు ఆయుధాలు ధరించవచ్చు.

"నీవు అయోధ్యను వదలి మునివలె అరణ్యానికి వచ్చావు. నీవు మునివృత్తిలోనే జీవించాలి. అప్పుడు అత్తమామల మాటను నిలబెట్టిన వాడవు అవుతావు.

**ధర్మాదర్థః ప్రభవతి ధర్మా త్ప్రభవతే సుఖమ్**
**ధర్మేణ లభతే సర్వం ధర్మసార మిదం జగత్**

"ధర్మము వల్లనే సంపద కల్గుతుంది. ధర్మము వల్లనే సుఖం లభిస్తుంది. ధర్మము వల్లనే సమస్తమూ సిద్ధిస్తుంది. ఈ ప్రపంచమంతా ధర్మసారమే.

"తపో నియమాలను, వ్రతధర్మాలను పాటిస్తూ శరీరాన్ని కృశింపచేసుకొని ధర్మరతులైన వారు ధర్మాన్ని సంపాదించుకుంటారు. అంతేగానీ కేవలం సుఖించడం వల్ల సుఖం లభించదు (**న సుఖా ల్లభ్యతే సుఖమ్**).

"రామా! నిర్మలుడవై నిత్యమూ ధర్మాన్ని అనుష్ఠించు. నీకు త్రిలోకముల యందు తెలియనిది లేదు. నీకు ధర్మాధర్మాలు బోధించే శక్తిసామర్థ్యాలు ఎవరికున్నాయి? సహజంగా స్త్రీకి ఉండే చపలత్వం చేత ఇదంతా చెప్తున్నాను. నీవు ఆలోచించు. లక్ష్మణుని కూడా సంప్రదించు. ఏది నీకు నచ్చితే అది ఆచరించు" అని ప్రథమంగా సీతమ్మ సుదీర్ఘంగా భాషించింది.

# ధర్మమూర్తిగా శ్రీరాముడు

సీతమ్మకి భర్తయందుగల భక్తి ఎలాంటిదో, ఏపాటిదో రామునికి తెలుసు. పతిభక్తిని విడవకుండా సీతమ్మ పలికిన ధర్మవచనాలకు సంతసించిన శ్రీరాముడు సీతమ్మతో మెల్లగా ఇలా చెప్పాడు.

"జానకీ! నీవు ధర్మజ్ఞురాలవు. నాపై నీకున్న ప్రేమను అభివ్యక్తం చేస్తూ, కుల మర్యాదను వృద్ధిచేసే విధంగా నీవు పలికిన హితవాక్కులు చాలా చక్కగా ఉన్నాయి.

"కానీ ఆర్తరక్షణం కొరకు శత్రువులు ఆయుధాలు ధరించాలని నీవే చెప్పావు. ఇక నేను ఆలోచించ వలసింది, చెప్పవలసింది ఏముంది?

"సీతా! దండకారణ్యంలో వసించు మునులు ఇతరులకు శరణ మివ్వగలవారు. అట్టివారు ఆర్తులై నన్ను శరణుజొచ్చారు. వారు ధర్మమూర్తులు. సాత్వికులు. క్రూరులైన రాక్షసులవల్ల చాలా భీతిచెంది యున్నారు. మాంసభక్షకులైన రాక్షసులు వీరిని చంపి తింటున్నారు.

"మునులు నన్నాశ్రయించారు. అనుగ్రహించమని ప్రార్థించారు. నేను వారి పాదములను స్పృశించి ఇలా ప్రతిజ్ఞ చేశాను" అని రాముడు జరిగిన విషయమునంతా మళ్ళీ సీతకు చెప్పాడు.

అరణ్యకాండము ప్రారంభములోనే కదా ఇదంతా జరిగింది. ఇప్పుడే కొన్ని సర్గలముందు ముగిసిన సంభాషణమును మళ్ళీ తిరిగి రాముడు సీతకు చెప్పడమేమిటీ? ఇదంతా సీతకు తెలిసిన విషయమే కదా? అనే సందేహము మీకు రావచ్చు.

రాముడు అసందర్భంగా, పెంచుకుంటూ మాట్లాడే స్వభావం కలవాడని గాని, లేక సీతమ్మకు మరచిపోయే స్వభావ ముందనిగాని అర్థరహిత పరిశోధనలను ఇక్కడ మనం చేయనవసరం లేదు.

చెప్పిన విషయాన్నే పునరుక్తి లేకుండా చెప్పగలగడం వాల్మీకిలోని ప్రత్యేకత. అయోధ్యా కాండములో సీతాస్వయంవర వృత్తాంతాన్ని సీతమ్మ అనసూయాదేవికి చెప్పినపుడు వాల్మీకి అనుసరించిన నాటకీయత, విషయ విశ్లేషణము ఎంత నవ్యంగా, సవ్యంగా, భవ్యంగా, దివ్యంగా సాగిందో అక్కడ మీకు తెలిపియున్నాను.

ఈ సందర్భంలో కూడా అనేక నూతన విషయాల్ని రాముడు ప్రస్తావిస్తూ భాషించడం మీరు చూస్తారు. అంటే, నూతన విషయాన్ని నాటకీయత కొరకు, వైశిష్ట్యము కొరకు వాల్మీకి ప్రవేశ పెట్టాడా? అనే సందేహముకూడా మీకు రావచ్చు.

అలాంటి సందేహానికి కూడా అవకాశములేదు. ఎందుకంటె, ప్రస్తుతము శ్రోతగా వింటున్న సీతమ్మ పూర్వము ఈ విషయాల్ని ఆలకించివుంది. లేని విషయం ప్రవేశిస్తే ఆమె యొక్క పూర్వపక్షానికి గురికాక తప్పదు.



కాకపోతే, ఉన్న విషయాన్నే సందర్భానుసారంగా, విభజించి రచించడం, పాత్రలచేత పలికించడం వాల్మీకిలోని అసమాన రచనా చాతుర్యం. ఆదికవిగా తాను చేసిన ఈ ప్రయోగాన్ని ఈనాటికీ కనీసం అనుకరించే స్థాయికికూడా కవితాలోకం చేరుకోలేకపోయింది అనే విషయం గమనార్హం. ఇక రాముడు చెప్పేది విందాం.

"సీతా! ఎవరివద్దకు వెళ్ళి అనుగ్రహించమని నేను ప్రార్థించాలో అట్టివారు నావద్దకు వచ్చి నన్ను ప్రార్థించడం చాలా సిగ్గుపడాల్సిన విషయం.

"నేను మీకు ఏ సేవచేయాలి? అని నేను వారిని అడిగాను. వారిలా పలికారు. "రామా! సమయాల్ని అనుసరిస్తూ నియమాల్ని పాటించే ఋషుల్ని రాక్షసులు వధించి భక్షిస్తున్నారు. రామా! ఆ రాక్షసులు ఇష్టము వచ్చిన రూపాన్ని ధరిస్తారు. మమ్మల్ని హింసిస్తారు. అంతేకాదు. హోమములు చేయునపుడు, పవిత్ర సమయాలయందు వచ్చి మమ్మల్ని పీడిస్తారు.

"రామా! మేము తాపసులము. శక్తిహీనులము కాము. రాక్షసులను మేమే వధించగలము. అది మా తాపస జీవనానికి తగదు.

"రాఘవా! తపస్సనేది సులభసాధ్యమైన విషయం కాదు. తపస్సుకు ఎన్నో అవరోధాలు కలుగుతూ ఉంటాయి. ఈ కారణంగా రాక్షసులు మమ్మల్ని భక్షిస్తున్నా, శక్తి కలిగి కూడా అశక్తులవలె పడియున్నాము. శాపం పెట్టలేక పోతున్నాము. కనుక నీవు సోదరప్రేమతో మమ్మల్ని రక్షించు. మాకు రక్షకుడివి కా!" అన్నారు మునులు," అని సీతమ్మతో జరిగిన విషయాన్ని ప్రస్తావిస్తూ పలికాడు రాముడు. విషయ వివరణములో వాల్మీకి నాటకీయతను మీరు గుర్తించే ఉంటారని భావిస్తాను. అక్కడ చెప్పని నూతన విషయాల్ని ఎంత చక్కగా ప్రస్తావించాడో మీరు ఈ పాటికి గమనించే ఉంటారు. లేదా, మరొక్కసారి చదివి పోల్చుకోండి.

రాముడు సీతమ్మతో చెప్తున్నాడు.

"సీతా! మునుల ప్రార్థనను ఆలకించిన నేను వారిని రక్షిస్తానని మాట ఇచ్చాను. వారికిచ్చిన మాటను నాలో ప్రాణా లున్నంతవరకు తప్పను. నాకు సత్యం ప్రాణంకన్నా ముఖ్యమైనది. మధురమైనది.

**అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే స లక్ష్మణామ్**
**న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః ॥**

"సీతా! ప్రాణాల్నిగాని, లక్ష్మణునిగాని, నిన్నుగాని విడిచిపెట్టగలను. కానీ చేసిన ప్రతిజ్ఞను, ముఖ్యంగా బ్రహ్మజ్ఞానము కల మహితాత్ములకు చేసిన ప్రతిజ్ఞను విడువలేను.

"సీతా! వాళ్ళు నన్ను అర్థించకపోయినా వారిని రక్షించవలసిన బాధ్యత నా మీద ఉంది. వారికి మాట ఇచ్చిన తరువాత వేరే చెప్పాలా?

"సీతా! నీకు ఏ దోషం తెలియదు. నీవు సహృదయురాలవు. నామీదగల విశేష ప్రేమచేత అలా పలికావు. చాలా సంతోషంగా వుంది. సీతా! ఇష్టంలేని వానికి ఎవ్వరూ చెప్పరు కదా! (**న హ్యనిష్టో ఽను శిష్యతే**).

"సీతా! నీవు నా సహధర్మచారిణివి. నా ప్రాణములకంటే నీవే అధికము;" అని పలికి సీతాలక్ష్మణులతో కలిసి ధనుర్ధారియైన రాముడు దండకారణ్యంలో ముందుకు సాగిపోయాడు.

ఈ సందర్భములో సీతారాముల్ని మనం చక్కగా అర్థంచేసుకొని మన జీవితాల్ని చక్కజేసుకోవాలి. సీతమ్మ ధర్మాన్ని గూర్చి, రాముని అకారణ హింసను ఖండిస్తూ ఎంత గానో వాదించింది. రాముడు ఎంత ఓపిగ్గా విన్నాడు? మరొక భర్త అయితే "నీకేం తెలుసని నాకు చెప్పొచ్చావు? నన్ను చవటని భావించావా? బయట ఎంతెంతవారో నన్ను చూసి నోరు కదపరు. మెదపరు" అంటూ ఎంత చెత్తను నెత్తికెత్తేవాడో? అలా పాడైపోతాయి కుటుంబాలు మాట్లాడడం చేతకాక.

సహధర్మచారిణి అయిన భార్య భర్త విషయంలో చక్కని సలహాదారై ఉండాలి. ఒకవేళ భార్య అంతటి జ్ఞానవంతురాలు కాకపోవచ్చు. అంతమాత్రాన జీవితంలో తీసుకొనే అతి ముఖ్యమైన నిర్ణయాలలో ఆమె మరుగున పడకూడదు. ధర్మపత్నికి లేని జ్ఞానాన్ని సమకూర్చి ఆమె తనకు సహకరించేలా చేసుకొనే బాధ్యత కూడా భర్తకు సంబంధించిందే.

ఇంతకీ సీత చెప్పినట్లు రాముడు విని ఆచరించాడా? లేదు. ఆమె మాటలను శ్రద్ధగా విన్నాడు. కానీ తన నిర్ణయమే సముచితంగా ఉన్నందున ఆమె సలహా పాటించలేదు.

జీవిత భాగస్వామిని యైన భార్యకు ఆర్షసంస్కృతిలో ఎలాంటి స్థానం ఇవ్వబడిందో గుర్తించమని మీకు నేను మనవి చేస్తున్నాను. ధర్మాత్ముడైన రాముని నిర్ణయం తనకు నచ్చలేదంటూ సీతమ్మలాంటి మహాసాధ్వి భాషించడం మీకు ఆశ్చర్యంగా లేదూ? మన సంస్కృతిలో స్త్రీకి వాక్స్వాతంత్ర్యం ఉందో లేదో ఆలోచించండి. రామాయణ కాలంలోనే సీతమ్మ అంత చక్కగా తన వాదాన్ని వినిపించింది. రాముడు శ్రద్ధగా ఆలకించడం కూడా జరిగింది. ఇదంతా వాక్స్వాతంత్ర్యము లేకుండా జరిగిందంటారా? లేక, ఈనాడు భార్య విభేదించి పలికే వాక్యాలను రామునిలాగా ప్రశాంతంగా ఆలకించే భర్తలు ఎందరుంటారు? మన సంస్కృతిలో మాత్రమే స్త్రీకి పురుషునితో సమానంగా జీవించే హక్కు ప్రసాదించ బడింది.

సీతమ్మ రామునితో ఈవిధమైన ధార్మికప్రసంగం చేసి, అహింసావ్రతమును పాటించ మని కోరడంలో ఇకముందు రాబోయే విపత్తులను పవిత్రమైన సీతమ్మ మనసు అస్పష్టంగా పసికట్టిందేమో! అని ఆలోచించుటకు కూడా అవకాశముంది.

దండకారణ్యంలో అనేక ఆశ్రమాలున్నాయి. ఒకొక్క ఆశ్రమంలో పదిమాసాలు, నాలుగు మాసాలు, ఐదు మాసాలు, సంవత్సరము, ఆరు మాసాలు, ఒక మాసము కంటె ఎక్కువ రోజులు, ఒకటిన్నర మాసము, మూడు మాసాలు, ఎనిమిది మాసాలు - ఈవిధంగా రాముడు వసించినట్లు వాల్మీకిరామాయణము చెప్తూవుంది. సీతారామలక్ష్మణులు ఆశ్రమాలలో చాలా సంతోషంగా, ఆనందంగా జీవించారు.





**పది సంవత్సరాలు గడిచాయి.**

సీతమ్మ జీవితంలో ఈ పది సంవత్సరాలే ఆనందదాయక మైన కాలము. రాముని వనవాస కాలంలో పది సంవత్సరాలు పూర్తయ్యాయి.అనేక ఆశ్రమాలలో జీవించిన సీతారామ లక్ష్మణులు మళ్ళీ సుతీక్ష్ణుని ఆశ్రమానికి వచ్చారు. అక్కడ కొంతకాలము వసించారు.

ఒకనాడు రాముడు సుతీక్ష్ణుని సమీపించి, "మహాత్మా! ఈ అరణ్యంలో అగస్త్య మహాముని ఆశ్రమం కూడా ఉన్నట్లు నేను వినియున్నాను. ఆ మహానుభావుని సేవించే దినము ఎప్పుడొస్తుందా! అని నిరీక్షిస్తున్నాను.

"ఆ ఆశ్రమం ఎక్కడుంది? తమరు అనుగ్రహిస్తే జానకీలక్ష్మణులతో కలిసి వెళ్ళి అగస్త్యమహర్షిని దర్శిస్తాను" అన్నాడు రాముడు. రాముని మాటలను ఆలకించి సుతీక్ష్ణుడు ఇలా పలికాడు.

"రామా! అగస్త్యుని దర్శించమని నేనే చెప్పాలని భావించాను. దైవవశాన నీవే అడిగావు. ఈ ఆశ్రమానికి నాలుగు యోజనముల దూరంలో అగస్త్యమహర్షి సోదరుని ఆశ్రమం ఉంది. ఒకరాత్రి అక్కడ విశ్రమించండి. అక్కడనుండి ఒక యోజనము దూరంలో అగస్త్యుని ఆశ్రమం ఉంది. సుందరమైన వనప్రదేశంలో ఫలభరిత వృక్షముల మధ్య అగస్త్యాశ్రమం ఎంతో రమణీయంగా ఉంటుంది. రామా! అగస్త్యుని దర్శించాలనే అభిప్రాయముంటే ఇప్పుడే బయలుదేరడం మంచిది" అన్నాడు సుతీక్ష్ణుడు.

రాముడు సుతీక్ష్ణునికి నమస్కరించి సీతాలక్ష్మణులతో కలిసి అగస్త్యాశ్రమానికి బయలుదేరాడు. సీతారాములు పది సంవత్సరాలు ఆశ్రమ జీవనం సాగించారు.

**'ఆశ్రమం శ్రమ నాశకమ్'** - సమస్తమైన శ్రమలను పోగొడుతుంది కనుక ఆశ్రమమ్ అనే పేరు వచ్చింది. మనసులను అంతర్ముఖం గావించుకొనుటకు ఉపకరించేవియే ఆశ్రమాలు.

సుతీక్ష్ణుడు అగస్త్యమహర్షి శిష్యుడు. తీక్షణమైన బుద్ధి కలవాడే సుతీక్ష్ణుడు. సూక్ష్మబుద్ధి గలవారే పరమాత్మను ఆకర్షిస్తారు. సుతీక్ష్ణుని వలె సూక్ష్మబుద్ధి, తపోజీవనం కలవారి వద్దకు రాముడు పిలవకుండానే వస్తాడు.

సుతీక్ష్ణుడు చెప్పినట్లు సీతారామలక్ష్మణులు అగస్త్యభ్రాత ఆశ్రమంలో రాత్రి విశ్రమించి మరునాడు ఉదయాన్నే బయలుదేరి అగస్త్యాశ్రమం చేరారు.

అగస్త్యుడు గొప్ప తపస్సంపన్నుడు. వాతాపి అనే రాక్షసుని మ్రింగి జీర్ణించుకొని సాధువుల చింతను పోగొట్టాడు. వాతాపి సోదరుడైన ఇల్వలుడనే వాడినికూడా వధించాడు. గర్వముతో విర్రవీగిన నహుషుని సర్పంగా మార్చాడు.

ఆకాశాన్ని అంటుకునేలా పెరిగిన వింధ్యపర్వతము యొక్క పెరుగుదలను అరికట్టాడు. సముద్రగర్భంలో దాగియున్న కాలకేయులను, వృత్రాసురుని బహిర్గతం చేసేందుకు సాగరాన్నే పానంచేశాడు. అట్టి మహానుభావుడైన అగస్త్యుని ఆశ్రమాన్ని సమీపించారు సీతారామలక్ష్మణులు.

"లక్ష్మణా! ఇదే అగస్త్యాశ్రమం. నీవు ముందుగా వెళ్ళి సీతాసమేతుడనై నేను వచ్చియున్నానని అగస్త్యమహర్షికి చెప్పు" అన్నాడు రాముడు.

## అగస్త్యాశ్రమం

లక్ష్మణుడు అగస్త్యాశ్రమంలో ప్రవేశించాడు. రాముని దర్శించాలని ఎంతో కాలంగా తాను నిరీక్షిస్తున్నట్లు, తన అదృష్టం కొద్దీ ఈనాడు రాముడు తన ఆశ్రమానికి అరుదెంచినట్లు పలికి రాముని ఆహ్వానించాడు అగస్త్యుడు.

సీతారాములు ఆశ్రమంలో ప్రవేశించారు. అగస్త్యుడు రామునికి ఎదురుగా వచ్చాడు. అగస్త్యుడు తపోనిధి యని రాముడు లక్ష్మణునితో చెప్పాడు. రాముడు అగస్త్యుని పాదాలను స్పృశించి నమస్కరించాడు. అగస్త్యుడు రాముని గౌరవించి ఆతిథ్యము నొసగినాడు. అగస్త్యుడు రామునితో ఇలా పలికాడు.

"రామా! హేమ రత్న ఖచితమైన ఈ ధనుస్సు విష్ణుదేవునిది. ఇది విశ్వకర్మ నిర్మితము. ఇదిగో. సూర్యునివంటి అమోఘమైన ఈ బాణము బ్రహ్మదేవుడు ఇచ్చాడు.

"ప్రజ్వలించు అగ్నివలె వాడియైన బాణములతో నిండిన ఈ అక్షయ తూణీరాలను, బంగారు ఒరలో ఉంచబడిన ఈ హేమాలంకృతమైన ఖడ్గము నాకు దేవేంద్రుడు ఇచ్చాడు.

"పూర్వము రాక్షసులను వధించునపుడు విష్ణుదేవుడు ఉపయోగించింది ఈ ధనుస్సునే. రామా! నీ విజయమును కాంక్షించి ఈ ధనుస్సును, అంబులపొదులను, బాణమును, ఖడ్గమును నీకు ఇస్తున్నాను. స్వీకరించు" అని పలికి అగస్త్యుడు రాముని కివ్వగా శ్రీరాముడు వినమ్రుడై గ్రహించాడు.

అగస్త్యుడు ఇంకా చెబుతున్నాడు.



"రామా! నీకు శుభం కలుగుతుంది. నేను చాలా ఆనందిస్తున్నాను. చాలా దూరము నడచి రావడము వల్ల మీరు అలసినట్లున్నారు. సీతకూడా అలసిపోయి విశ్రాంతి కోరుతున్నట్లు కనిపిస్తోంది.

"సీత సుకుమారి. బాధలు తెలియకుండా పెరిగింది. భర్తపై అధికమైన ప్రేమానురాగాలు కలది. అందుచేతనే బాధాకరమైన వనవాసానికి కూడా వెనుకాడకుండా వచ్చింది.

**ఏషా హి ప్రకృతిః స్త్రీణా మా సృష్టే రఘునన్దన**
**సమస్థ మనురంజన్తి విషమస్థం త్యజన్తి చ**

"రామా! భర్త ఉన్నత స్థితిలో వుంటే స్త్రీలు అతణ్ణి ప్రేమిస్తారు. ఇడుములకు లోనుకాగానే విడిచిపెడ్తారు. ఇది సృష్ట్యాది నుండి స్త్రీల స్వభావం.

"స్త్రీలు మెరుపువంటి చంచల స్వభావులు. అనుబంధాలు అయిష్ట మైనపుడు వాటిని త్రెంచుకోవడంలో ఆయుధాలకన్నా పదునుగా వ్యవహరిస్తారు. పూర్వాపరాలు చూడకుండా దూసుకు పోవడంలో వాయువుకన్నా, మనసుకన్నా వేగంగా పయనిస్తారు.

"కానీ, రామా! నీ భార్య సీత అలాంటిది కాదు. ఏ దోషమూ లేనిది. అరుంధతి వలె పరమ పతివ్రత. శ్లాఘించ తగినది. మీరు ముగ్గురు నివసించే ఏ ప్రదేశమైనా అది మంగళకరంగా శోభాయమానంగా ప్రకాశిస్తుంది;" అన్నాడు అగస్త్యుడు.

రాముడు చేతులు జోడించి నమస్కరిస్తూ మహర్షితో ఇలా పలికాడు: "మహాత్మా! మిమ్మల్ని సంతోషపరచే గుణములు కలిగియున్నందుకు మేము ధన్యులము. కానీ నేనొక పర్ణశాల నిర్మించుకొని జీవించాలని వుంది. జలవసతి కలిగి, దట్టమైన వృక్షములున్న యోగ్యమైన ప్రదేశము ఎక్కడుందో చెప్పండి" అని రాముడు అడిగాడు.

అగస్త్యుడు కొన్ని క్షణాలు అంతర్ముఖుడై రామునితో ఇలా పలికాడు. "రామా! ఇక్కడికి రెండు యోజనముల దూరాన పంచవటి అనే ఒక ప్రదేశముంది. అది చాలా మనోహరమైన ప్రదేశము. నీవు అక్కడ పర్ణశాల నిర్మించుకొని సీతాలక్ష్మణులతో హాయిగా జీవించవచ్చు.

"రామా! నీ తండ్రి దశరథుడు నీకు విధించిన వనవాసకాలము చాలావరకు పూర్తయింది. నీవు నీ ప్రతిజ్ఞను నెరవేర్చుకొని అయోధ్యలో సుఖంగా జీవించగలవు.

"రామా! దశరథుడు నాకు స్నేహితుడు కావడంవల్లా, నా తపోమహిమ వల్లా నీ విషయమంతా నాకు తెలుసు. నీ మనోభీష్టాన్ని నేను గ్రహించాను. అందుచేత నాతో పాటు ఈ ఆశ్రమంలోనే ఉండిపొమ్మని నిన్ను బలవంతపెట్టడం లేదు.

"రామా! పంచవటి చాలా అందమైన ప్రదేశము. గోదావరి దగ్గరే ఉంది. కందమూలాలు, ఫలాలు పుష్కలంగా లభిస్తాయి. అది రమ్యమైన పుణ్యప్రదేశము;" అని అగస్త్యుడు పలుకగా, సీతారామలక్ష్మణులు మహర్షికి నమస్కరించి, అనుజ్ఞను పొంది పంచవటికి బయలుదేరి వెళ్ళారు.

ఇక్కడ ఒక విషయమును ప్రస్తావించక తప్పడంలేదు. విజ్ఞులు విశాలహృదయంతో ఆలోచించగలరని ఆశిస్తున్నాను. ఇది సందర్భము అందించిన అసందర్భ విషయమో,

అసందర్భముగా తయారైన సందర్భమో - ఏది ఎలావున్నా చర్చించదగిన విషయమే వని భావించి సమీక్షిస్తున్నా.

సీతారామలక్ష్మణులు అగస్త్యాశ్రమంలో ప్రవేశించగనే అక్కడ బ్రహ్మ, ఇంద్ర, విష్ణు, కుబేర, వాయు, నాగ, గాయత్రీ, యమ, వరుణ, కుమార మొదలైన దేవతాస్థానములను దర్శించినట్లు వాల్మీకి రచించాడు. ఈ విషయాన్ని అరణ్యకాండము పన్నెండవ సర్గలో పదిహేడవ శ్లోకం నుండి ఇరవైవశ్లోకం వరకు నాలుగు శ్లోకాల్లో చెప్పాడు.

ఇంతవరకు రాముడు భరద్వాజాశ్రమం, అత్రి ఆశ్రమం, శరభంగుని ఆశ్రమం, సుతీక్ష్ణాశ్రమం మొదలగు అనేక ఆశ్రమాలను దర్శించడం జరిగింది. కానీ ఎక్కడ కూడా వాల్మీకి అక్కడున్న దేవతాస్థానాల్ని గూర్చి వివరించలేదు. ప్రత్యేకించి అగస్త్యాశ్రమం లోనే మనకు ఈ వివరణము వినపడుతూ వుంది.

రామాయణ వ్యాఖ్యాతలలో ప్రముఖులైన గోవిందరాజులవారు తమ **"గోవింద రాజీయం"** లో ఈ విషయాన్ని ప్రస్తావించి వ్యాఖ్యానిస్తూ శివుడు పూజార్హుడు కాడని తేల్చి చెప్పారు. తమోగుణ ప్రధానులే శివుని పూజిస్తూ ఉంటారని కూడా నిర్దేశించారు.

**అత్ర పూజ్య దైవతేషు రుద్ర స్యానుపాదానాత్ అపూజ్యత్వ ముక్తమ్ !**
**అధునా కైశ్చిత్ పూజ్య మానతా తు తామస శాస్త్రాను రోధేనేతి బోధ్యమ్ ।**

"అగస్త్యుడు ఆరాధించే దేవతా స్థానాలలో శివుని స్థానం లేకపోవుట చేత శివుడు పూజకు అనర్హుడని చెప్పబడింది. ఇప్పుడు శివుని ఆరాధిస్తున్నారంటే తామస శాస్త్రాల మీద వారికున్న విశ్వాసమే కారణము."

ఇదీ గోవిందరాజులవారి అభిప్రాయము. సర్వదేవతా స్థానములున్న అగస్త్యాశ్రమంలో శివుని స్థానము ఎందుకు లేదు? ఈ ప్రశ్నకు అప్పయ్యదీక్షితులవారు శ్రీరామాయణ తాత్పర్య సారసంగ్రహ స్తోత్రంలో సమాధానం చెబుతారు.

అగస్త్యాశ్రమంలో ప్రవేశించే ముందు రాముడు లక్ష్మణునితో మాట్లాడుతూ అగస్త్యుని సేవించాలనే తన అభీష్టాన్ని తెల్పుతాడు. ఎందరో దేవతలు అగస్త్యాశ్రమం వచ్చి అగస్త్య మహర్షిని సేవిస్తూ ఉంటారు అని కూడా రాముడు లక్ష్మణునితో చెబుతాడు.

**అత్ర దేవాః స గన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః**
**అగస్త్యం నియతాహారం సతతం పర్యుపాసతే**

"గంధర్వులు, సిద్ధులు, గొప్ప ఋషులు ఈ ఆశ్రమానికి వచ్చి ఆహారనియమం గల ఈ అగస్త్య మునీంద్రుని సేవిస్తూ ఉంటారు" అన్నాడు శ్రీరాముడు.

అగస్త్యుని సేవించుట కొరకు అరుదెంచే దేవతలు నిర్మించుకున్న దేవతాస్థానాలే ఆశ్రమంలో గోచరిస్తున్నాయి అంటారు అప్పయ్యదీక్షితులు. ఆ దేవతలందరూ అగస్త్యుని ఉపాసించువారే నని తేల్చిచెప్పి, అక్కడ శివస్థానం లేనందున శివుడు అగస్త్యుని ఉపాసించేవాడు కాడని, కనుక సర్వదేవతలలో శివుడు శ్రేష్ఠుడని ప్రతిపాదించారు.

**తస్మాత్ బ్రహ్మ విష్ణ్వాదయ ఏవ అగస్త్యోపాసకాః న తు శివః ఇతి**
**ద్యోతనేన శివస్య తదతి శయ మహిమా వ్యంజితః**



"అందువలన, బ్రహ్మ విష్ణు మొదలైన వారే అగస్త్యోపాసకులు. శివుడు అగస్త్యోపాసకుడు కాడు. కనుక సర్వదేవతల కంటె శివుడే మహిమాన్వితుడని సూచింపబడింది" అన్నారు అప్పయ్యదీక్షితులు.

అగస్త్యాశ్రమంలో గోచరించినంత మాత్రాన ఆయాదేవతాస్థానాలు అగస్త్య మహాముని ఉపాసించేవి అని తొందరపడి నిర్ణయించాల్సిన అవసరం లేదు. అనేక సంప్రదాయాలకు, అనేక మార్గాలకు సంబంధించిన ఋషులు ఒకే ప్రదేశంలో వుండి తాపస జీవనాన్ని సాగిస్తున్నట్లు మనం దండకారణ్యములో చూశాము.

అగస్త్యాశ్రమంలో గోచరించిన దేవతాస్థానాలు వివిధ శాఖలకు సంబంధించినవారు ఉపాసించే స్థానాలు ఎందుకు కాకూడదు? అలాంటి విషయాల్ని ప్రోత్సహించే విశాల హృదయం అగస్త్యమహర్షికి ఉండదా? మహాజ్ఞాని యైన అగస్త్య మునీంద్రుడు ఇంకా దేవతోపాసనను దాటలేదా? తన తపోబలంచేత రాముని జీవితాన్నంతా తెలుసుకున్నానని రామునికే చెప్పిన మహర్షికి దేవతోపాసన అవసరం ఉందా? ఇతరులకు ఆదర్శాన్ని అందించాలని అగస్త్యుడు దేవతోపాసనను చేశాడని అంగీకరిస్తాం. అలాంటప్పుడు శివుని విస్మరించే అవకాశముందా? అది ఆదర్శ మవుతుందా?

పరమాత్మ వ్యక్తావ్యక్త స్వరూపుడని శాస్త్ర నిర్దేశము. వ్యక్తమయ్యే సర్వ దేవతామూర్తులకు అధిష్ఠానంగా భాసించే చైతన్యమే అవ్యక్త పరమాత్మ. ఆయన అజుడు. అక్షరుడు. సర్వగతుడు. అట్టివాడు నామరూపాలకు అతీతుడు. మంగళ స్వరూపుడు. శివుడు అదేకదూ? అందుచేత అవ్యక్తమూర్తియైన శివుని స్థానాన్ని బాహ్యంలో ప్రదర్శించలేక అంతర్యంలో మహర్షి సుప్రతిష్ఠం చేసుకొని వుండొచ్చు. సర్వ దేవతలకన్నా సమున్నత స్థానాన్ని శివునకు సమర్పించడం చేత అగోచరుడైన శివుని స్థానం ఆశ్రమంలో గోచరించక పోవచ్చు. అంతమాత్రం చేత కోట్లాది భక్తులు పూజించే శివుని పూజకు అనర్హుడని కొట్టి పారేయడమేనా?

అదే సత్యమైతే, శివుని స్తుతించిన శాస్త్రాల నన్నిటిని ఏం చేయాలి? నిరాకరించడమేనా? మరి వేదం కూడా నిరాకరింప బడుతుందా? ఈ తీగను పట్టి లాగితే ఏం కదుల్తుందో ఆలోచించండి.

శివుని స్తుతించిన శాస్త్రాలను తామస శాస్త్రాలుగా శ్రీగోవిందరాజులు అభివర్ణించారు. తామస శాస్త్రాలు తమోగుణం కలవారికే కదా రుచిస్తాయి? ఈవిధమైన వ్యాఖ్యానముతో శివభక్తులను తమోగుణ పూర్ణులుగా నిర్ణయించి నిర్దేశించడం ఎంతవరకు సముచితం?

శాస్త్ర హృదయాన్ని అర్థం చేసుకొనేందుకు ప్రయత్నించడం ధర్మం. మన హృదయాన్ని శాస్త్రానికి అంటగట్టడం అధర్మం కాదని కొందరు భావించవచ్చునేమో గాని ధర్మం మాత్రం కాదని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు.

విషజ్వరం వచ్చినపుడు ఎంత పండితుడైనా తబ్బిబ్బై మాట్లాడడం మనం చూస్తూనే ఉంటాము. మత భేదాలనే విషక్రిములు మనసులో ప్రవేశించినపుడు ఎంతటివారైనా విషయాన్ని తారుమారు చేసి ప్రవచించడం అనాదిగా మనం చూస్తున్నదే. భేదభావ చత్వారం తొలగినపుడే సత్యం సుస్పష్టంగా గోచరిస్తుంది.

ఇంతకీ ఈ వివాదాన్ని తెచ్చిపెట్టిన దేవతామూర్తులకు సంబంధించిన నాలుగు శ్లోకాలు అసలు రామాయణం లోనివేనా? లేక ప్రక్షిప్తాలా? అనే శంక కూడా ఈనాటిది కాదు. ప్రాచ్య పాఠంలో ఈనాలుగు శ్లోకాలు లేవని ఆర్షవిజ్ఞాన ట్రస్టువారు ప్రచురించిన శ్రీమద్రామాయణమున గమనార్హంగా ఉదహరించారు.

ప్రక్షిప్తాలే అనుకుందాం! ఇక పట్టించుకో నవసరమే లేదు. ఏది ఏమైనా పవిత్రమైన ఆదికావ్యం వాదకావ్యం కాకూడదు. వివాదకావ్యం కాకూడదు.

## పంచవటి

సీతారామలక్ష్మణులు పంచవటికి పోతూ మార్గంలో ఒక వటవృక్షముపై కూర్చుని యున్న పెద్దగద్దను చూసి రాక్షసుడేమోనని శంకించారు. "ఎవరు నువ్వు?" అని ప్రశ్నించారు.

ఆ పక్షి మృదువైన, మధురమైన పలుకులతో, "నాయనా! నేను నీ తండ్రి దశరథుని మిత్రుడను" అని పలికింది.

ఆ మాట వినగానే రామలక్ష్మణులు ఆ గద్దకు నమస్కరించారు. తన పేరు, చరిత్రను వినిపించమని కోరారు. ఆ గద్ద సకల భూతముల సృష్టిక్రమాన్ని వివరించి చెప్పింది. చివరగా తనను గూర్చి చెబుతూ,

"రామా! నేను శ్యేనిపుత్రుడను. నన్ను జటాయువు అంటారు. మా అన్నగారి పేరు సంపాతి. మీరు ఇష్టపడితే ఈ వనవాస కాలమున నేను మీకు సహాయకారిగా ఉంటాను. ఈ అరణ్యము క్రూరమృగాలకు, రాక్షసులకు నిలయము. నీవు, లక్ష్మణుడు ఇంటివద్ద లేనపుడు నేను సీతకు తోడుగా ఉంటాను;" అని పల్కింది జటాయువు.

రాముడు జటాయువుకు నమస్కరించాడు. సంతోషముతో ఆలింగనం చేసుకున్నాడు. దశరథ జటాయువుల స్నేహ విషయాన్ని అడిగి అడిగి మరీ విన్నాడు రాముడు. జటాయువుతో కలిసి సీతారామలక్ష్మణులు పంచవటి చేరారు.

"లక్ష్మణా! చక్కగా పుష్పించియున్న ఈ అరణ్యములో ఈ ప్రదేశమే పంచవటి. మనం ఎక్కడ ఆశ్రమాన్ని నిర్మించుకుంటే బాగుంటుందో పరిశీలించు. నీకు ఈ విషయంలో గొప్ప నైపుణ్యముంది.

"దర్భలు, పుష్పాలు, జలాశయము, ఉదకము సమీపంగా ఉండే స్థలాన్ని చూడు;" అన్నాడు రాముడు.

"అన్నా! నేను నీవు చెప్పినట్లు వర్తించువాడనే గాని స్వతంత్రుడను కాను. ఒక రమ్యమైన ప్రదేశాన్ని నీవే నిర్ణయించి చెప్పు. అక్కడ నీ ఆజ్ఞ మేరకు ఆశ్రమాన్ని నిర్మిస్తాను" అన్నాడు లక్ష్మణుడు.

రాముడు మనోహరమైన ఒక ప్రదేశాన్ని నిర్ణయించాడు. ఆ ప్రదేశంలో వృక్షాలన్నీ పుష్పించి ఉన్నాయి. నేల చదునుగా ఉంది. ప్రక్కనే పద్మములతో శోభించే చక్కని సరోవరముంది. మరోవైపు పుణ్యగోదావరి ప్రవహిస్తోంది.



మరీ అంతదూరం గాకుండా, అలాగని దగ్గరకాకుండా మృగములు గుంపులు గుంపులుగా చరించే పర్వతాలు అందంగా అమర్చినట్లున్నాయి. ఆ పర్వతాలలో పెద్దపెద్ద గుహలున్నాయి.

"లక్ష్మణా! ఈ ప్రదేశము మనోహరంగా ఉంది. పవిత్రంగానూ, పుణ్యప్రదంగానూ ఉంది. జటాయువుతో కలిసి మనము ఇక్కడే నివసిస్తాము" అన్నాడు రాముడు.

లక్ష్మణుడు ఆశ్రమాన్ని నిర్మించే కార్యంలో నిమగ్నుడయ్యాడు. నేలంతా మిట్టపల్లాలు లేకుండా చేశాడు. బలమైన స్తంభాలు నిలిపాడు. పొడవైన వెదుళ్ళను సేకరించి బద్ధకట్టాడు. జమ్మికొమ్మలు పరచాడు. బలమైన త్రాళ్ళతో గట్టిగా కట్టాడు. దానిపై రెల్లుగడ్డి, ఆకులు, దర్భలు కప్పాడు. పుట్టమట్టి తెచ్చి మెత్తగా భూమిపై అలికాడు. ఈవిధంగా విశాలమైన, అందమైన, చూడ చక్కనైన పర్ణశాలను నిర్మించాడు లక్ష్మణుడు.

రాముడు నివసించుటకు లక్ష్మణుడు నిర్మించిన పర్ణశాల విశాలంగా **(సువిపులాం)**, రమ్యంగా **(రమ్యాం)**, చూడముచ్చట గొల్పునదిగా **(ప్రేక్షణీయమ్)** ఉన్నట్లు వాల్మీకి వర్ణించాడు.

రాముడు మనవద్దకు కూడా వచ్చి ఉండాలంటే లక్ష్మణునిలాగా మనం కూడా పర్ణశాలను నిర్మించాలి. ఇక్కడ మనం నిర్మించాల్సింది బాహ్య పర్ణశాల కాదు. ఆంతరంగిక పర్ణశాల.

మన హృదయం మొదట విశాలం కావాలి. సంకుచితమైన హృదయంలో రాముడు వసించడు. ప్రేమ, దయ, మైత్రి, అక్రోధము మొదలైన సుగుణ సంపదను పొందడం ద్వారా హృదయాన్ని విశాలం చేసుకోవాలి. అప్పుడే రాముడు వచ్చి మన హృదయంలో వసిస్తాడు.

ఇక రెండవది రమ్యత. హృదయం సువిశాలంగానూ ఉండాలి. రమ్యంగానూ ఉండాలి. మన హృదయం నిర్మలంగా ఉన్నట్లు మనకి అనిపించవచ్చు. కాని అది ఇతరులకు కూడా నిర్మలత్వాన్ని ప్రసాదించ గలగాలి.మన ప్రవర్తన ద్వారా సర్వులను తృప్తిపరచ గలగాలి. ఇదియే రమణీయత. రమ్యత.

ఇక మూడవది ప్రేక్షణీయం. ప్రసన్నతయే ఇక్కడ ప్రేక్షణీయమని చెప్పబడింది. ప్రసాద మనస్తత్వముతో జీవించడమే ప్రసన్నత్వము. ద్వంద్వముల యందు కలత చెందని మానసిక స్థితియే ప్రసన్నత. ప్రసన్నత గలవారు ప్రశాంతమూర్తులై ఉంటారు. అట్టివారి హృదయంలో రాముడు నిలిచియుంటాడు. సదా క్రీడిస్తూ ఉంటాడు.

**ఖేలతి మమ హృదయే రామః**
**ఖేలతి మమ హృదయే** **॥ ఖేలతి ॥**
**పరమహంస సామ్రాజ్యోద్ధారీ**
**సత్య జ్ఞానానంద శరీరి** **॥ ఖేలతి ॥**

"నా హృదయంలో రాముడు క్రీడిస్తున్నాడు. నా హృదయంలో రాముడే క్రీడిస్తున్నాడు.

"పరమహంసల యొక్క సామ్రాజ్యమును ఉద్ధరించువాడు, సత్య జ్ఞానానందములే శరీరముగా గలవాడు నగు రాముడు నా హృదయంలో క్రీడిస్తున్నాడు" అని సదాశివ బ్రహ్మేంద్రులవారు తన అనుభవామృతాన్ని ఈ కీర్తన ద్వారా వితరణ చేశారు.

పర్ణశాల నిర్మాణము పూర్తయింది. లక్ష్మణుడు గోదావరిలో స్నానం చేసి ఫలపుష్పాలతో తిరిగి వచ్చాడు. దేవతాపూజ గావించాడు. ఆశ్రమంలో ప్రవేశించమని రాముని ఆహ్వానించాడు.

లక్ష్మణుడు నిర్మించిన అందమైన పర్ణశాలను చూచి రాముడు చాలా సంతోషించాడు. భక్తితో చేసింది ఏదైనా పరమాత్మను తృప్తి పరుస్తుంది.

రాముడు లక్ష్మణుని గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు. అణచుకోలేని సంతోషాన్ని వ్యక్తం చేస్తూ లక్ష్మణునితో ఇలా ప్రేమభాషణం చేశాడు.

"లక్ష్మణా! నీవు సర్వలక్షణ సంపన్నుడవు. నీవు నిర్మించిన పర్ణశాల చాలా బావుంది. నీకు కానుకగా ఇవ్వగలిగింది ఏమిటా? అని ఆలోచించాను. చివరికి నిన్ను ఆలింగనం చేసుకున్నాను. ఇదే నేను నీకిచ్చే పారితోషికము" అన్నాడు రాముడు.

భక్తుడు నిర్మలమైన భక్తి ద్వారా పరమాత్మను తృప్తిపరచినపుడు పరమాత్మ తిరిగి ప్రతిఫలంగా తననే సమర్పించుకుంటాడు. అదియే ఆలింగనము. జీవబ్రహ్మైక్యము. రాముడు లక్ష్మణునితో చెప్తున్నాడు.

భావజ్ఞేన-కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ
త్వయా నాథేన ధర్మాత్మా న సంవృత్తః పితా మమ ॥

"లక్ష్మణా! నీవు భావజ్ఞుడవు. కృతజ్ఞుడవు. ధర్మజ్ఞుడవు. నీవు నాకు తోడుగా, రక్షకుడుగా ఉండుటచేత మన తండ్రిగారు మరణించలేదని నేను భావిస్తున్నాను" అన్నాడు రాముడు.

లక్ష్మణుడు తండ్రియైన దశరథుని మరపించినాడని చెబుతూ భావజ్ఞుడు, కృతజ్ఞుడు, ధర్మజ్ఞుడుగా లక్ష్మణుని శ్లాఘించినాడు శ్రీరాముడు. లక్ష్మణునికి మూడు విశేషణములను వాడి, ఈ గుణవిశేషముచేత దశరథుని లక్ష్మణుడు మరపించినాడు అంటున్నాడు రాముడు.

పర్ణశాల ఎలా వుంటే రాముడు ఆనందిస్తాడో అంత రమ్యంగా, విశాలంగా, ప్రేక్షణీయంగా నిర్మించాడు లక్ష్మణుడు. పర్ణశాలను చూడగనే తన భావాలకు అనుగుణంగా ఊహించి నిర్మించాడని లక్ష్మణుని రాముడు భావజ్ఞుడుగా శ్లాఘించాడు. బిడ్డల భావాలను ఎరిగి తండ్రి కుమారుల కోర్కెలను తీరుస్తాడు. ఆ విషయాన్ని సమన్వయం చేసుకుంటూ భావజ్ఞుడైన లక్ష్మణుడు తండ్రిని మరపించాడని రాముడు పలికాడు.

భావజ్ఞుడైన లక్ష్మణుడు రామునికి కృతజ్ఞుడుగా తెలుస్తున్నాడు. తాను చేసిన కృత్యము తనకొరకా? లేక పరహితమా? అని ఆలోచించుకొని స్వార్థాన్ని వీడి, పరుల కొరకు ఆచరించుటయే ఇక్కడ కృతజ్ఞతగా తెలుస్తుంది. లక్ష్మణుడు నిర్మించిన పర్ణశాల రామునికి అనుకూలంగా ఉండాలని భావించాడే గాని తనకు కూడా ఉచితంగా ఉండాలని ఆలోచించలేదు. తను ఎలావున్నా బిడ్డ సుఖంగా ఉండాలని భావిస్తుంటాడు తండ్రి. లక్ష్మణుడు కూడా పర్ణశాల నిర్మాణంలో అలాగే జీవించి రాముని తృప్తి పరచాడు. ఈ విషయాన్ని స్మృతిలో ఉంచుకొని కృతజ్ఞుడైన లక్ష్మణుడు తండ్రిని మరపిస్తున్నాడని రాముడు చెబుతాడు.

భావజ్ఞుడు, కృతజ్ఞుడు అని శ్లాఘింపబడిన లక్ష్మణుడు చివరగా ధర్మజ్ఞుడని రామునిచేత కొనియాడబడ్డాడు. బిడ్డను సుఖపెట్టుటయే తండ్రి తన ధర్మముగా భావించునట్లు, రాముని ఆనందమే తన ఆనందముగా భావించి జీవిస్తున్నందున ధర్మజ్ఞుడైన లక్ష్మణుడు తన తండ్రిని మరపించినట్లు రాముడు చెబుతున్నాడు. లక్ష్మణుని సేవలకు పూర్ణఫలం సిద్ధించినట్లైంది. లక్ష్మణుడు ధన్యాత్ముడయ్యాడు.



పుణ్యగోదావరికి ఉత్తర తీరాన అరటి, మామిడి, పనస మొదలగు ఫలవృక్షములతో శోభిస్తున్న పంచవటిలో సీతారామలక్ష్మణులు హాయిగా జీవించసాగారు.

ప్రతిరోజూ ఉదయాన్నే ముగ్గురూ గోదావరికి వెళ్ళి స్నాన మాచరించేవారు. నదికి వెళ్ళి వచ్చేటప్పుడు రామలక్ష్మణులకు మధ్య సీతమ్మ నడిచి వెళ్తుండేది.

రోజూ గోదావరి నుండి లక్ష్మణుడు నీరు తెచ్చేవాడు. జనసంసర్గము లేని ఆ ప్రదేశము చాలా ప్రశాంతంగా ఉండి తపస్సుకు అనుకూలంగా ఉండేది. నిత్యమూ ఆ అరణ్యములో సంచరించి సీతారాములకు చక్కని కందమూలాలను, రసపూర్ణమైన మధురఫలాలను లక్ష్మణుడు తెచ్చి ఇచ్చేవాడు.



సీతారామలక్ష్మణులు పంచవటిలో చాలా ఆనందంగా జీవిస్తుండేవారు. వారి వైభవాన్ని కీర్తిస్తూ పంచవటిని అమరావతిగా వర్ణించింది అధ్యాత్మ రామాయణము. సీతా లక్ష్మణుల సేవలో శ్రీరాముడు దేవేంద్రునిలా శోభించాడని వాల్మీకి రామాయణము కీర్తించింది.

పంచవటి ఏదో కాదు. మానవ శరీరమే పంచవటి. పంచకోశముల సమూహమే పంచవటి. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశముల సంఘాతమే పంచవటి.

జానకి అనే జీవుడు వివేకమనే లక్ష్మణుని తోడు చేసుకొని పరమాత్మ యనే రాముని వీడనంతవరకు పంచవటిలో జీవనం ఆనందంగానే ఉంటుంది.

రామలక్ష్మణులు సమీపాన ఉన్నంతవరకు జానకికి అంతా ఆనందమే. వివేకజ్ఞానాలు దగ్గరున్నంతవరకు జీవులందరికి అంతా సుఖప్రదమే. ఇదే పంచవటి పంచే జ్ఞాన పంచామృతం.

## తియ్యని జ్ఞాపకాలు

పంచవటిలో సీతారామలక్ష్మణులు సుఖంగా జీవిస్తున్నారు. శరదృతువు పోయింది. హేమంతం ప్రవేశించింది. మంచు సమృద్ధిగా కురుస్తూ వుంది. భూమి సస్యాలతో నిండి వుంది. అగ్నిసంపర్కము ఆనందాన్ని ప్రసాదిస్తూవుంది.

పాడిపంటలు సమృద్ధిగా ఉన్నాయి. సూర్యుడు హాయిని ఇస్తూవుండగా, నీళ్ళు, నీడలు అవసరం లేకుండా వున్నాయి. చలి ఎక్కువగా ఉంది. గాలి జోరుగా వీస్తోంది. అరణ్యంలో జంతుసంచారము మందగించింది.

ఖర్జూరపు పూలగుత్తుల వంటి బంగారు రంగు వెన్నులతో వంగియున్న వరిచేలు చూచుటకు చాలా అందంగా ఉంది. దప్పిక గొన్న అడవి ఏనుగు నిర్మలంగా, చల్లగా ఉన్న నీటివి తాకగనే తొండమును వెనక్కి లాగేసుకుంటోంది.

నీటి గట్లపై కూర్చునియున్న నీటిపక్షులు చలికి భయపడి యుద్ధభూమిలో ప్రవేశించుటకు వెనుకాడే పిరికి సైనికులవలె నీటిలో దిగుటకు జంకుతున్నాయి. మంచుతెరలు దట్టంగా వ్యాపించగా, పూలులేని చెట్లు నిద్రించిన ట్లున్నాయి.

**మాసానాం మార్గశీర్షోఽహం** మాసాలలో మార్గశిర మాసము తన విభూతి యని శ్రీకృష్ణపరమాత్మ తెలిపియున్నాడు. పుణ్యకాలాలు పవిత్రాలోచనలకు పునాదులు కదా! అందుకేనేమో ప్రభాతవేళ పుణ్యాత్ముడైన భరతుడు లక్ష్మణుని మదిలో మెదిలాడు.

తెల్లవారింది. స్నానానికై సీతారాములు గోదావరికి బయలుదేరారు. కలశమును చేత పట్టుకొని లక్ష్మణుడు వారిని అనుసరించాడు. లక్ష్మణుడు రామునితో ఇలా పలికాడు.

"అన్నా! భరతుడు ధర్మాత్ముడు. రాజ్యభోగాలను త్యజించి, పట్టణంలో ఉన్నా అరణ్యవాసివలె తపోజీవనంలో కొనసాగుతున్నాడు. ఆహార నియమాన్ని పాటిస్తూ భూమి మీదనే శయనిస్తున్నాడు.

"రామా! ఇదే సమయానికి మంత్రులతో కూడి స్నానార్థమై సరయూనదికి వెళ్తూ వుంటాడు. భరతుడు సుకుమారుడు. సుఖాల్లో పెరిగాడు. చూడు. వాతావరణం ఎంత చలిగా ఉందో? ఈ చలికాలంలో భరతుడు నేలమీద ఎలా శయనిస్తున్నాడో? ఉదయాన్నే సరయూ నదిలో ఎలా స్నానం చేస్తున్నాడో?

"మధుర స్వభావం గల భరతుడు ఎన్ని బాధ లనుభవిస్తున్నాడో? మానవులు తల్లిని అనుసరిస్తారే గాని తండ్రిని అనుసరించరు అని లోకోక్తి. భరతుడు దానిని తారుమారు చేశాడు. భరతుడు తల్లిని అనుసరించడం కాని, అనుకరించడం కాని చేయలేదు.

"దశరథమహారాజు రాణిగా ఉండి, భరతునికి తల్లియైన కైకేయికి ఈ క్రూరస్వభావము ఎలా వచ్చిందో అర్థంగాదు;" అని లక్ష్మణుడు సాగిపోతూ ఉన్నాడు. లక్ష్మణుని ప్రసంగ ప్రవాహాన్ని రాముడు అడ్డుకున్నాడు.

"నాయనా! లక్ష్మణా! నీవు ఎట్టి పరిస్థితులలోను మధ్యమాంబ యైన కైకేయిని నిందించకు. అయోధ్యకు రాజైన భరతుని గూర్చి చెప్పు. ఈ వనవాసంలో నేను దృఢవ్రతుడనై తపస్సు చేస్తున్నా భరతుని ప్రేమ నన్ను కుదిపేస్తూ ఉంటుంది.

"భరతుడు ప్రియంగా మధురంగా మాట్లాడుతాడు. అవి మనసుకు అమృతం లాగా సుఖాన్ని కల్గిస్తాయి. భరతుడు చిత్రకూటంలో పలికిన మాటలు ఇంకా నా చెవుల్లో మారు మ్రోగుతూనే ఉన్నాయి.

"లక్ష్మణా! మనం నలుగురు సోదరులం కలిసి జీవించే రోజు లెప్పుడొస్తాయో!" అని రాముడు దుఃఖించాడు. సీతా లక్ష్మణులతో కలిసి గోదావరిలో స్నానం చేశాడు. రాముని కన్నీటిని గోదావరి తనలో దాచుకుంది.

**కృతాభిషేకః స రరాజ రామః సీతా ద్వితీయః సహ లక్ష్మణేన**
**కృతాభిషేకో గిరిరాజ పుత్ర్యా రుద్రః సనన్దీ భగవానివేశః**



రాముడు సీతాలక్ష్మణులతో కలిసి గోదావరిలో స్నానం చేయునపుడు జానకి పార్వతీ దేవిలా శోభించింది. లక్ష్మణుడు నందికేశ్వరుని లాగా గోచరించాడు. వారిరువురి మధ్య శ్రీరాముడు పరమశివుని వలె ప్రకాశించాడు.

శ్రీరాముని శివునితో పోల్చి శివకేశవ భేదాన్ని తుడిచేశాడు వాల్మీకి. శివకేశవు లిరువురు ఆరాధ్యమూర్తులే నని నిర్ణయించి నిర్దేశించాడు.

## శూర్పణఖ

గోదావరిలో స్నానమాచరించి సీతారామలక్ష్మణులు పర్ణశాలకి వచ్చారు. సీతతో కలిసి పర్ణశాల ముందు ఆసీనుడై ఉన్న రాముడు చిత్తా నక్షత్రములో కూడియున్న చంద్రునిలాగా శోభిస్తున్నాడు.

రాముడు సోదరుడైన లక్ష్మణునితో సంభాషిస్తున్నాడు. ఈలోగా ఒక రాక్షసస్త్రీ అక్కడికి వచ్చింది. లోకకళ్యాణాన్ని ఆవిష్కరించే ఒక మహాయజ్ఞానికి అంకురార్పణ చేసింది.

అది శూర్పణఖ. రావణాసురుని చెల్లెలు. మహేంద్రుని వలె వెలిగిపోతున్న రాముని చూచింది. రాముడు సింహములాగా విశాల వక్షము కలవాడు. మహాబాహుడు. కమలనేత్రుడు. ఆజానుబాహుడు. చూచువారికి ఆనందమును కలిగించువాడు. గజగమనుడు. సుకుమారుడు. ఈవిధమైన మహారాజ లక్షణాలతో శోభిస్తున్న రాముడు శూర్పణఖకు మన్మథునిలాగా కనిపించాడు. రాముణ్ణి చూచిన శూర్పణఖ కామోద్రేకంతో రెచ్చిపోయింది. రాముని మోహించి సమీపించింది.

వికృత స్వరూపం గల శూర్పణఖ యుక్తాయుక్తములు గమనించకుండా రాముని కామించడం చాలా ఆశ్చర్యకరమైన విషయం. రామునిలో ఆకర్షించే గుణాలు ఉండవచ్చు. అంతమాత్రాన పైపైకి పోతే ఎలా? తనలో ఏ లక్షణా లున్నాయో కూడా చూసుకోవాలి గదా!

ఈ సందర్భమున శూర్పణఖా రాముల మధ్యగల పోలికను అతి సున్నితమైన హాస్యంతో ప్రస్తావిస్తాడు వాల్మీకి. ఈ సన్నివేశంలో వాల్మీకి కలం కొత్తపుంతలు తొక్కింది.

**సుముఖం దుర్ముఖీ రామం వృత్తమధ్యం మహోదరీ**
**విశాలాక్షం విరూపాక్షీ సుకేశం తామ్ర మూర్ధజా**
**ప్రీతిరూపం విరూపా సా సుస్వరం భైరవస్వరా**
**తరుణం దారుణా వృద్ధా దక్షిణం వామభాషిణీ**
**న్యాయవృత్తం సుదుర్వృత్తా ప్రియ మప్రియ దర్శనా**
**శరీరజ సమావిష్టా రాక్షసీ వాక్య మబ్రవీత్**

1. రాముడు అందమైన ముఖము గలవాడు. శూర్పణఖ చెడ్డ ముఖము కలది. **(సుముఖం - దుర్ముఖీ)**

2. రాముడు సన్నని నడుము గలవాడు. శూర్పణఖ బానపొట్ట గలది. **(వృత్తమధ్యమ్-మహోదరీ)**

3. రాముడు విశాలనయనుడు. శూర్పణఖ వికృతనేత్రి. ( **విశాలాక్షమ్ - విరూపాక్షీ**)

4. రాముడు మంచి జుట్టు గలవాడు. శూర్పణఖ ఎఱ్ఱని వెంట్రుకలు కలది. (**సుకేశమ్-తామ్రమూర్ధజా**)

5. రాముడు ప్రియదర్శనుడు. శూర్పణఖ వికృత రూపము గలది. (**ప్రీతిరూపమ్-విరూపా**)

6. రాముడు మధురమైన కంఠధ్వని కలవాడు. శూర్పణఖ గార్దభకంఠీ. (**సుస్వరమ్-భైరవస్వరా**)

7. రాముడు యువకుడు. శూర్పణఖ చాలా ముసలిది. (**తరుణమ్-దారుణావృద్ధా**)

8. రాముడు వాక్చాతుర్యము కలవాడు. శూర్పణఖ దుష్టభాషిణి. (**దక్షిణమ్-వామభాషిణీ**)

9. రాముడు న్యాయవర్తనుడు. శూర్పణఖ చెడుప్రవర్తన గలది. (**న్యాయవృత్తమ్-సుదుర్వృత్తా**)

10. రాముడు ప్రియగోచరుడు. శూర్పణఖ అప్రియగోచరి. (**ప్రియమ్-అప్రియ దర్శనా**)

రామునికి, శూర్పణఖకు ఈ విధమైన సామ్యముందని హాస్యధోరణిలో పది లక్షణాలను ఉటంకించాడు వాల్మీకి మహాముని.

కామ మోహితురాలైన శూర్పణఖ రాముని సమీపించి కర్ణకఠోరమైన తన కంఠధ్వనిని వినిపించింది. "జడలు ధరించి మునిలాగా కన్పిస్తున్నావు. ధనుర్బాణాలు ధరించి భార్యని దగ్గర పెట్టుకున్నావు. ఇంతకీ ఎవరు నువ్వు? రాక్షసులకు విహారస్థలమైన ఈ అరణ్యానికి ఎందుకు వచ్చావు?" అని ప్రశ్నించింది.

రాముడు ఋజువర్తనుడు కనుక ఏదీ దాచుకోకుండా ఉన్నదున్నట్లు చెప్పాడు. రామునకు అసత్యం గిట్టదు. అందులోనూ ఆశ్రమవాసి. పైగా మాట్లాడుతున్నది స్త్రీతో. అందుచేత ఏదీ దాచిపెట్టకుండా చెప్పాడు అంటాడు వాల్మీకిమహర్షి.

"దేవతాసమానుడై దశరథుడు అనే రాజుండేవాడు. నేను ఆయన పెద్దకుమారుణ్ణి. నన్ను రాముడు అంటారు. ఇతడు నా తమ్ముడు. పేరు లక్ష్మణుడు. నన్ను సేవిస్తూ ఉంటాడు. ఈమె నా భార్య. పేరు సీత.

"తల్లిదండ్రుల ఆజ్ఞకు బద్ధుడనై వనవాసము చేయుటకు అరణ్యానికి వచ్చాను. నీవెవరు? ఎక్కడ ఉంటూవుంటావు? ఎవరి భార్యవు? ఇంత అందమైన దేహముగల నీవు రాక్షస స్త్రీవని నేను భావించడం లేదు. నీవు ఇక్కడికి ఎందుకు వచ్చావు? నిజం చెప్పు" అన్నాడు రాముడు.

శూర్పణఖ వికృతాకారము, వికృత చేష్టలు మహర్షి వాల్మీకికే నవ్వు పుట్టించాయి. ఆయన నవ్వుకోవడమే గాక మనకు నవ్వు పుట్టించే విధంగా శూర్పణఖా రాములకు పది లక్షణాలను పోలుస్తూ వర్ణించాడు. ఆయన ప్రయోగించిన భాష, ప్రవచించిన తీరు ఎంతో వినోదాత్మకంగా ఉంది. అయినా ఎక్కడి ప్రేమజంట!

ప్రథమంగా శూర్పణఖే రామునితో మాట్లాడింది. కాముకులలో ఎవరిలో కామం ఎక్కువగా ఉంటుందో, వారే ముందుగా నిగ్రహాన్ని కోల్పోయి భాషిస్తారని కామశాస్త్రము.



ఇక్కడ కామంలో హెచ్చుతగ్గులు అనే ప్రసక్తి రాదు. ఎందుచేతనంటే అసలు కామమున్నది ఇక్కడ ఒకవ్యక్తి లోనే. అందుచేత శూర్పణఖే ముందు మాట్లాడింది. ఆ మాటల్లో కూడా రాముని అనుమానిస్తూ మాట్లాడిన వ్యంగ్యధోరణి కనిపిస్తోంది.

జడలు ధరించి మునిలాగా, ధనుర్బాణాలను ధరించి భార్యను దగ్గరే పెట్టుకొని గృహస్థునిలాగా రాముడు పరస్పర విరుద్ధరూపాలతో గోచరిస్తున్నాడని అనుమానిస్తూ ప్రశ్నించింది.

కానీ, రాముడు కోపగించుకోలేదు. ఆమె అలా అనుమానించే విధంగానే తన రూపమున్నట్లు తనలో తాను అంగీకరిస్తాడు. అదే రామునిలో ప్రత్యేకత. అందుకే ఇక్కడ రాముని ఋజుబుద్ధి కలవాడుగా వర్ణించాడు వాల్మీకి (**ఋజు బుద్ధితయా**). కపటం తెలియనివాడు కనుక ఏదీ దాచుకోకుండా ఉన్నదున్నట్లు చెప్పాడు అంటాడు వాల్మీకి.

అంతవరకు బాగుంది. కానీ ఆ తరువాత రాముడు పరిహాసానికి కొన్నిమాటలు పలికినట్లు తెలుస్తూవుంది. శూర్పణఖని నీ తండ్రి ఎవరు? నీ భర్త ఎవరు? అని ప్రశ్నించడంలో సున్నితంగా హాస్యం చోటు చేసుకొని వుంది.

ముఖ్యంగా, "సుందరమైన దేహముగల నీవు రాక్షస స్త్రీవని నేను భావించుట లేదు;" అని రాముడు పలకడం విచిత్రంగా ఉంది కదూ? పది వికృత లక్షణాలతో వాల్మీకి విచిత్రంగా వర్ణించిన స్త్రీని సుందరాంగిగా రాముడు శ్లాఘించడం మ్రింగుడు పడని విషయమే.

ఇలా చెప్పడం అబద్ధం కాదా? రాముడు అబద్ధం చెబుతాడా? అబద్ధాన్ని ఇష్టపడతాడా?

**అనృతం నహి రామస్య కదాచిదపి సంమతమ్**

"రామునకు అసత్యము ఎప్పుడూ గిట్టదు" అని శ్రీరాముడు శూర్పణఖతో భాషించబోయే ముందే వాల్మీకి రాముని విశేషించి కీర్తించాడు.

రాముడు అసత్యవాది కాదు అని నిరూపించడానికి శూర్పణఖ కామరూపధారిణి కనుక అందమైన రూపంతోనే వచ్చిందని కొందరు వ్యాఖ్యానించారు. అదే నిజమైతే వాల్మీకి వర్ణించిన పది వికృతాల విషయ మేమిటి?

శూర్పణఖ అందంగా రాలేదు. రాముడు అసత్యమూ ఆడలేదు. రాముడు కేవలం పరిహాసానికే అలా అన్నాడు. శూర్పణఖ వాల్మీకికి, మనకు నవ్వును పుట్టించినట్లే రామునికి కూడా నవ్వు పుట్టించి వుంటుంది. అందుకే పరిహసిస్తూ అలా మాట్లాడాడు.

రాముడు మర్యాద పురుషోత్తముడు. ఆయన కృష్ణునివలె పరిహాసా లాడేవాడు కాడు అని కొందరు రామభక్తులు పిడివాదాలు చేస్తూ, రాముడికి నవ్వొచ్చినా, అలా నవ్వేందుకు వీలులేదని చెప్పేందుకు కూడా సిద్ధంగా ఉంటారు.

హాస్యాలు, పరిహాసాలు రామునిలో అసలే లేకపోలేదు. కృష్ణునిలో ఉన్నంతగా లేవనే మాట అక్షరసత్యమే గాని, అలాగని లేనేలేవని చెప్పడం ఆ చెప్పే వ్యక్తిలోని లేమినే సూచిస్తుంది.

అయోధ్యాకాండములో త్రిజటుడు అనే బ్రాహ్మణునికి దానము ఇచ్చినపుడు రాముడు పరిహాస మాడినట్లు మనం చూశాము. ఆ విషయాన్ని రాముడే అంగీకరించాడు కూడా.

కామ మోహితురాలైన శూర్పణఖ రామునితో ఇలా పలికింది.

"నేను రాక్షస స్త్రీని. నన్ను శూర్పణఖ అంటారు. ఏ రూపం కావాలంటే ఆ రూపాన్ని ధరించగలను. నేను ఈ అరణ్యములో ఒంటరిగా సంచరిస్తూ ఉంటాను. నేనంటే అందరికి భయమే.

"నీవు రావణాసురుని గూర్చి వినే వుంటావు. అతడెవరో కాదు. నా సోదరుడే. సదా నిద్రాలోలుడై వుండే కుంభకర్ణుడు, ధర్మాత్ముడు, రాక్షస గుణములు లేనివాడైన విభీషణుడు నా సోదరులే. యుద్ధములో గొప్ప పరాక్రమము గల ఖరదూషణులు కూడా నా సోదరులే.

"రామా! నేను వాళ్ళెవరినీ లెక్కపెట్టను. తొలిసారిగ నిన్ను చూడగనే నా మనసు వానచినుకు భూమిని చేరునట్లు నిన్ను చేరింది. నేను చాలా గొప్పదానిని. నేను స్వేచ్ఛగా ఎక్కడికైనా పోగలను. నువ్వు నాకు భర్తవు కా! ఈ సీతతో నీకేమి పని?

"ఈ సీత కురూపి. వికారంగా ఉంది. ఈమె నీకు తగింది కాదు. నీకు అన్నివిధాలా తగినదానను నేనే. నన్ను పెళ్ళిచేసుకో.

"ఈ వికారియైన సీత నడుము లేనిది. అసలు ఆవిడకి పొట్టేది? ఈమెను, నీ సోదరుని భక్షించి మనిద్దరి మధ్య అడ్డు లేకుండా చేస్తాను.

"మనోహరా! ఆ తరువాత మన మిద్దరము పర్వత శిఖరాల మీద, వనప్రదేశాల లోను హాయిగా, ఆనందంగా విహరిస్తాము" అన్నది శూర్పణఖ. వాక్చాతుర్యము గల రాముడు ఆమెతో నవ్వుతూ ఇలా పలికాడు.

**అనుజస్త్వేష మే భ్రాతా శీలవాన్ ప్రియదర్శనః**
**శ్రీమా నకృత దారశ్చ లక్ష్మణో నామ వీర్యవాన్**

"ఇతడు నా తమ్ముడు. పేరు లక్ష్మణుడు. మంచివాడు. చాలా చక్కనివాడు. సౌందర్య పురుషుడు. పెళ్ళి కానివాడు. గొప్ప పరాక్రమవంతుడు.

"ఇంతవరకు భార్య ఏమిటో తెలియనివాడు. భార్య కావాలని కోరుకుంటున్నాడు. అందమైనవాడు. నీకు తగిన భర్త. సవతి లేని కాపురం హాయిగా చేసుకుందువు గాని"అన్నాడు రాముడు.

రాముడు నవ్వుతూ పలకడం ప్రారంభించాడని వాల్మీకి అంటున్నాడు. పైగా రాముడు శూర్పణఖతో చెప్పిన మాటలు వింటూవుంటే హాస్యానికి అలా మాట్లాడాడని ఎవరికైనా తెలిసిపోతోంది.

రాముడు ఇలా పలకడం అసత్యం అవుతుందని భావించిన కొందరు వ్యాఖ్యాతలు వారి అతిశయించిన భక్తిలో విషయాన్నే తారుమారు చేశారు. లక్ష్మణుని **అకృతదారః** అన్నాడు రాముడు. అంటే పెళ్ళి కానివాడు, లేదా భార్య లేనివాడు అని భావము.

లక్ష్మణుడికి పెళ్ళి అయిందికదా? అట్టి వానిని "అకృతదారః" అనడంవల్ల రాముడు అసత్యం పలికినట్లు అవుతుందని భావించిన కొందరు వ్యాఖ్యాతలు ఆ పదానికి వేరే అర్థాన్ని చెప్పారు.

**"అకృతదారః"** అంటే పెళ్ళికానివాడు అని కాదట. పెళ్ళి అయి భార్యను వెంటబెట్టుకొని రానివాడు అని అర్థమట. సంస్కృత ధాతువుల్ని ఎలాగైనా సమన్వయించి చెప్పవచ్చు. కానీ



దానివల్ల ఒరిగేదేమిటి? తరిగేదేమిటి? మరి స్పష్టంగా "భార్య", "భర్త" అనే పదాల్ని కూడా రాముడు ఉపయోగించి యున్నాడు కదా? వాటిని ఈ వ్యాఖ్యాతలు ఎలా సమర్థిస్తారు?

"అకృతదారః" అంటే ఇప్పుడు భార్య కలిసి జీవించుటలేదు అని భావమని గోవిందరాజులు వ్యాఖ్యానించారు. రాముడు పరిహాసానికి అలా మాట్లాడలేదు. వివాహము కానివాడు అని అసత్యమూ చెప్పలేదు. పెళ్ళి అయింది కానీ ప్రస్తుతము భార్య లేదు అనే భావంలో రాముడు పలికాడు అంటాడు గోవిందరాజులు. **(అకృతదారః అసహకృత దార ఇత్యర్థః । "న వితథా పరిహాస కాథాస్వపి" ఇత్యుక్తేః! "అనృతం నోక్త పూర్వం మే న చ వక్ష్యే కదాచన" ఇత్యుక్తేశ్చ అకృతదార ఇతి నార్థః ॥)**

ఇంతకీ ఈ భావంతో రాముడు ఎందుకు మాట్లాడవలసి వచ్చింది? శూర్పణఖ ఎలా అర్థం చేసుకోవాలని రాముడు భావించాడు? పెళ్ళి అయినవాడే గాని భార్యను వెంటబెట్టుకొని రాలేదు అని శూర్పణఖ గ్రహించాలా? అదే రాముని అభిప్రాయమైతే ఆ విషయాన్ని సూటిగా చెప్తే సరిపోతుంది గదా? తన మనసులో లక్ష్మణునికి పెళ్ళయినట్లు తెలిసి పెళ్ళి కాలేదనే భావంతో పదప్రయోగం చేసి సాధించే దేముంటుంది?అనవసరంగా మిశ్రమభావాలతో కలత చెందడం తప్ప. కనుక లక్ష్మణునకు పెళ్ళి కాలేదు అని రాముడు నిజానికి పరిహాసానికే అన్నాడు. పరిహాసము అసత్యం క్రిందికి రాదు.

**న హి రామో మిథ్యా బ్రూతే! పరిహాసాదౌ మిథ్యా భాషణే న దోష**
**ఇత్యనేన సూచ్యతే ఇతి వయమ్!**

"రాముడు అసత్యం పలకలేదు. పరిహాసము చేయు సమయాలలో అబద్ధము లాడుట దోషము కాదు" అని తిలకవ్యాఖ్య.

వినోదం కొరకు రాముడు అలా చెప్పగానే శూర్పణఖ రాముణ్ణి విడిచి లక్ష్మణుని వద్దకు వెళ్ళింది. లక్ష్మణునితో ఇలా పలికింది.

"నీవు నాకు తగిన భర్తవు. నేను నీకు తగిన భార్యను. మనిద్దరి దాంపత్యాన్ని చూచి ప్రపంచం అసూయ పడుతుంది. నన్ను వెంటనే నీ భార్యగా చేసుకో" అంది శూర్పణఖ.

శూర్పణఖ వ్యవహారం లక్ష్మణునికి కూడా వినోదంగానే తోచింది. లక్ష్మణుడు నవ్వుతూ ఇలా పలికాడు.

"సుందరీ! నేను మా అన్నగారైన రామునకు సేవకుడను. దాసుడైన నాకు భార్యవయితే నీవు కూడా దాసీదాని వలె పడివుండవలసి వస్తుంది. నామాట విను. విశాలాక్షీ! కమలవర్ణంతో శోభించు నీవు మా అన్నగారికి చిన్నభార్యవు కా! ఎక్కడైనా చిన్నభార్యే అదృష్టవంతురాలు. నీవు హాయిగా సుఖిస్తావు.

"వికృత రూపిణియై అణగిపోయిన పొట్టగల ఆ ముసలి భార్యను త్యజించి రాముడు నీతో కాపురం చేస్తాడు. అందమైన నిన్ను ఏ పురుషుడు వదులుకుంటాడు?" అన్నాడు లక్ష్మణుడు.

పరిహాసము అర్థంగాని శూర్పణఖ లక్ష్మణుడు చెప్పిందంతా నిజమేనని భావించింది. వెంటనే అక్కడనుండి బయలుదేరి రాముని సమీపించింది.

శూర్పణఖ దృష్టిలో సీత వికృతంగా, వృద్ధురాలుగా గోచరించింది. సీతను గూర్చి శూర్పణఖ ఏ విధంగా విమర్శిస్తూ మాట్లాడిందో లక్ష్మణుడు ఆ మాటల్నే శూర్పణఖకు వినిపించాడు. అప్పుడు కూడా రామలక్ష్మణులు తనతో పరిహాస మాడుతున్నారని శూర్పణఖ గ్రహించలేక పోయింది. శూర్పణఖ రామునితో ఇలా పలికింది.

"రామా! నీ భార్య కురూపి. దుష్టురాలు. భయంకరమైనది. ముసలిది. దానిని చూసుకొని నీవు నన్ను గుర్తించుట లేదు. గౌరవించుట లేదు. నీ ముందే సీతను మ్రింగేస్తాను. సవతిపోరు దూరం చేసుకొని నీతో హాయిగా జీవిస్తాను;" అని పలికి సీత మీదకు ఉరికింది.

మృత్యువు వలె మీదికి వస్తున్న శూర్పణఖను బెదిరించి రాముడు లక్ష్మణునితో ఇలా పలికాడు.

"లక్ష్మణా! క్రూరులైన దుష్టులతో పరిహాస మాడడం మంచిది కాదు. సీత ఈమె చేతిలో మరణించి ఉండవలసింది. దైవవశాన బ్రతికి మన మధ్య ఉన్నది.

"దుష్టురాలైన ఈ రాక్షసస్త్రీ మదించి వుంది. దీనిని అంగ విహీనురాలుగా మార్చేయి. వికృతంగా తీర్చేయి" అన్నాడు రాముడు.

బలశాలి యైన లక్ష్మణుడు ఖడ్గమును చేత పట్టుకొని శూర్పణఖ ముక్కు చెవులను ఖండించాడు. దుష్టురాలైన ఆ శూర్పణఖ వర్షాకాల మేఘం లాగా పెద్ద శబ్దం చేస్తూ, వికృతంగా అరుస్తూ, రక్తం కార్చుకుంటూ అడవిలోకి పారిపోయింది.

లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులను మాత్రమే ఖండించినట్లు వాల్మీకము నందున్నది. అధ్యాత్మ రామాయణము, తులసీ రామాయణము నందు కూడా ఇలాగే ఉంది. కంబరు తన తమిళ రామాయణంలో ముక్కు చెవులతో పాటు, చనుమొనలు కూడా కోసినట్లు వ్రాశాడు. ఈ విషయంలో కంబరు భారతాన్ని గాని, లేదా స్కాందపురాణాన్ని గాని అనుసరించి ఉండాలి.

**నికృత్త కర్ణ నాసోష్ఠా చ కార రఘునందనః**

చెవులు, ముక్కు, పెదవులను ఖండించినట్లు భారతంలో చెప్పబడింది.

**లక్ష్మణోంతూర్ణ ముత్థాయ కరవాలేన వీర్యవాన్ కర్ణౌ స్తనౌ నాసికాంచ అచ్ఛిన ద్రామ శాసనాత్ !**

"రాముని ఆదేశము ననుసరించి లక్ష్మణుడు శూర్పణఖ చెవులు, స్తనములు, ముక్కును ఖండించినట్లు స్కాందపురాణములో ఉంది.

శూర్పణఖ వాసనా స్వరూపము. ఎక్కడ సౌందర్యం కనిపించినా దానిని వాంఛించడమే వాసన యొక్క స్వభావము. రాముడు అందంగా కనిపించాడు. రాముని అభిలషించింది. కానీ రాముని పొందలేక పోయింది.

ఆ తరువాత లక్ష్మణుని ఆశ్రయించింది. రాముని కన్నా లక్ష్మణుడు ఎర్రగా ఉన్నాడని తృప్తి చెందింది. పూర్వ వస్తువునందు, పూర్వ విషయమునందు లేని శోభను తరువాత వస్తువులో, విషయంలో చూడడమే వాసన యొక్క ప్రత్యేక స్వభావం.



వాసన స్థిరమైనది కాదు. చంచలమై పరిభ్రమిస్తూ ఉంటుంది. శూర్పణఖ కూడా స్వేచ్ఛావిహారిణి. స్థిరత్వము లేనిది. వాసన కొంతసేపు భోగములలో చరిస్తుంది. కొంతసేపు కీర్తిని వాంఛిస్తూ ఊరేగుతుంది.

భోగానుభవానికి, కీర్తిప్రతిష్ఠలకు అడ్డంకులు ఏర్పడినపుడు అబద్ధాలు పలకడానికి, అసత్యాలు సృష్టించడానికి కూడా వెనుకాడదు. తన భర్త ఎవరో చెప్పమని రాముడు ప్రశ్నిస్తే, శూర్పణఖ తన సోదరుల విషయం ప్రస్తావించి, తనకు వివాహం కానట్లు అబద్ధం చెప్పింది.

అందమైన సీతమ్మను ఎదురుగానే వికృతంగా వర్ణించింది. వాసన సిగ్గు ఎరుగదు. నీతి నెరుగదు. ధర్మ మెరుగదు. వాసనకు స్వార్థమొక్కటే తెలుసు.

శూర్పణఖ మొదట మంచిగానే కన్పిస్తుంది. తన కోర్కె నెరవేరనిచో భయంకర రూపాన్ని ధరిస్తుంది. తనను వివాహం చేసుకోమని రామలక్ష్మణులను ప్రాధేయపడుతూ తిరిగింది. కానీ ఫలించలేదు.

**'కామా త్క్రోధోభి జాయతే'** తీరని కామము క్రోధంగా పరిణమిస్తుంది అని భగవద్గీత చెబుతుంది. శూర్పణఖ కోరిక ఫలించక పోయేసరికి ఆవిడలో క్రోధం తలెత్తింది. రామ లక్ష్మణులు తనకు లభించక పోవడానికి సీతయే కారణమని గ్రహించిన శూర్పణఖ సీతను భక్షించడానికి వెనుకాడలేదు.

తృష్ణ చాలా భయంకరమైంది. అది ఎప్పుడు ఎలా విజృంభిస్తుందో తెలియదు. కాళరాత్రి వలె విరుచుకపడే ఈ తృష్ణ అనే వాసనా రాక్షసిని వధించనిదే జీవికి శాంతి మిగలదు.

**అహోబత మహచ్చిత్రం తృష్ణామపి మహాధియః**
**దుశ్ఛేదా మపి కృన్తన్తి వివేకేనా మలాసినా !**

"ఆహా!..." ఎంత విచిత్రము! ఛేదించుటకు దుస్సాధ్యమైన తృష్ణను గొప్ప బుద్ధిమంతులైన మహాత్ములు వివేకమనే తమ ఖడ్గముచేత నరికివేస్తున్నారు" అన్నది యోగవాసిష్ఠము.

లక్ష్మణుడు వివేకము యొక్క స్వరూపము. వాసనా రూపమైన శూర్పణఖ ముక్కు చెవులను లక్ష్మణుడు ఖండించాడు. వాసనా స్వరూపమును వికృత మొనర్చినాడు.

వాసన ఇంద్రియముల ద్వారా ఇంద్రియ విషయాలమీదికి పరుగెడుతూ ఉంటుంది. ఇంద్రియములను నిగ్రహించగలిగితే అంతవరకు ప్రేరేపించిన ఇంద్రియ విషయాలు నిస్సార ములై మిగిలిపోతాయి.

అందుచేతనే లక్ష్మణుడు ముక్కు చెవులను కోసాడు. ఇంద్రియములను నిగ్రహించాడు. ఇంద్రియాలను నిగ్రహించగనే వ్యక్తం కాలేని వాసన పారిపోతుంది. శూర్పణఖ కూడా అరణ్యం లోకి పారిపోయింది.

శూర్పణఖ సీతను చంపాలని యత్నించింది. సీతమ్మ భక్తి స్వరూపము. పంచవటిలో సీతమ్మ ఉన్నంతవరకు తనకు స్థాన ముండదని గ్రహించిన శూర్పణఖ సీతమ్మను వధించా లని ప్రయత్నించింది.

మనలో భక్తి స్థిరంగా వున్నంతవరకు వాసన ఆంతర్యంలో ప్రవేశించలేదు. కనుక వాసన భక్తిని హరిస్తుంది. భక్తి లేని హృదయాన్ని వాసన నిరాటంకంగా పాలించగలదు.

వాసన వలన భక్తి నశించకుండా చూసుకోవాలి.ఆ పని వివేకానికే సాధ్యము. లక్ష్మణుడు వివేకము యొక్క స్వరూపము. సీతమ్మను హరించుటకు ఉరికిన శూర్పణఖను లక్ష్మణుడు ఛేదించినట్లు, భక్తిని హరించుటకు ప్రవేశించే వాసనను వివేకము ఛేదించాలి.

వాసన కోరికలను సృష్టిస్తుంది. కోరికలు దుఃఖాన్ని కల్పిస్తాయి. కనుక భగవంతుని కోరవలసింది భక్తిని అనుగ్రహించమనే గాని, భోగాసక్తిని పెంచమని, భోగాలను అందించమని కాదు.

కోరిన వారంతా కొరగాని వారుగా మిగిలిపోతారు. విషయసుఖాలను ఆశించు వారంతా వికృతరూపులు గానే మారిపోతారు. శూర్పణఖ విషయంలోనూ అదే జరిగింది. ఈ విషయాన్ని ఉటంకిస్తూ త్యాగరాజస్వామి శ్రీరాముని నిందాపూర్వకంగా స్తుతిస్తాడు.

**అడిగి సుఖము లెవ్వ రనుభవించిరి రా**

**ఆదిమూలమా రామ ॥అడిగి॥**

అడిగిన వారెవ్వరూ ఇంతవరకు సుఖములు అనుభవించినట్లు లేదు. మా ప్రార్థనల విషయం కూడా అంతేనా? అని త్యాగరాజస్వామి వ్యంగ్య ధోరణిలో రామునికి విన్నవించుకుంటూ,

**ఆశహరణ రక్కసి ఇష్ట మడుగ అపుడె ముక్కు పోయె ఓ రామా ॥ అడిగి ॥**

జగన్మోహనాకారుడైన రాముని ఆశించింది శూర్పణఖ. అంతే. మూడు క్షణాల్లో ముక్కు దూరమైంది. అడిగిన వారు ఎవరు సుఖపడ్డారు? అని ప్రశ్నిస్తూ దుఃఖానికి కారణమైన ఆశలను, వాసనలను మనసు నుండి దూరం చేయమని ప్రార్థిస్తారు త్యాగరాజస్వామి.

కనుక భక్తినే వాంఛించాలి. అది శుద్ధవాసన. భోగాసక్తిని విడనాడాలి. అది అశుద్ధవాసన. శుద్ధవాసన మోక్షానికి, అశుద్ధవాసన నరకానికి హేతువు లవుతాయి.

**సద్భావే భగవత్ప్రాప్తి అసద్భావే అధోగతి**

**భగవద్భక్తా సుఖప్రాప్తి దుఃఖప్రాప్తి అభక్తా !**

"సద్భావం వల్ల భగవత్ప్రాప్తి కల్గుతుంది. అసద్భావం అధోగతిని కల్పిస్తుంది. భక్తుడు సుఖప్రాప్తిని, అభక్తుడు దుఃఖప్రాప్తిని పొందుతారని భావార్థరామాయణం అరణ్యకాండంలో ఏకనాథ్ ప్రవచిస్తాడు.

## ప్రచండ సమరానికి ప్రస్తావన

శూర్పణఖ పంచవటిలో ప్రవేశించినపుడు మందహాసాలు, పరిహాసాలు మాత్రమే కనిపించాయి. వినిపించాయి. కానీ వాటి పర్యవసానాలను అవలోకిస్తే అవి మారణహోమాలకు, పరితాపాలకు దారితీసాయి.

జీవిత మొక భయంకరమైన అరణ్యము. పంచవటి అనే పాంచభౌతిక దేహంలో జీవించే వారికి ఏక్షణాన ఏది ఎదురౌతుందో ఊహించలేము. మంచి ఏదో, చెడు ఏదో నిర్ణ యించలేము.



దుఃఖరూపంగా తెలిసి సుఖంగా మారేవి కొన్నయితే, సుఖరూపంగా తెలిసి దుఃఖంగా పరిణమించేవే ఎక్కువ. విలాసాలు విలాపాలై, వినోదాలు విషాదాలుగా మారేవే అధికంగా ఉంటాయి. సుఖాలు ఈ ప్రపంచంలో ఎప్పుడూ సుఖాలుగా మిగలవు.

**Consider pleasures as they depart not as they come.**

"సుఖాలు వచ్చేటప్పు డున్నట్లుగా పోయేటప్పుడు ఉండవని గుర్తుంచుకో" అంటాడు అరిస్టాటిల్.

నిజమే కదూ! శూర్పణఖ ఎంత విలాసంగా ప్రవేశించింది! భవిష్యత్తుకు ఎంత విషాదాన్ని వదలిపెట్టి వెళ్ళింది! ఒక మహాసంగ్రామానికి బీజం నాటింది. జరుగబోయే కథకి ప్రస్తావన పలికింది.

బురదనుండి కమలము ఆవిర్భవించునట్లు, మట్టినుండి మాణిక్యాలు బయల్వెడలునట్లు, కొన్ని సందర్భాలలో మహోన్నత కార్యాలకి సామాన్యులు అంకురార్పణ చేస్తారు. దుష్టశిక్షణకు ఒకొక్కసారి దుర్మార్గులే ఆవిష్కరణ చేసి, తెరను తొలగిస్తారు.

భార్య కావాలని ఆశించి బాధగా మిగిలిపోయిన శూర్పణఖ, తన దుర్బోధ ద్వారా ఖరదూషణులను, రావణుని రెచ్చగొట్టి, వారి మరణానికి కారణ మౌతుంది.

రావణవధతో లోకం శాంతిమయ మవుతుంది. ఈ లోకకళ్యాణానికి జరిగిన కృషిలో ఎందరో అమాయకులు బలి అయ్యారు. ఎందరో సజ్జనులు దుర్జనుల చేతిలో నలిగిపోయారు. సీతమ్మ లాంటి మహాసాధ్వి కూడా కడలితో పోటీపడి కన్నీరు కార్చవలసి వచ్చింది. కొందరు బాధలు అనుభవిస్తే గాని ఎందరో సుఖించడం జరగదేమో? కానీ, ఇతరులను సుఖపెట్టేందుకు బాధపడే వారికి మిగిలే సంతృప్తి, సుఖం, ఇతరుల బాధల ద్వారా లభించే సుఖాన్ని అను భవించే వారికి ఉంటుందా?

పర్వతాన్నుండి జాలువారే జలపాతం లాగా తన దేహంనుండి కారుతున్న రక్తంతో తడిసి, భుజాలు పట్టుకొని కేరింతలు పెడుతూ రాక్షస నివాసమైన జనస్థానానికి వచ్చింది శూర్పణఖ.

అంగవిహీనయై, స్రవించుచున్న రక్తంతో నేలపై బడిన శూర్పణఖను చూచి ఖరుడు ఇలా పలికాడు.

"ఏమిటిది? శూర్పణఖా! లే. జరిగింది చెప్పు. నిన్ను ఇలా వికృతంగా మార్చిం దెవరు? ఏడవకు. తొందరగా చెప్పు.

"ఎవరి జోలికి పోకుండా పడియున్న విషనాగును వ్రేలుపెట్టి పొడిచిం దెవరు? కాలపాశం గొంతుకు చుట్టుకొని ఉన్నదని తెలియక, నిన్ను హింసించి చేజేతులా విషం త్రాగిన ఆ మందభాగ్యు డెవరు?

"శూర్పణఖా! నీవు బలపరాక్రమ సంపన్నురాలవు. స్వేచ్ఛారూపిణివి. స్వేచ్ఛా విహారిణివి. యమునితో సమానురాలవు. అట్టి నిన్ను ఈవిధంగా అవమానపరచిన వాడెవరు?

"ఈ లోకంలో నాకు అపకారం చేయగలవాడు ఎవ్వడూ లేడు. దేవేంద్రుడు కూడా ఆ విషయంలో సాహసించడు. శూర్పణఖా! దుఃఖించకు. నీళ్ళతో కలిసిన పాలను హంస

వేరుచేసి పానం చేయునట్లు, వాడియైన నా బాణాలతో వాడి ప్రాణాల్ని దేహం నుండి వేరు చేస్తాను.

"వాడి రక్తాన్ని భూమి త్రాగుతుంది. వాడి మాంసాన్ని కాకులు, గ్రద్దలూ సంతోషంగా తింటాయి. నేను యుద్ధంలో ఎవడ్ని క్రిందపడేసి ఈడుస్తానో, వాణ్ణి రక్షించడానికి దేవ గంధర్వ రాక్షస పిశాచాదులు కూడా ప్రయత్నించరు. సాహసించరు. లే.... మెల్లగా తేరుకో. దుఃఖాన్ని మ్రింగేయ్. ఆ దుష్టుడి పేరు కక్కేయ్;" అంటూ గర్జించాడు ఖరుడు.

శూర్పణఖ వాసనా స్వరూపము అని తెలుసుకున్నాము. కామస్వరూపిణి యైన శూర్పణఖ అనుకున్న కార్యమును సాధించలేక పోయింది. కామము తీరనపుడు క్రోధము పుడుతుంది. అట్టి క్రోధ స్వరూపమే ఖరుడు.

ఖరుడు అనగా కఠినమైనవాడు, పదునైనవాడు, క్రూరమైనవాడు అని అర్థము. క్రోధము సంకల్ప రూపంలో కఠినంగా ఉంటుంది. మాటల రూపంలో పదునుగా ఉంటుంది. చేతల రూపంలో క్రూరంగా ఉంటుంది.

క్రోధానికి విచక్షణ యుండదు. యుక్తాయుక్తములు తెలియవు. పూర్వాపరాలు ఆలోచించే అలవాటు ఉండదు. ఆవేశమే ఆహారంగా, పరుషవాక్కులే పానీయంగా చేసుకొని క్రోధం జీవిస్తుంది.

ఏం జరిగిందో తెలుసుకోకుండా ఖరుడు ఎంతగా ప్రలాపం సాగించాడో చూశారు కదూ? క్రోధమెప్పుడూ అలాగే ఉంటుంది. ఎదుటి వ్యక్తి మాటలు పట్టించుకోకుండా తానే బాణంలా దూసుకుపోతూ మాట్లడడం క్రోధమునికే సాధ్యం. అన్యులకు అసాధ్యం.

కామం వల్ల రాగం పుడుతుంది. క్రోధం వల్ల ద్వేషం కల్గుతుంది. ఈ కామక్రోధాలే శూర్పణఖా ఖరులు. వారినుండి బహిర్గతమయ్యే విషయాలే రాగద్వేషాలు. ఈ రాగద్వేషాల కారణంగానే మానవుని స్వభావము దారితప్పి ప్రవర్తిస్తూ ఉంది.

**య హి పురుషస్య ప్రకృతిః సా రాగద్వేష పురస్సరైవ స్వకార్యే పురుషం ప్రవర్తయతి।**

"తన రాగద్వేషముల వల్లనే మానవుని స్వభావము మానవుని దారి తప్పించు చున్నది" అని శ్రీశంకరాచార్య స్వామి తమ గీతాభాష్యంలో తెలుపుతారు.

నిజానిజాలు గ్రహించకుండా క్రోధరూపుడైన ఖరుడు తనను వికృతంగా మార్చిన వానిని వధిస్తానని శూర్పణఖకు మాటఇచ్చాడు. శూర్పణఖ ఖరునితో ఇలా పలికింది.

"సోదరా! దశరథుని పుత్రులట. రామలక్ష్మణులు వారి పేర్లు. అందమైన యువకులు. సుకుమారులే గాని బలశాలురు. విశాల నేత్రాలతో మెరిసిపోతుంటారు.

"నారచీరలు కట్టుకొని, జింకచర్మము చుట్టుకొని ఉంటారు. ఫలమూలాలను తింటారు. ధర్మాసక్తులై ఇంద్రియనిగ్రహంతో జీవిస్తారు.

"వారి మధ్యలో ఒక మగువ ఉంది. ఆవిడ చాలా సౌందర్యవతి. ఆవిడ కారణంగా వాళ్ళిరువురూ నన్ను ఇలా వికృతంగా మార్చారు.



"సోదరా! ఆ స్త్రీ, సీతో గీతో - చాలా చెడ్డది. వాళ్ళ ముగ్గురిని చంపితే, నురుగుతో నిండిన ఆ కొత్త రక్తాన్ని పానం చేయాలని నా మనసు ఉబలాట పడుతోంది. నాయనా! నువ్వు నా ఈ కోర్కెను తీర్చాలి;" అని అభ్యర్థించింది రాతిగుండె గల చుప్పనాతి. మునలికోతి.

ఒక ఆసక్తికరమైన విషయాన్ని మనం ఇక్కడ గమనించాలి. రామలక్ష్మణుల సుగుణాలను ఉన్నవి ఉన్నట్లు వర్ణించింది శూర్పణఖ. ఇంద్రియనిగ్రహంతో జీవిస్తారు అని చెప్పిందే గాని తాను వారిని ఆశించినట్లు చెప్పలేదు.

ముఖ్యంగా సీతమ్మను సుందరాంగిగా వర్ణించింది. ఏ సీతమ్మను వికారిగా, వృద్ధురాలిగా, అణగిపోయిన పొట్ట గలదానిగా రామలక్ష్మణుల ముందు వర్ణించిందో ఆమెనే సౌందర్యవతిగా ఖరుని ముందు వర్ణిస్తూ ఉంది. వాసనకు ఎన్ని వేషాలో? మోహానికి ఎన్ని మోసాలో?

సీతమ్మ కారణంగా రామలక్ష్మణులు తనను వికృతంగా మార్చారని చెప్తున్నదే గాని ఆ కారణ మేమిటో వివరించలేదు. ఏమిటా కారణము? అని ఖరుడు అడగనూ లేదు.

రహస్యాలు కాపాడుకోవడం కామానికి అలవాటు. నేల విడిచి సాముచేయడం క్రోధానికి గ్రహపాటు. నిజం చెప్పాలని శూర్పణఖ భావించదు. అడిగి తెలుసుకోవాలని ఖరుడూ ప్రయత్నించడు. కామముయొక్క స్థితి, క్రోధముయొక్క పరిస్థితి అలాగే ఉంటాయి.

శూర్పణఖ మాటలను ఆలకించిన ఖరుడు ఆగ్రహోదగ్రు డయ్యాడు. మహా బల శాలురు, యమునితో సమానులైన పదునాలుగు మంది రాక్షసుల్ని పిలిచి ఆజ్ఞాపించాడు.

"నారచీరలు కట్టుకొని, జింకచర్మము చుట్టుకొని యున్న ఆ మానవు లిద్దరిని, వారి వెంటయున్న ఆ దుష్టస్త్రీని వధించండి. వెంటనే ఆ పని జరిగిపోవాలి. ఆకలితో వున్న నా సహోదరి వారి రక్తాన్ని కడుపారా జుర్రుకోవాలి. వెళ్ళండి. నా చిట్టిచెల్లెలి కోరికను తీర్చండి;" అన్నాడు ఖరుడు.

శూర్పణఖ దారి చూపిస్తూ నడుస్తోంది. ఆ పదునాలుగు మంది రాక్షసులు బయలు దేరారు. గాలి తరిమే మేఘాల్లాగా, శూర్పణఖ తరుముతూ వుంటే ఆ రాక్షసులు ఎగిరి వెళ్ళారు.

శూర్పణఖ శ్రుతిహీనురాలు. అంటే చెవి లేనిది. శ్రుతిహీనురాలైన శూర్పణఖ చూపిన దారిలో నడిచేవారు దుర్గతి పాలౌతారే గాని సుగతిని పొందలేరు. శూర్పణఖ మార్గమును చూపగా నడచి వెళ్ళారు గనుక ఖరునితో సహా అతని సైన్యమంతా నశించిపోయారు.

శ్రుతి లేని శూర్పణఖ మార్గగామినిగా ముందు నడచి ఖరుని నశింపచేసింది. శ్రుతి అంటే వేదము. వేదవిహీనమైన మార్గమును ఎవరు అనుసరిస్తారో వారి గతి దుర్గతియే అని దీనిని బట్టి గ్రహించాలి.

శూర్పణఖ కామంగాను, ఖరుని క్రోధంగాను తెలుసుకున్నాం. వీరి ఆజ్ఞలను పాలించ డానికి వచ్చిన ఈ పదునలుగురు రాక్షసు లెవరు?

అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము వెరశి పదునాలుగు. ఈ ఇంద్రియ మనోబుద్ధుల సంఘాతమే ఆ పద్నాలుగు మంది రాక్షసులు.

వీరు వధించబడిన తరువాతే ఖరుడు చస్తాడు. కామక్రోధాల్ని జయించాలంటే, ఇంద్రియ మనోబుద్ధుల్ని ముందుగా జయించాలి. మరి రామలక్ష్మణులు ఏమి చేస్తారో చూద్దాం.

## రుచి చూపిన రామబాణం

ఖరుడు పంపిన పద్నాల్గుగు మంది రాక్షసులు పంచవటికి వచ్చారు. శూర్పణఖ రామలక్ష్మణులను వారికి చూపింది. శూర్పణఖతో కలిసి వచ్చిన రాక్షసులను రాముడు కూడా చూశాడు.

"లక్ష్మణా! ఈ రాక్షసస్త్రీ కొందరు రాక్షసుల్ని వెంటబెట్టుకొని వచ్చింది. నీవు సీత దగ్గరే వుండు. క్షణంలో వాళ్ళ పని పూర్తిచేసి వస్తాను" అన్నాడు రాముడు.

రాముడు ధనుస్సుకు నారి కట్టాడు. రాక్షసుల్ని చూచి, "రాక్షసులారా! మేము రామలక్ష్మణులము. దశరథుని కుమారులము. నా భార్యయైన సీతతో కలిసి ఈ అరణ్యంలో తాపసవృత్తిలో జీవిస్తున్నాము. మమ్మల్ని మీరెందుకు బాధిస్తున్నారు?

"హింసకు అలవాటుపడ్డ పాపాత్ములు మీరు. ఋషుల ఆజ్ఞ మేరకు మిమ్మల్ని వధించుటకు మేము ధనుర్బాణాలు ధరించి ఉన్నాము. అడుగు ముందుకు వేయకండి. వచ్చిన దారినే తిరిగిపొండి. లేదా ఈ అడవి రక్తపు మడుగుగా మారిపోతుంది;" అని పలికాడు రాముడు.రాముని మాటలకు రాక్షసులు క్రుద్ధులయ్యారు. శూలములను హస్తముల యందు ధరించియున్న రాక్షసులు రామునితో ఇలా పలికారు.

"మా ప్రభువు ఖరుడు. గొప్పవాడైన ఖరునకు మీరు కోపం కలిగించారు. ఇక మీ ప్రాణాలు నిలువవు. నీవు మాతో యుద్ధము చేయడమా? మేము శూలములను ప్రయోగించ గనే ప్రాణములను, ధనుస్సును ఒకేసారి విడిచిపెట్టావు. చూస్తావేం! రా!" అంటూ రాముని మీదికి శూలములను విడిచారు రాక్షసులు.

వారు విడిచిన శూలాల్ని బాణాలతో రాముడు ఖండించాడు. అంతటితో ఆగకుండా సూర్యతేజము వలె ప్రకాశిస్తున్న పద్నాలుగు బాణాలు గ్రహించి ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించినట్లు ఆ రాక్షసులపై బాణప్రయోగం చేశాడు. ఆ బాణాలు రాక్షసుల వక్షస్థలాన్ని ఛేదించాయి. వారి దేహాలు రక్తసిక్త మయ్యాయి. మొదళ్ళు నరికిన వృక్షాల్లాగా రాక్షసులు నేలపై పడ్డారు. ప్రాణాలు విడిచారు.

కూలిపోయిన ఆ పద్నాలుగుమంది రాక్షసుల్ని చూచి శూర్పణఖ భయక్రోధాలతో కలతచెంది దిక్కులు పిక్కటిల్లేలా అరచింది. ముక్కు చెవుల నుండి కారుతున్న రక్తం కొంచెము ఎండిపోగా జిగురు కారుతున్న తీగలాగా ఖరుని వద్దకు ఏడుస్తూ వచ్చి నేలమీద పడింది. రాక్షసులు మరణించిన విషయాన్ని ఖరునితో చెప్పింది.

"శూర్పణఖా! నీకు మేలు చేయాలని ఇప్పుడే కదా పద్నాలుగుమంది రక్తం త్రాగే రాక్షసుల్ని పంపాము. వాళ్ళకి నేనంటే ప్రాణం. వారు చంపేవారేగాని చచ్చేవారు కారు. నా ఆజ్ఞను శిరసావహిస్తారు.



"నీవేమో మళ్ళీ వచ్చి "అయ్యో-గుయ్యో" అంటూ ఏడుస్తున్నావు. భూమిపై బడి భుజంగము లాగా దొర్లుతున్నావు. నిన్ను రక్షించడానికి నేనుండగా దిక్కులేని దానివలె ఏడుస్తావెందుకు? లే! భయపడకు," అన్నాడు ఖరుడు.

"సోదరా! నాకు జరిగిన అన్యాయాన్ని చూచి నీవు నన్ను ఓదార్చావు. పద్నాలుగుమంది రాక్షసుల్నీ పంపావు; వారంతా రాముని చేతిలో హతులయ్యారు. ఇదంతా క్షణంలో జరిగి పోయింది;" అన్నది శూర్పణఖ.

రాముడు రాక్షసుల్ని వధించేందుకు బయలుదేరే ముందు సీతను రక్షిస్తూ వుండమని లక్ష్మణునకు చెప్పి, వారిని క్షణంలో వధించి వస్తాను అని పలికాడు. రాముడు రాక్షసుల్ని క్షణంలో వధించినట్లు ఇక్కడ శూర్పణఖ కూడా ఖరునితో చెప్తూవుంది. రాముని మాటకు, రాముని బాణానికి తిరుగు లేదు.

"ఖరుడా! నేను భయపడుతున్నాను. దిగులుచెంది యున్నాను. విషాదమనే భయంకర మొసళ్ళు, భయమనే కల్లోల కెరటాలతో నిండిన శోక సముద్రంలో మునిగిపోతున్నాను. నన్ను రక్షించు. నా మీద నీకు దయ ఉంటే ముందు రాముణ్ణి వధించు. రాముణ్ణి నీవు చంపకపోతే నేను నీ ముందే చస్తాను. నిన్ను పిరికివానిగా భావిస్తాను.

"ఖరుడా! గొప్ప శూరునివలె మాట్లాడుతావు. నీవు శూరుడివా? విక్రమశాలివా! పరాక్రమశాలివా! రాముణ్ణి చంపలేని చవటవు జనస్థానంలో జీవించడ మెందుకు దిష్టిబొమ్మ లాగా! జనస్థానాన్ని విడిచిపెట్టిపో. మహావీరులైన రామలక్ష్మణుల ముందు నీ వెక్కడ నిలుస్తావు," అంటూ ఏడుస్తూ ఖరుని రెచ్చగొట్టింది శూర్పణఖ.

"శూర్పణఖా! నీకు జరిగిన అవమానము వలన నాలో విజృంభించిన క్రోధము ఉప్పెన లాగా భరింప శక్యం గాకుండా ఉంది. అల్పాయుష్కుడైన మానవుడు రాముడెక్కడ? నేనెక్కడ? అతని పాపం పండింది. నా చేతిలో హతుడయ్యే క్షణం దగ్గరైంది. ఏడవకు. రాముణ్ణి, అతని తమ్ముణ్ణి ఇప్పుడే యమసదనానికి సాగనంపుతాను. నా గండ్రగొడ్డలితో ఆ రాముణ్ణి నరికేస్తాను. గోరువెచ్చగా వున్న అతని రక్తాన్ని నీవు త్రాగుదువు గానీ!" అని పలకగానే సంతోషపడిన శూర్పణఖ వెంటనే ఖరుని గొప్ప వీరుడుగా పొగిడింది.

## ఖరుని రంగప్రవేశం

ఖరుడు తన సేనాధిపతి యైన దూషణుని పిలిచి తన పద్నాలుగువేల మంది సైనికులను యుద్ధానికి సిద్ధం చేయమని చెప్పాడు. తన రథాన్ని కూడా సిద్ధం చేయమన్నాడు. దూషణుడు క్షణంలో సైన్యాన్ని సిద్ధం చేశాడు.

బంగారు చక్రములతో మేరుపర్వత శిఖరము లాగా మెరసిపోతున్న రథాన్ని ఖరుడు అధిరోహించాడు. సైన్యమంతా దూషణుని చుట్టూ నిలబడ్డారు. గొప్ప ధనుస్సును, భయంకర మైన ఆయుధములను ధరించిన ఖరుడు "ఊఁ చూస్తారేం? బయలుదేరండి" అని గర్జించాడు. రాక్షస సైన్యము జనస్థానము నుండి బయలుదేరింది.

మార్గంలో ఖరునకు అనేకమైన దుశ్శకునాలు ఎదురయ్యాయి. అయినా ఖరుడు వాటిని లెక్కపెట్టకుండా ముందుకు సాగిపోయాడు. ఖరుని వెంట సేనాధిపతి యైన దూషణునితో పాటు మహాకాపాలి, స్థూలాక్షుడు, ప్రమాథి, త్రిశిరస్సు అను నల్గురు సేనా నాయకులు కూడా నడిచారు. ఖరుని సైన్యము పంచవటిని చేరింది.

రాముడు రాక్షససేనను చూశాడు. "లక్ష్మణా! గొప్ప యుద్ధము జరుగబోతున్నది. రాక్షసులకు వినాశము తప్పదు. ఈ క్షణాన గోచరించే ఉత్పాతములు మనకు ఉపయోగకరంగా తెలుస్తున్నాయి. దట్టమైన వృక్షములచే కప్పబడి యున్న పర్వత గుహలోకి సీతను తీసికొనిపో.

"లక్ష్మణా! "నేనే రాక్షసుల్ని సంహరిస్తాను" అని చెప్పకు. నా పాదాలపై ఒట్టుపెట్టి చెబుతున్నాను. ఆలస్యము చేయకుండా వెంటనే వెళ్ళు. లక్ష్మణా! నీవు గొప్ప వీరుడవు. ఈ రాక్షసుల్ని క్షణంలో వధించగలవు. కానీ వీరిని నేను చంపాలని కుతూహలపడుతున్నాను;" అని పలికాడు రాముడు.

రాముడు చెప్పినట్లుగా సీతమ్మను వెంటబెట్టుకొని పర్వతగుహలో ప్రవేశించాడు లక్ష్మణుడు. రాముడు కవచాన్ని ధరించాడు. ధనుర్బాణాలు చేతబట్టుకొని నిలబడ్డాడు. ఈ భయంకర సమరాన్ని తిలకించడానికి దేవ గంధర్వ సిద్ధ చారణాదులు కలిసివచ్చి గగనాన నిలిచారు.

ఖరుని సైనికులు భయంకరమైన శబ్దాలు చేశారు. రాముడు ప్రళయకాలాగ్ని వలె నిలబడి ఖరుని సైన్యాన్ని వీక్షించాడు. రాముడొక్కడు-రాక్షసులు పద్నాలుగు వేలమంది, అనుకొంటూ ఆశ్చర్యంగా వీక్షిస్తున్నారు పైనుండి దేవతలు.

ధనుస్సును నేలపై నిలబెట్టి ప్రళయకాల రుద్రునివలె క్రుద్ధుడై యున్న రాముని ఖరుడు చూశాడు. రాముని వద్దకు రథాన్ని నడిపించమని సారథికి చెప్పాడు. సారథి ఖరుని రథాన్ని రాముని ముందు నిలిపాడు.

ఖరుడు రామునిపై భయంకరంగా శరవృష్టిని కురిపించాడు. రాక్షసులు కూడా రామునిపై శస్త్రములను ధారగా ప్రయోగించారు. వర్షించు మేఘము పర్వతముపై జలధారలు కురిపించునట్లు ఖరుని సైన్యము రామునిపై శూలములు, ఖడ్గములు, గండ్రగొడ్డళ్ళు మొదలైన ఆయుధాలను ప్రయోగించారు.

ఆ రాక్షసులు ప్రయోగించు ఆయుధాలను తన బాణాలతో ఎదుర్కొని, నదీ జలాల్ని సాగరుడు స్వీకరించునట్లు, రాక్షసుల ఆయుధాలను శ్రమ లేకుండా రాముడు స్వీకరించాడు. వజ్రఘాతములకు పర్వతము చలించనట్లు ధీరుడై స్థిరుడై నిలబడ్డాడు రాముడు.

రాక్షసులు ప్రయోగించిన ఆయుధములు రామునికి తగిలినా రాముడు చలించలేదు. రాముని అవయవముల నుండి రక్తము స్రవించడం జరిగింది. ఆ సమయంలో సంధ్యాకాలంలో మేఘములచే ఆవరింపబడిన సూర్యుని లాగా రాముడు శోభించాడు.

ఏకాకిగా నిలబడి పోరాడుతున్న రాముని వేలమంది రాక్షసులు చుట్టూ చేరి బాధించడం చూసి దేవతలు, మహర్షులు విషాదంతో కుమిలిపోయారు.



రాముడు మిక్కిలి క్రుద్ధుడయ్యాడు. ధనుస్సును మండలాకారంగా నిలిపి రాక్షసులపై వేలాది బాణాలను ప్రయోగించాడు. రామబాణాలు యమపాశాల వలె రాక్షసుల్ని వధించాయి.

రాముడు సంధించిన భయంకర బాణాలకు వేలకొలది ధనుస్సులు, ధ్వజాగ్రములు, కవచాలు, శిరస్సులు, అలంకరింపబడిన బాహువులు తెగి పడ్డాయి. రథాలు, అశ్వాలు, సారథులు, గజాలు, కాలిబంట్లు కళ్ళముందే కూలిపోయారు.

భయంకరులు, బలశాలురు అయిన కొందరు రాక్షసులు రామునిపై దారుణమైన అస్త్ర శస్త్రాలను ప్రయోగించారు. రాముడు వాటి నన్నిటిని ఖండించుటయే గాక, వారి శిరములను కూడా ఖండించాడు. గాలికి కూలిపోయిన వృక్షాల్లాగా వారు నేలమీద పడ్డారు.

కొందరు రాక్షసులు, రాముడు కొట్టిన శరఘాతములను భరించలేక ఏడుస్తూ, రక్షింపుమని, వేడుకుంటూ ఖరుని చుట్టూ చేరారు. సేనాపతియైన దూషణుడు వారిని ఓదార్చాడు. వాళ్ళందరిని తన వెంటబెట్టుకొని యముడు రుద్రుని మీదికి వెళ్ళినట్లు దూషణుడు రాముని మీదికి వెళ్ళాడు.

ఈసారి రాక్షసులందరు రామునిపై బాణవర్షమును, ఆయుధవర్షమును, శిలావర్షమును కురిపించారు. రామరాక్షసుల మధ్య జరిగిన ఆ యుద్ధము చూచువారికి రోమాంచమును కల్గించింది.

రాక్షసులందరూ రాముని చుట్టూ నిలబడి దిక్కులన్నీ కప్పివేశారు. అది చూచిన రాముడు సింహనాదం చేసి మిక్కిలి తేజోవంతమైన గాంధర్వాస్త్రమును వారిపై ప్రయోగించాడు. అంతే. వేలకొలది బాణాలు రాముని ధనుస్సు నుండి బయలుదేరాయి. ప్రయోగింపబడిన ఆ శరసమూహము వలన దిక్కులు చీకట్లు ముసిరినట్లు అయ్యాయి. హతులౌతున్న రాక్షసులచే భూమి అంతా కప్పబడింది. రణరంగము భయంకరంగా గోచరించింది.

భీకరుడైన సేనాపతి యగు దూషణుడు భయంకరమైన పరిఘను తీసికొని రాముని మీదికి వెళ్ళాడు. దూషణుని రెండు భుజాలను రాముడు బాణంతో ఛేదించాడు. దంతములు విరిగిపోయిన ఏనుగు లాగా దూషణుడు నేలపై పడ్డాడు.

అది చూచి నలుగురు సేనానాయకులు రాముని చుట్టుముట్టారు. రాముడు మహాకపాలుని మస్తకాన్ని త్రుంచేశాడు. ప్రమాథిని వధించాడు. తీక్ష్ణములైన శరములను ప్రయోగించి స్థూలాక్షుని, సైన్యముతో పాటు సేనాపతియగు దూషణుని రాముడు వధించాడు.

వాసనా స్వరూపమైన శూర్పణఖ కామం గాను, శూర్పణఖ సోదరుడైన ఖరుడు క్రోధం గాను గ్రహించాము. క్రోధ స్వరూపుడైన ఖరునకు దూషణుడు సేనాపతి. క్రోధము సాగించే సమరంలో ప్రధాన సేనానాయకుడు దూషణుడు. కోపము వచ్చినవారు ఎవరైనా ముందుగా చేయు కార్యము దూషణమే కదా! క్రోధానికి నిందించడమే ప్రథమ కర్తవ్యం. ప్రధాన కర్తవ్యం. అందుచేత ఖరుని సేనలో ప్రధానుడు దూషణుడు.

ఖరుడు వధింపబడే ముందు దూషణుడు వధింప బడుతాడు. క్రోధం అణగే ముందు పరుషవాక్కులు నిరోధింప బడుతాయి. కనుకనే రాముడు ముందుగా దూషణుని వధించాడు.

**'పైశున్యం పరదూషణమ్'** పరులను దూషించుటయే నీచత్వమని మహాభారతము ప్రవచించింది. నీచమైన దూషణమునకు కారణమైన క్రోధము నీచాతి నీచమని అర్థము.

దూషణుడు మరణించగానే క్రుద్ధుడైన ఖరుడు రాక్షసనాయకులను రాముని పైకి పురిగొల్పి తాను కూడా రాముని వైపు పరుగెత్తాడు. రాక్షసనాయకుల ఆయుధాలను రాముడు సునాయాసంగా ఖండించాడు.

రాముడు రాక్షసులను వధించుట చేత వాళ్ళ రక్తమాంసాలనే బురదతో నిండిన ఆ వనము నరకము వలె భయంకరంగా కన్పించింది. ఏ వాహనమూ లేక నేలమీదనే నిలబడి యుద్ధము చేసిన రాముడు పద్నాలుగువేల మంది రాక్షసులను వధించాడు. ఖరుడు, త్రిశిరస్సు అనే వారిద్దరే మిగిలారు.

ఖరుడు రథారూఢు డయ్యాడు. వజ్రాయుధమును ధరించిన ఇంద్రునివలె రాముని మీదికి వెళ్ళాడు. అలా వెళ్తున్న ఖరుని త్రిశిరస్సు అడ్డగించాడు.

"ప్రభూ! నాకు అనుజ్ఞ నిమ్ము. నీవు సమరోత్సాహమును విడిచిపెట్టు. మన సైన్యాన్ని సంహరించిన రాముని వధించే అవకాశాన్ని నాకివ్వు. రణరంగములో రాముని చేతిలో నేను మరణిస్తానో, లేదా నా చేతిలో రాముడు మరణిస్తాడో నీవే చూడ్దువుగానీ!

"దొరా! నామాట విను! నేను రాముణ్ణి వధిస్తే నీవు సంతోషంతో తిరిగి జనస్థానమునకు వెళ్ళవచ్చు. నేను మరణించానా, అప్పుడు నీవు రాముని మీదికి యుద్ధానికి వెళ్ళవచ్చు. ఈ ఒక్క అవకాశాన్ని నాకు ప్రసాదించు" అని త్రిశిరస్సు మృత్యువును కోరి వరించాడు. తానే యముడైనట్లు ఖరుడు అంగీకరించాడు.

త్రిశిరస్సు రథము నెక్కాడు. మూడు శిఖరాలున్న పర్వతం లాగా రాముని మీదికి వెళ్ళాడు. పెద్ద మేఘం లాగా కదలివస్తూ, మేఘం జలధారల్ని వర్షించునట్లు బాణములను రామునిపై ప్రయోగించాడు.

మదగజము వలె మీదికి వస్తున్న త్రిశిరస్సుని రాముడు సింహం వలె ఎదుర్కొన్నాడు. సారథిని, రథమును కూల్చేశాడు. త్రిశిరస్సు హృదయాన్ని బ్రద్దలు చేశాడు. వాడియైన మూడు బాణాలను ప్రయోగించి రాముడు త్రిశిరస్సుని మూడు తలలను ఖండించాడు. త్రిశిరస్సు నేలమీద పడి మరణించాడు.

త్రిశిరుడు కాలస్వరూపము. భూతభవిష్య ద్వర్తమానములు అనే త్రికాలములే త్రిశిరుడు. కాలములో గోచరించే దంతా అనిత్యమే. ఈ కాలరూప సుడిగుండం నుండి బయటపడుటయే త్రిశిరుని సంహరించుటలోని అంతర్భావము.

కాలము మనస్సుయొక్క కల్పనయే. కాలాన్ని అధిగమించగనే మనసును జయించగలం. మనోజనితమైన కామక్రోధాలను మట్టుపెట్టగలం. రాముడు త్రిశిరుని వధించాడు. మనము కాలాన్ని అధిగమించాలి. జయించాలి.

దూషణుడు, త్రిశిరుడు హతులు కాగానే ఖరునకు ఆంతర్యంలో భయాందోళనలు కలిగాయి. ఖరుడు రామునిపై అనేక సర్పరూప బాణాలను ప్రయోగించాడు. చాలా అస్త్రాలను ప్రయోగించాడు.



రాముడు తన ధనుస్సును ఎక్కుపెట్టాడు. రాముడు ప్రయోగించిన బాణ సముదాయము ఆకాశమంతా ఆవరించింది. సూర్యుని ప్రకాశము గోచరించనంత దట్టంగా బాణాలు ఆకాశంలో పరుగిడుతున్నాయి.

రాముడు, ఖరుడు పరస్పరం భయంకరంగా పోరాడారు. ఖరుడు దారుణమైన అస్త్రములను రామునిపై ప్రయోగించాడు. రాముని కవచము నేలపై పడింది. వెంటనే రామునిపై అనేక బాణములను సంధించి, ఖరుడు పెద్దగా అరచాడు.

అగస్త్యమహర్షి ప్రసాదించిన వైష్ణవధనుస్సును చేబూని ఖరుణ్ణి ఎదిరించుటకు శీఘ్రంగా ముందుకు వెళ్ళాడు రాముడు. మొదట ఖరుని ధ్వజాన్ని పడగొట్టాడు. తరువాత భయంకరమైన అస్త్రాలను ప్రయోగించి ఖరుని ధనుస్సును, రథాన్ని రాముడు భగ్నం చేశాడు. సారథిని వధించాడు. ఏమి చేయాలో తోచని ఖరుడు గదను ధరించి రథం పైనుండి క్రిందికి దూకాడు.

రాముడు ఖరునితో ఇలా పలికాడు.

"ఖరుడా! నీవు గొప్ప సైన్యమునకు అధిపతివైనా నిందార్హమైన కార్యాన్ని ఆచరించావు. ప్రాణులకు భయమును కల్గించు పాపకర్మలను ఆచరించువాడు త్రిలోకాధిపతి అయినా చాలాకాలము సుఖంగా జీవించలేడు. లోకవిరుద్ధమైన పాపాల్ని చేసేవాడ్ని ప్రజలు క్రూర సర్పాన్ని వధించినట్లు వధిస్తారు.

"రాక్షసా! దండకారణ్యంలో తపస్సు చేసుకొనే మునులు నీకు ఏమి అపకారం చేశారు?" పాపాత్ములకు సంపదలు లభించినా మొదలు చీకిపోయిన వృక్షాల్లాగా త్వరలోనే నశిస్తారు.

**అవశ్యం లభతే జన్తుః ఫలం పాపస్య కర్మణః**
**ఘోరం పర్యాగతే కాలే ద్రుమాః పుష్ప మివార్తవమ్ ॥**

"అనుకూలమైన ఋతుకాలం వచ్చినపుడు పుష్పా లెలా పుష్పిస్తాయో, అలాగే ప్రతి వాడూ తాను చేసిన పాపకర్మలకు సమయం వచ్చినపుడు ఫలితాలను పొందుతాడు.

"విషం కలిపిన ఆహారాన్ని భుజించినచో ఆ ఫలమును వెంటనే అనుభవించునట్లు, లోకంలో ప్రాణులు తాము ఆచరించే దుష్టకర్మల ఫలితాన్ని అనుభవించవలసి ఉంటుంది.

"పాపాత్ములను నశింపచేయుటకు ఋషులు నన్ను చేరారు. ఇపుడు నేను ప్రయోగించ బోయే బాణాలు పాములు పుట్టను చీల్చుకొని బయటపడునట్లు, నిన్ను చీల్చుకొని బయటకు వెళ్తాయి.

"గతంలో ఈ దండకారణ్యంలో ఏ మహర్షులను నీవు, నీ అనుచరులు వధించారో ఆ మునులను వెతుక్కుంటూ నీవు కొన్ని క్షణాల్లో ఇక్కడనుండి బయలుదేరి వెళ్తావు. నీవు నరకంలో మ్రగ్గుతూ, కుములుతూ ఉంటే నీచేత వధింపబడిన మునులు విమానారూఢులై నిన్ను వీక్షిస్తూ ఉంటారు.

"ఓరీ రాక్షసాధమా! నీ పరాక్రమ మేమిటో చూపించు. నీ ఇష్టం వచ్చినట్లు నన్ను కొట్టు చూద్దాం. నీ తలను తాటిపండులాగా క్రిందపడేస్తాను;" అని భయంకరంగా పలికాడు రాముడు.

రాముని మాటలు విన్న ఖరుడు క్రుద్ధుడై, క్రోధావేశంతో భయంకరంగా నవ్వి రామునితో ఇలా పలికాడు.

"రామా! యుద్ధములో సామాన్యులైన రాక్షసులను చంపావు. దానికే పొంగిపోతూ గొప్ప వీరుడనైనట్లు ఆటోపాన్ని ప్రదర్శిస్తున్నావు. సిగ్గు విడిచి నిన్ను నీవే పొగుడు కొంటున్నావు.

"పరాక్రమవంతులు తమను తాము పొగడుకోవడం ఇప్పుడే, ఇక్కడే చూస్తున్నాను. వినయము లేని అధములైన రాజులు మాత్రమే అలా తమను తాము ప్రశంసించుకుంటారు.

"రామా! దర్భను కాల్చితే అది బంగారంలా కన్పించినా ఎలా నిరుపయోగమో, నీవు ప్రగల్భాలు పల్కినా నీ అల్పత్వం తెలుస్తూనే వుంది. గదాధరుడై నిలబడియున్న నన్ను చూస్తున్నావు కదూ! పాశమును ధరించిన యముడు ప్రాణములను ఎంత తేలికగా హరిస్తాడో, గదను ధరించిన నేను ప్రాణాల్ని అంత సులభంగా పీల్చేస్తాను. నీకు చాలా చెప్పాలనిపిస్తోంది. అయినా నేను చెప్పను. సూర్యుడు అస్తమించే కాలం దగ్గరపడుతోంది. ఈలోగానే నిన్ను కూల్చేయాలి.

"వేలమంది రాక్షసుల్ని వధించావు కదూ! నిన్ను చంపి, నీ రక్తంతో వారికి తర్పణ మిస్తాను;" అని పలికి వజ్రాయుధం వలె మెరిసిపోతున్న గదను రాముని పైకి విసిరాడు. రాముడు దానిని ఆకాశంలోనే ముక్కలుగా ఖండించాడు. ఖరుడు నివ్వెరపోయాడు. నిశ్చేష్టుడై నిలబడియున్న ఖరునితో రాముడు ఇలా పలికాడు.

"ఓరీ రాక్షసాధమా! ఏమైందిరా నీ బలము? ఎవరిదిరా ప్రగల్భం? ఇప్పుడు చెప్పు. మరణించిన నీ అనుచరులైన రాక్షసులకు ఏమిచేసి పెడతావు? నీచుడా! దుష్టుడా! గరుత్మంతుడు అమృతాన్ని హరించునట్లు నీ ప్రాణాల్ని తోడేస్తాను.

"నా శరము కదిలిందా!, నీ శిరము ఒరిగిందే - జాగ్రత్త. నీ రక్తంతో భూమికి అభిషేకం చేస్తాను. శరీరమంతా దుమ్ము కొట్టుకొని, చేతులు రెండూ జారేసి, భూమిని కౌగిలించుకొని శాశ్వతంగా నిద్రపోతావు. అంతటితో ఈ దండకారణ్యానికి పీడ విరగడై పోతుంది. తాపసులైన మునులు తాపరహితులై శాంతిని పొందుతారు. నిర్భయంగా జీవిస్తారు;" అన్నాడు రాముడు.

"ఓరీ రామా! అహంకారీ! భయపడాల్సిన సమయంలో కూడా నీవు నిర్భయంగా వాగుతున్నావు. మృత్యుముఖంలో ప్రవేశిస్తున్నావు కనుక మతి చెడి మాట్లాడుతున్నావు. కాలపాశము చుట్టినపుడు ఏమి మాట్లాడుతారో వారికే తెలియదు;" అని భీకరంగా మాట్లాడి, ఆయుధం కొరకు అటూ ఇటూ చూసి, చివరగా పెద్ద సాలవృక్షాన్ని పెకలించి, "చచ్చావురా" అంటూ దానిని రామునిపై విసిరాడు ఖరుడు.

రాముడు బాణప్రయోగంతో ఆ సాలవృక్షాన్ని ముక్కలుగా ఖండించాడు. అంతే. ఇక నిరీక్షించ కూడదని భావించిన రాముడు బాణాన్ని సంధించి ఖరుని దేహాన్ని బ్రద్దలుగా కొట్టి చీల్చేశాడు.

ప్రస్రవణ పర్వతము నుండి జలధార స్రవించునట్లు ఖరుని దేహము నుండి రక్తధార ప్రవించింది. ఖరుడు చివరి శ్వాసను వదిలాడు.



దేవతలు, మహర్షులు రామునిపై పుష్పవృష్టిని కురిపించారు. రాముణ్ణి శ్లాఘిస్తూ ఇలా పలికారు.

"రామా! ఈ పుణ్యకార్యాన్ని వాంఛించే దేవేంద్రుడు శరభంగాశ్రమానికి వచ్చాడు. ఈ కార్యము కొరకే మునులందరూ నిన్నాశ్రయించి ఈ దండకారణ్యంలో వసించమని కోరారు. ఇక మునులందరూ హాయిగా జీవించగలరు;" అని పలికి దేవగణము, ఋషిగణము వెళ్ళిపోయారు.

లక్ష్మణుడు పర్వతగుహ నుండి సీతమ్మను వెంటబెట్టుకొని సంతోషంతో వచ్చాడు. మహర్షులు, లక్ష్మణుడు రాముని అభినందిస్తూ స్తుతించారు. ఆనందాన్ని ఆపుకోలేక సీతమ్మ బాష్పములను నేత్రాలలో నింపుకొని రాముని కౌగిలించుకొనింది. మళ్ళీ మళ్ళీ కౌగిలించుకొని ఆనందించింది.

**'ఖర దూషణ ముఖ సూదక రాం'**

"ఖరదూషణాది రాక్షసులను సంహరించిన రామా! నీకు జయము" అని నారదుడు రామవైభవాన్ని గానం చేశాడు.

**ఎవరిచ్చిరి రా శరచాపములు నీ కినుకులాబ్ధి చంద్ర ॥ఎవ॥**
**అవతరించువేళ నుండెనో లేక అవని కేగి యార్జించితివో ॥ఎవ॥**
**ఒకటేసిన పది నూరై వెయ్యై**
**చకపకలాడి శత్రుల నణచేనటా ॥ ॥ఎవ॥**

ఖరదూషణాది రాక్షసులను వధించునపుడు రాముడు ఒక బాణాన్ని వదిల్తే అది పదులు, నూర్లు, వేలుగా మారి పద్నాలుగు వేలమంది రాక్షసుల్ని సంహరించింది. అట్టి శరచాపములు రామా! నీకు ఎక్కడివి? ఎవరిచ్చారు? నీవు జన్మించినపుడే నీతో కూడా తెచ్చుకున్నావా? లేక భువిలో సాధించుకున్నావా? అని త్యాగరాజస్వామి ఖరదూషణ సంహారమును గుర్తుచేసుకుంటూ శ్రీరాముని శరచాపముల వైభవమును కీర్తించారు.

## ఇతడే

**ఇం**తులను **త**న్నుకుపోయే **డే**గ.

అది లంకానగరము. రావణుడు పాలించే పట్టణము. ఇంతులకై తహతహలాడే రావణడేగ నివసించే గూడు.

సువర్ణసింహాసనంపై సూర్యబింబంలా వెలిగిపోతూ ఆసీనుడై ఉన్నాడు రావణాసురుడు. బంగారు హోమగుండం నుండి ప్రజ్వలించిన అగ్నివలె ప్రకాశిస్తున్నాడు.

రావణుడు అజేయుడు. సంగ్రామంలో సురులు కూడా అతని ఎదుట నిలువలేరు. అసమాన పరాక్రమవంతుడు. కబళించడానికి సిద్ధంగాయున్న యమునిలా కనిపిస్తాడు. విశాల వక్షస్థలము గల ఆ రావణుడు పది తలలతో, ఇరవై చేతులతో భయంకరంగా ఉంటాడు. పర్వతమా! అన్నట్లుంటాడు.

ఎంతటి కార్యాన్నైనా శీఘ్రంగా సాధిస్తాడు. పర్వతాల్ని పెకలించి విసిరివేయగల శక్తి సంపన్నుడు. దేవతల్ని జయించగలడు. అధర్మపరుడు. పరభార్యాగమనుడు.

అస్త్రశస్త్రముల యందు ఆరితేరినవాడు. యజ్ఞ వినాశకుడు. భోగవతీ నగరంపై దండెత్తి వాసుకిని ఓడించి, తక్షకుని ప్రియభార్యను బలవంతంగా అపహరించాడు. కైలాసం వెళ్ళి, కుబేరుని జయించి, పుష్పకవిమానాన్ని అపహరించాడు.

శత్రుసంహారకుడైన రావణుడు సూర్యచంద్రుల గమనాన్ని నిరోధించగలడు. పూర్వము ఘోరారణ్యంలో పదివేల సంవత్సరాలు తపస్సు చేసి, తన పది తలలను బ్రహ్మదేవునికి సమర్పించాడు. బ్రహ్మదేవుని నుండి వరాలు పొందాడు. దేవ,దానవ,గంధర్వ,పిశాచ, సర్ప, పక్ష్యాదుల నుండి మరణం లేకుండా అభయాన్ని పొందాడు. మానవుల పేరును చేర్చడం హీనంగా భావించాడు. అందుచేత అభయాన్ని అర్థించునపుడు మానవులను ఉదహరించలేదు.

అనేక బ్రహ్మహత్యలు చేశాడు. పూర్ణాహుతి సమయంలో యజ్ఞాలను ధ్వంసం చేశాడు. దుష్టుడు. జాలి లేనివాడు. గాలి లాగా చంచల మైనవాడు. ఒక్కమాటలో చెప్పాలంటే, చాలా గొప్పవాడు. కానీ మంచివాడు కాడు.

ఖరదూషణాదుల మరణంతో భీతిచెందిన శూర్పణఖ రావణాసురుని వద్దకు వచ్చి ఇలా మాట్లాడింది.

"రావణా! అహంకారివి, కామాంధుడవు అయిన నీవు కామోపభోగములను నిరంకుశంగా అనుభవిస్తున్నావే గాని నిన్ను వెన్నంటి వచ్చే ఆపదను గుర్తించలేకున్నావు.

"స్వేచ్ఛావర్తియై, దురాశాపరుడై, తుచ్ఛమైన భోగాలయందు ఆసక్తి గల రాజును ప్రజలు శ్మశానంలో అగ్ని లాగా చూస్తారు. సమయసందర్భాలు గమనించి ప్రవర్తించని రాజు తాను నశించడమే గాక రాజ్యాన్ని కూడా నశింపచేస్తాడు.

"ప్రజల మాటలు పట్టించుకోకుండా, గూఢచారుల ద్వారా విషయాలను సేకరించకుండా స్వేచ్ఛగా విహరించే ప్రభువును, నదిలోని బురదను దూరం నుండే ఏనుగులు త్యజించునట్లు, త్యజిస్తారు.

"స్త్రీ వ్యామోహంలో పడి తమను తాము నిగ్రహించుకోలేని రాజులు సాగరగర్భంలోని పర్వతాల వలె అభివృద్ధిని పొందలేరు.

"రావణా! బుద్ధిమంతులైన దేవ గంధర్వాదులతో నీవు శత్రుత్వాన్ని పెంచుకున్నావు. అలాంటప్పుడు దూతల ద్వారా విషయసేకరణ చేయాలనే బుద్ధి ఉండాలా? లేదా! బుద్ధిలేని నీవు రాజెలా అవుతావు?

"దూరంగా వుండే విషయాలను దూతల ద్వారా తెలుసుకుంటారు గనుకనే రాజులను దూరదృష్టి గలవారుగా గుర్తించారు. అది చేయని రాజు దూరదృష్టి కలవాడు కాదుగదా, ప్రజల పాలిటి దురదృష్ట మని చెప్పుకోవాలి.

"దూతలు లేకుండా నీవు రాజ్యాన్ని ఎలా పాలిస్తావు? ఈ విషయాన్ని కూడా తెలియని సామాన్యులు నీ వద్ద మంత్రులుగా ఉన్నారు. వారు నీకు మంత్రులుగా ఉండడం నీ దురదృష్ట మయితే, నీవు రాజుగా ఉండటం లంకావాసుల దురదృష్టం.



"జనస్థానంలో నీవారైన రాక్షసులు వేలాదిమంది మరణించినా నీకు తెలియలేదు. రాముని చేతిలో ఖరదూషణాదులు చచ్చింది కూడా నీకు తెలియదు. జనస్థానం చిత్తు చిత్తైపోయింది. ఋషులందరూ మత్తెక్కి ఆర్భాటాలు పలుకుతున్నారు. వేదఘోషలు విసర్జించి ప్రగల్భాలు పలుకుతున్నారు.

"రావణా! నీవు మదించి యున్నావు. నీ కొచ్చిన ముప్పును తెలుసుకో. కోపిష్టి, అల్పంగా ఇచ్చేవాడు, ఏమరిపాటు గలవాడు, అహంకారి, శఠుడు అయిన రాజుకు ఆపద లొచ్చినపుడు ఎవ్వరూ అతనిని ఆదుకోరు సరిగదా, ఇదే అదనుకొని చంపినా చంపుతారు.

"భయపడవలసిన సమయాల్లో కూడా భయపడకుండా, చేయవలసిన కార్యాలు చేయని రాజు తృణతుల్యు డవుతాడు.

"రావణా! ఎండిన కర్రలు చచ్చినవాడ్ని తగలేయడానికి ఉపకరిస్తాయి. కుండపెంకులు పిండానికైనా పనికొస్తాయి. శవాన్ని కప్పి పెట్టడానికి మట్టైనా ఉపకరిస్తుంది. రాజ్యభ్రష్టుడైన రాజు మాత్రం దేనికీ కొరగాడని తెలుసుకో. చినిగిపోయిన వస్త్రాల్లాగా, నలిగిపోయిన పూలదండ ల్లాగా నిరుపయోగ మవుతాడని గుర్తుంచుకో.

"రావణా! ఇంద్రియనిగ్రహం కలిగి, కృతజ్ఞుడై, ధర్మస్వభావం గల రాజు స్థిరమైన కీర్తితో శోభిస్తాడు. అక్రోధుడై, ఏమరిపాటు లేక, కళ్ళుమూసి నిద్రిస్తున్నా ఎవడు ధర్మనేత్రముతో చూస్తూ వుంటాడో అట్టి రాజును సర్వులూ పూజిస్తారు.

"రావణా! దుష్టుడవైన నీలో ఈ శిష్టలక్షణాలు లేవు. బంధునాశాన్ని కూడా దూతల ద్వారా తెలుసుకోని నీవు నశిస్తావు. నీ రాజ్యము నశిస్తుంది. నీవు ఆపదల్లో చిక్కు కుంటావు;" అని నదీప్రవాహం లాగా ఆగకుండా మాట్లాడేసింది శూర్పణఖ.

ధనము, దర్పము, బలము గల రావణాసురుడు కొన్ని క్షణాలు మౌనం వహించాడు. శూర్పణఖ మాటల్ని తీక్ష్ణంగా ఆలోచించాడు. మంత్రుల ఎదుట శూర్పణఖ తనను అలా దూషించినందుకు క్రుద్ధు డయ్యాడు. శూర్పణఖను ఇలా ప్రశ్నించాడు.

## తొలి కూత

**క శ్చ రామః కథం వీర్యః కిం రూపః కిం పరాక్రమః**
**కి మర్థం దణ్డకారణ్యం ప్రవిష్టః సుదురాసదమ్ ॥**

"ఎవడు ఆ రాముడు? ఏపాటి బలవంతుడు? ఎలా ఉంటాడు? ఎట్టి పరాక్రమం కలవాడు? దుర్గమమైన దండకారణ్యం లోకి ఎందుకు ప్రవేశించాడు?"

కః? ఎవడు? అంటూ రావణుడు నోరు విప్పాడు. ఇది అహంకారి లక్షణము. రాక్షసుని ప్రలాపము. "నన్ను మించినవా డెవడు? నాకన్నా గొప్పవా డెవడు? నాకన్నా శక్తి గలవా డెవడు? నాకన్నా బుద్ధిశాలి ఎవడు? నాకన్నా అందమైనవా డెవడు? నాకన్నా పరాక్రమవంతు డెవరు? నాకన్నా ధనికు డెవరు? నాకన్నా కీర్తిమంతు డెవడు?"

ఈ ప్రశ్నలతో విర్రవీగే వారందరికీ ప్రతినిధి, నాయకుడు రావణుడు.

**కిమర్థం?** ఎందుకు? దేనికొరకు? దేనికి? అంటూ రావణుడు రెండవసారి నోరు తెరిచాడు.

తనకు మించిన వారుండకూడదు. తనకు మించిన గొప్ప కార్యాలు ఎవరూ చేయకూడదు. ఒకవేళ ఎవరైనా చేస్తే - ఎందుకు చేయాలి? ఏ భావంతో చేశారు? ఏ దురుద్దేశ్యంతో చేశారు? ఏ దుష్టసంకల్పంతో చేశారు? ఎవరికి కీడు చేయాలని చేశారు?

తనకన్నా అధికుల్ని చూచినపుడు ఎవడు? అని ప్రశ్నించడం, తనకన్నా గొప్పపనిని ఎవరైనా చేసినపుడు ఎందుకు? దేనికి? అని అభియోగాలు మోపడం కరుడుగట్టిన అహంకారి స్వభావము. అసంస్కారి లక్షణము. ఈ ప్రశ్నలే పతనానికి దారితీస్తాయి.

మరొక విచిత్రం. సంస్కారుల్లో, నిరహంకారుల్లో కూడా ఈ ప్రశ్నలే మొదట కదుల్తాయి. కానీ వాటి భావాలు వేరుగా ఉంటాయి. అహంకారుల నుండి కదలినపుడు ఈ ప్రశ్నలు పతనహేతువు లవుతాయి. సంస్కారుల నుండి, నిరహంకారుల నుండి కదలినపుడు ప్రగతికి సోపానా లవుతాయి.

**కః?** ఎవడు? ఈ సృష్టికి మూలకారణం బెవ్వడు? జన్మ కర్మలను నివారించువా డెవడు? రక్షకు డెవడు? నశించే ఈ దృశ్యప్రపంచం వెనుక ఆధారమైన అవినాశి ఎవడు? బంధములను నివారించువా డెవడు? మోక్షమును ప్రసాదించువా డెవడు? మతి తప్పి, గతి తెలియని మానవుణ్ణి పరమాత్మ కన్నా వేరుగా రక్షించేవాడు ఎవడు? ఇది సంస్కారుల ప్రశ్న. ఇకపోతే,

**కిమర్థం?** ఎందుకు? దేనికి? పరమాత్మను పొందలేని ఈ జన్మ ఎందుకు? దుఃఖాన్ని ప్రసాదించే విషయసుఖాలు దేనికి? ఎంత తిన్నా, ఎన్ని త్రాగినా ఒకనాడు గతించి వల్లకాటికి తరలించబడే ఈ దేహం దేనికొరకు? ఒక్కక్షణాన ప్రవేశించే మృత్యువుతో శూన్యంగా మారి పోయే ఈ బాంధవ్యాలు ఎందుకు? సంసారసాగరంలో మునిగిపోయే ఈ జన్మ దేనికి? చూశారా! ప్రశ్నల్లో ఏముంది? అంతా ప్రశ్నించే వాడిలోనే ఉంది.

ఈవిధంగా శూర్పణఖను రాముని గూర్చి ప్రశ్నించిన రావణుడు, ఖరదూషణాదులను రాముడు ఏ ఆయుధంతో వధించాడో కూడా చెప్పమన్నాడు.

శూర్పణఖ పాపపు మూటల్ని విప్పింది. పాపిష్టి మాటలు పలికింది.

"రాముడంటే ఎవడా? దశరథుని పెద్దకొడుకు. ఆజానుబాహుడు. అందమైన కన్నులు గలవాడు. నారబట్టలు కట్టుకొని, జింకచర్మాన్ని చుట్టుకొని ఉంటాడు. మన్మథునిలా మెరసి పోతుంటాడు.

"ఇంద్రుని ధనుస్సు వంటి ధనుస్సును ఎక్కుపెట్టి, విషనాగుల వంటి బాణాల్ని సంధిస్తాడు. ఎప్పుడు బాణం తీస్తాడో, ధనుస్సును ఎప్పుడు ఎక్కుపెడతాడో, బాణాన్ని ఎప్పుడు లాగుతాడో, నా మటుకు నాకు ఎప్పుడూ కనిపించలేదు.

"ఇంద్రుడు కురిపించిన వడగళ్ళ వానతో ధాన్యం నశించినట్లు, రాముడు ప్రయోగించిన బాణవృష్టికి రాక్షసులు చచ్చిపడి ఉండటం మాత్రమే నాకు కనిపించింది.



"ఖరుని సైన్యాన్నంతా ఒకటిన్నర ముహూర్తకాలం* లో కూల్చేశాడు. గొప్ప బుద్ధి కలవాడు కనుక నేను స్త్రీ నని భావించి చంపకుండా వదిలిపెట్టాడు.

"రామునికి ఒక తమ్ముడున్నాడు. పేరు లక్ష్మణుడు. పరాక్రమంలో రామునికి ఏ మాత్రమూ తీసిపోడు. నా ముక్కు చెవులు కోసింది వాడే. అది తరువాత చెబుతా.

"లక్ష్మణుడు గొప్ప తేజస్సు గలవాడు. సద్గుణ లక్ష్మణుడు. అన్నంటే వల్లమాలినంత ప్రేమ. కానీ కోపం ఎక్కువ. బుద్ధిమంతుడే. కానీ గడుసుతనం చాలా.

**రామస్య దక్షిణో బాహు ర్నిత్యం ప్రాణో బహిశ్చరః**

"రాముడికి కుడిభుజం లాంటివాడు. బహిఃప్రాణం లాంటివాడు.

"అసలు విషయాని కొస్తున్నా. రాముడికి భార్య కూడా ఉంది. పేరు సీత లే. ఇంతింత కళ్ళు. చందమామ లాంటి ముఖం. రాముడికి ఆవిడంటే ప్రాణం. ఆవిడేం తక్కువా! మొగుడుకోసం ప్రాణాలైనా ఇచ్చేస్తది.

"ఆ సీత, నీకు తెలిసే ఉండాలి, విదేహరాజని, ఆయన కూతురే. నల్లని జుట్టు; చక్కని ముక్కు, - ఇంతెందుకు, దండకారణ్యంలో ఆవిడ వనదేవతా! అన్నట్టుంది. రెండవ లక్ష్మీదేవా అనిపిస్తోంది.

"సోదరా! అబ్బ. ఆవిడ దేహం బంగారుముద్దలా ఉంటుంది. గోళ్ళెంత ఎర్రగా ఉంటాయో! నడుము లోభి దగ్గర డబ్బు లాగా అసలున్నట్లే ఉండదు. ఇదిగో చూశావ్, అంత అందమైన ఆడదాన్ని దేవతల్లోగాని, గంధర్వుల్లోగాని, యక్షుల్లోగాని, కిన్నరుల్లోగాని, మానవుల్లోగాని నేను మాత్రం ఇంతవరకు చూడలేదు. నీ విషయం నాకు తెలీదు.

"నాకు తోచింది చెబుతున్నా. సీతను భార్యగా పొందగలిగిన వాడు ముల్లోకాల్లో ఇక పొందాల్సింది ఉండదు. దేవేంద్ర పదవి అంటావా, దిష్టితీయడానికి పనికొస్తుంది.

"రావణా! సీత, నిజం చెప్పాలంటే నీకు తగిన భార్య. నీవు ఆవిడకి తగిన భర్త. మిమ్మల్నిద్దర్ని సతీపతులుగా చూడాలని నేను సతమత మయ్యాను. ఈ లోగా లక్ష్మణుడు నా ముక్కు చెవులు కోసేశాడు. కురూపిని చేసేశాడు.

"సీతను చూశావంటే నువ్వు ఏదో అయిపోతావు. ఆమెను భార్యగా పొందాలని ఉందా! ఇక ఆలస్యం చేయకు. ముందు కుడికాలు పెట్టు. అన్నా! ఆ రాముణ్ణి చంపేశావా, చచ్చిన మన వాళ్ళంతా హాయిగా నిద్రపోతారు.

"పోనీ ఇంకో పని చేస్తావా? రామలక్ష్మణుల్ని ఇద్దర్నీ చంపేయ్. ఇక నీకు అడ్డుండదు. మొగుడు పోయిన సీతకి నీవే మొగుడివి. చివరగా చెప్తున్నా! ఎలాగైనా సరే, అబల యైన సీతను బలాత్కారంగా తెచ్చేయి;" అని చెప్పదలచుకున్న విషయాన్నంతా విషం కలిపి వడ్డించేసింది.

రావణుని ఆలోచనలు కదిలాయి. శూర్పణఖ మాటలనే గాలులు తన హృదయ సరోవరంలో కోరికల కెరటాల్ని కదలించాయి. మంత్రులను వెళ్ళమని చెప్పాడు. తాను

* ముహూర్తకాల మంటె నలభై ఎనిమిది నిముషాలు

ఒంటరిగా అంతఃపురంలో ప్రవేశించి ముందూవెనుకలు, మంచిచెడులు ఆలోచించడం ప్రారంభించాడు.

శూర్పణఖ నిజస్వభావం చాలావరకు ఈ సందర్భంలో వ్యక్తమైంది. రాజధర్మాన్ని, రాజనీతిని ప్రబోధిస్తూ రావణుని నైతికంగా బలహీనుణ్ణి చేయడానికి ముందుగా ప్రయత్నించింది.

రాముని గూర్చి చెప్పేటప్పుడు రాముని సుగుణాల్ని చక్కగా వర్ణించింది. అలా చెప్పడం వల్ల తన మాటల్లోని నిజాయితీని నిలబెట్టుకోవాలని చూసింది. రాముని మీద ద్వేషంతో తాను చెప్పడం లేదన్నట్లు రావణుని దృష్టిని ఆకర్షించింది.

అంతేగాదు. రావణుణ్ణి నైతికంగా బలహీనం చేయడమే గాక అంతకు ముందే రావణుని స్వభావంలో తిష్టవేసి యున్న బలహీనతలపై స్వారి చేయాలని ప్రయత్నించి కృతార్థురాలయింది.

సీతయొక్క అంగాంగ సౌందర్యాన్ని వర్ణించి రావణుణ్ణి పిచ్చివాడ్ని చేసి కట్టి పారేసింది. ఒకవైపు సీత మీద వ్యామోహాన్ని పెంచుతూ, మరొకవైపు రావణుని మనసులో తనపై సానుభూతి నిండేలా మాట్లాడింది. సీతను రావణాసురునికి భార్యను చేయాలనే ప్రయత్నంలోనే తన ముక్కు చెవులను పోగొట్టుకున్నట్లు మొసలికన్నీళ్ళు కార్చింది.

గతించిపోయిన ఖరదూషణుల్ని, ఖరుని సైన్యాన్ని ప్రస్తావించి రావణునిలో విషాదాన్ని కల్పించింది. ఆలస్యం చేస్తే భవిష్యత్తులో రావణుని పరిస్థితి కూడా ఖరుని లాగే అవుతుందని భయాన్ని కూడా చొప్పించింది.

శూర్పణఖ ముందుగా సీతమ్మ సౌందర్యాన్ని ప్రస్తావించి, ఆ తరువాత తాను పోగొట్టుకున్న ముక్కు చెవుల విషయం వినిపించింది. ఎలాగైనా సీతకు అపకారం చేయాలి అనేదే శూర్పణఖ ధ్యేయం.

శూర్పణఖ ముక్కు చెవులను కోసినవాడు లక్ష్మణుడు. కోయమన్నవాడు రాముడు. వీరిలో ఎవరిమీద శూర్పణఖ ఆగ్రహించినా మనం అర్థం చేసుకోగలం. కానీ విచిత్ర మేమిటంటే, శూర్పణఖ పగలు, ద్వేషాలు సీత మీదికి పోతున్నాయే గాని రామలక్ష్మణుల మీదికి మాత్రం కాదు. స్త్రీకి మరొక స్త్రీపై ఉండే ఈర్ష్యాసూయలు శూర్పణఖలో బాగా గోచరిస్తాయి.

రావణుని వద్ద శూర్పణఖ ప్రస్తావించిన కేంద్ర విషయం సీతమ్మ సౌందర్యమే. మిగతా విషయాలన్నీ ఆషామాషీగా మాట్లాడినవే. తన ముక్కు చెవులను కోసిన విషయాన్ని ప్రస్తావించాలా? లేక సీతమ్మ సౌందర్యాన్ని వర్ణించాలా! ఈ రెండిటిలో ఏది రావణునిపై తీవ్ర ప్రభావాన్ని చూపి సీతమ్మను అపహరించేలా చేస్తుంది? అని ఆలోచించిన శూర్పణఖ తనను వికృతంగా మార్చారనే విషయాన్ని రెండవదిగా నిర్ణయించింది.

అలాంటి అన్నకు ఎలాంటి చెల్లెలో చూడండి. సోదరికి జరిగిన అవమానం కన్నా పరస్త్రీని అపహరించడానికే ప్రాధాన్యత నిస్తాడు అన్నగారు. తనకు జరిగిన అవమానాన్ని ప్రక్కకు నెట్టి, అందమైన స్త్రీని అనుభవించు అని సిగ్గు విడిచి అన్నతో చెప్పే చెల్లెలమ్మ. వీళ్ళిద్దరూ సర్వ జీవరాశికే కళంకం తెచ్చారు. అన్నాచెల్లెళ్ళ అనుబంధానికి మాయని మచ్చగా మిగిలిపోయారు.



రావణునికి కావలసింది సతి, స్తుతి. ఈ విషయాన్ని శూర్పణఖ చక్కగా అర్థం చేసుకున్నది. సీత నీకు సరియైన సతి అని పలికి మోహాన్ని కదిలించింది. సీతకు నీవే తగిన భర్తవు అని స్తుతించి ఉత్సాహాన్ని రేకెత్తించింది.

ఏదేదో చేసింది. ఏదో చేయాలని చూస్తోంది. రావణుడి మనస్సును దండకారణ్యానికి తరిమేసింది. ఇక రావణునిదే ఆలస్యం అన్నట్లు నాటకమంతా చక్కగా ఆడేసింది.

రావణునికి రాజనీతిని బోధించే సమయంలో శూర్పణఖ అనేక రాజనీతులను బోధించినట్లు తులసీదాస్ రచించాడు.

"రావణా! తింటూ, త్రాగుతూ రాత్రింబవళ్ళకు తేడా తెలియకుండా బ్రతుకుతున్నావు. శత్రువు నీ ద్వారం వద్ద నిలబడి యున్నాడని గ్రహింప లేకున్నావు.

**రాజు నీతి బిను ధనుబిను ధర్మా! హరిహి సమర్పే బినుసత్ కర్మా!**
**విద్యా బిను వివేక ఉపజాయేఁ! శ్రమఫలపఢే కియే అరు పాయేఁ!**
**సంగ్ తే జతీ కుమంత్ర తే రాజా! మాన్ తే జ్ఞాన్ పాన్ తే లాజా!**
**ప్రీతి ప్రనయ బిను మదతేఁ గునీ ! నా సహిఁ బేగి నీతి అతి సునీ!**

"రావణా! నీతి లేని రాజ్యము, ధర్మము లేని ధనము, భగవంతునికి అర్పించని సత్కర్మలు, వివేకము లేని విద్య- నిరుపయోగములు. నామావశిష్టములు.

"రావణా! సాంగత్యము వలన సాధువులు, కుమంత్రుల వలన రాజులు, అభిమానము వలన జ్ఞానము, మద్యపానము వలన సిగ్గు నశించునట్లు విని యున్నాను. అవినయముతో ప్రీతి, అహంకారముతో సుగుణాలు నశిస్తాయి.

**రిపు రుజ పావక్ పాపప్రభు అహి గనిఅ న ఛోట్ కరీ !**

"శత్రువు, రోగము, నిప్పు, పాపము, ప్రభువు, సర్పము - వీటిని తక్కువగా భావించకూడదు." అని రావణునితో పలికి రాముని నిరసింప వద్దని రెచ్చగొట్టింది శూర్పణఖ.

వస్తుందనుకున్న రాజ్యాన్ని రానీకుండా చేసింది మంథర. ఉన్నదనుకున్న సీతను లేకుండా చేస్తోంది శూర్పణఖ. ఎవరి మనసులు వాళ్ళ దగ్గరే ఉన్నాయి. ఎవరి ఆటలు వాళ్ళు ఆడుతున్నారు.

కానీ ఒక్క విషయం. ఈ క్షణంలో రావణుని మనసులో ఏముంటుంది? రామలక్ష్మణుల్ని వధించి, సీతను సతిగా తెచ్చుకోమని శూర్పణఖ చెప్పింది.

మరి రావణుడు ఏమి ఆలోచిస్తున్నాడో? తనకు కావలసింది సీతే. ఎలాగైనా సీతను తెచ్చుకోవాలని ఆలోచిస్తున్నాడే గాని రామలక్ష్మణులతో ఎదురుగా నిలబడి, వారితో పోరాడి, వారిని వధించాలనే ఆలోచనలో ఇప్పటి వరకైతే నిస్పందేహంగా లేదు.

రావణుడు అంతఃపురంలో తీవ్రంగా యోచించాడు. ఎలాగైనా సీతను తీసుకొని రావాలనే నిర్ణయానికే వచ్చాడు. అయితే, రామునితో పోరాడి, రామలక్ష్మణుల్ని వధించి సీతను తీసుకొని రావడమా? లేక, రామునికి తెలియకుండా మోసంతో సీతను తీసుకరావడమా? అని ఆలోచించాడు.

ఈ రెండు మార్గాల్లో ఎటుపోతే మంచి ఎక్కువ - చెడు తక్కువ అని ఆలోచించి, రామునితో పోరాడకుండా, మోసంతో సీతను అపహరించాలి అనే నిర్ణయానికి వచ్చాడు.

రావణుని నిర్ణయాన్ని తులసీ రామాయణం మరొక విధంగా చూపించింది. సుర, నర, అసుర, నాగ, ఖగములు జనస్థానములో వసించు రాక్షసులను వధించుట అసాధ్యము. ముఖ్యంగా ఖరదూషణులు శక్తి యందు తనతో సమానులు. వారిని చంపుట ఎలా సాధ్యము? ఎవరికి సాధ్యము? చంపిన ఆ రాముడు దేవుడు కాడు గదా? అని రావణుడు సందేహంలో పడినాడని తులసీదాస్ చెబుతాడు.

**సురరంజన్ భంజన్ సహి భారా! జోం భగవంత్ లీన్హ అవతారా!**
**తౌ మై ( జాఇ బయరు హఠి కరఉం ( ! ప్రభుసర ప్రాన్ తజేఁ భవ తర ఉం (!**

"దేవతలను సంతోష పరచుటకు, భూభారమును నశింప చేయుటకు సాక్షాత్తు భగవంతుడు మానవ రూపమును ధరించి అవతరించినది సత్యమే అయితే, అట్టి పరమాత్మతో విభేదించి, విరోధించి, అతని చేతుల్లో మరణించి భవసాగరాన్ని దాటుతాను.

"తామసికమైన ఈ దేహముతో భగవంతుని అర్చించి తరించడము దుష్కరము. రాముడు రాజకుమారుడే అయితే, అతని భార్యను అపహరించి సుఖంగా జీవిస్తాను. రాముడు భగవంతుడే అయితే అతని చేతిలో మరణించి తరిస్తాను" అని భావించి సీతాపహరణము నకు రావణుడు సిద్ధపడ్డట్లు తులసీ రామాయణము వివరించింది.

## రావణ మారీచులు

రావణుడు సాగరతీరంలో చాలా దూరం పయనించి, మార్గమున పద్మసరస్సులు, యజ్ఞవేదికలతో కూడిన ఆశ్రమాలను దర్శిస్తూ, సాగరము అవతలి తీరము చేరాడు. అక్కడ సుందరమైన, పవిత్రమైన, ఏకాంతమైన వనప్రదేశమున ప్రశాంతమైన ఆశ్రమాన్ని చూశాడు.

జింకచర్మమూ, జటావల్కలాలు ధరించి, ఆహార నియమాన్ని పాటిస్తూ మారీచుడనే రాక్షసుడు అక్కడ మునివృత్తిలో ఉన్నాడు. తన ఆశ్రమానికి వచ్చిన రావణుని మారీచుడు గౌరవించాడు.

"రాక్షసరాజా! లంకలో అందరూ క్షేమమే కదా? ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని మారీచుడు రావణుని ప్రశ్నించాడు.

"తండ్రీ! మారీచా! నా మాటలు శ్రద్ధగా ఆలకించు. నేను గొప్ప ప్రమాదంలో ఉన్నాను. కష్టాల్లో నీవేకదా నాకు దిక్కు.

"నా సోదరి శూర్పణఖ, నా సోదరుడు ఖరుడు, గొప్ప బాహువులు గల దూషణుడు, త్రిశిరస్సు జనస్థానంలో ఉంటున్న విషయం నీకు తెలియనిది కాదు. అక్కడ సుమారు పద్నాలుగు వేలమంది రాక్షసులు ఉంటున్నారు.

"నా మాట మీదనే వారక్కడ ఉంటున్నారు. ధర్మానుష్ఠాన పరులైన మహర్షుల్ని వధించి భక్షించినా, వారిని ఎదురు తిరిగి ఇంతవరకు ప్రశ్నించినవారు లేరు.



"మనవారంతా శూరులు. గురి తప్పని వారు. ఖరుని అధీనంలో ఉండువారు. వారికీ రామునికీ యుద్ధం జరిగింది. కానీ విచిత్రం. మానవుడు, పాదచారి, ఏకాకి అయిన రాముడు మన పద్నాలుగు వేలమంది రాక్షసుల్ని వధించాడు.

"ఖరుణ్ణి వధించాడు. దూషణుని సంహరించాడు. త్రిశిరస్సును చంపాడు. దండకారణ్యాన్ని నిర్భయంగా మార్చేశాడు. క్షత్రియాధముడైన రాముడు రాక్షస సైన్యాన్నంతా సర్వనాశనం చేశాడు.

"దుర్మార్గుడైన రాముని విషయంలో క్రుద్ధుడైన అతని తండ్రి రాముణ్ణి నిర్దాక్షిణ్యంగా దేశమునుండి బహిష్కరించి వనాలకు పంపాడు. రాముడికి ఆయుర్దాయము నశించింది. ఇంక ఎంతోకాలం జీవించడు.

**దుశ్శీలః కర్కశ స్తీక్ష్ణో మూర్ఖో లుబ్ధోఽజితేన్ద్రియః**
**త్యక్త ధర్మో హ్యధర్మాత్మా భూతానా మహితే రతః ॥**

"రాముడు దుశ్శీలుడు. కఠినుడు. తీక్ష్ణమైనవాడు. లుబ్ధుడు. ఇంద్రియనిగ్రహము లేనివాడు. ధర్మమును త్యజించిన అధర్మపరుడు. ప్రాణులకు చెడు చేయువాడు;" అంటూ రావణుడు ధారాప్రవాహంలా చెప్పుకుపోతున్నాడు.

రావణుని దుష్టబుద్ధి ఇక్కడ మనకు సుస్పష్ట మవుతోంది. శూర్పణఖ రాముని గూర్చి రావణునితో ఇలా చెప్పలేదు. రాముని ఎంతో గొప్పగా వర్ణించింది. ధర్మాత్ముడని కీర్తించింది.

ప్రథమంగా శూర్పణఖ ద్వారా రాముని గూర్చి వినిన రావణుడు అక్కడనుండి మారీచుని వద్దకు రాగానే మనసును, మాటను మార్చుకొని రాముని దుష్టుడుగా వర్ణిస్తున్నాడు.

దుష్టులకు అందరూ దుష్టులుగానే కన్పిస్తారు అనడానికి రావణుడే ఈ సందర్భమున చక్కని ఉదాహరణంగా తెలుస్తున్నాడు. ఆంతర్యంలో నిండిన ద్వేషాలకు బాహ్యంలో దోషాలే కన్పిస్తాయి. అదే గాక, రామునిపై దుష్టత్వాన్ని ఆపాదించి, మారీచుని ద్వారా లబ్ధి పొందేందుకు కూడా రావణుడు అలా మాట్లాడి ఉండవచ్చు. కార్యసాధనకై నీచులు తొక్కని మార్గమంటూ ఉండదు.

వాస్తవానికి అదొక రోగం. పరుల ఆనందాన్ని, వైభవాన్ని చూచి సహించలేని వారు ఈర్ష్యారోగంతో కుములుతూ ఉంటారు. ఇది చికిత్స లేని వ్యాధి.

**య ఈర్ష్యః పరవిత్తేషు రూపే వీర్యే కులాన్వయే**
**సుఖ సౌభాగ్య సత్కారే తస్య వ్యాధి రనన్తకః**

"పరుల విత్తానికి, అందానికి, బలానికి, కులానికి, సుఖసౌభాగ్యాలకి, సన్మానాలకి ఈర్ష్య పొందువారి రోగానికి అంతము లేదు" అని వ్యాసుడు మహాభారతంలో తెలిపాడు.

రావణుడు గొప్ప పండితుడే. తపస్వియే. కానీ ఏం లాభం? ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు వాగుతున్నాడు. తనలోని దుష్టస్వభావాన్ని జయించలేని వాడు ఎందరినో జయించినందుకు విర్రవీగుతాడు. కనుకనే రావణుడు పండితుడైనా రాక్షసుడుగానే పిలువ బడ్డాడు. ద్వంద్వ మనస్తత్వముతో చరించే వారంతా రావణుని అనుంగు సోదరులే.

రావణుడు మారీచునితో చెప్తున్నాడు.

"తండ్రీ! బలమున్నది కదా అని నా చెల్లెలైన శూర్పణఖను నిష్కారణంగా వికృతరూపిణిగా మార్చాడు. చెవులు, ముక్కు ఛేదించి హింసించాడు.

"రామునిపై ప్రతీకారము తీర్చుకోవాలి. అందుకు ఒక్కటే మార్గం. రాముని భార్య, దేవకన్యతో సమానమైన సౌందర్యవతియగు సీతను జనస్థానం నుండి బలవంతంగా అపహరించాలని భావించాను. నువ్వు ఈ విషయంలో నాకు సహకరించాలి.

"మహాబలా! నీవు, నా సోదరులు నాకు సహాయంగా ప్రక్కన నిలబడితే చాలు. దేవతలు కూడా ఎదిరించలేక పలాయన మౌతారు. మారీచా! సమర్థుడవైన నీ సహాయాన్ని నేను అర్థిస్తున్నాను.

"యుద్ధమునందు గాని, వీర్యదర్పాలయందు గాని నీతో సమానులు లేరు. నీవు శూరుడవు. అనేక ఉపాయాలు తెలిసిన వాడవు. మాయలు పన్నే నేర్పు గలవాడవు. అందుకే నీ వద్దకు వచ్చాను. చేయవలసిన కార్యమేదో చెబుతాను. విను.

"మారీచా! నువ్వు వెండిచుక్కలున్న పసిడిలేడిగా మారిపో. రాముని ఆశ్రమం ముందు సంచరిస్తూ వుండు. సీత నిన్ను వీక్షిస్తుంది. కావాలని కాంక్షిస్తుంది. వారు నిన్ను వెంబడిస్తారు. నేను సీతను అవలీలగా అపహరిస్తాను.

**తతస్తయో రపాయే తు శూన్యే సీతాం యథా సుఖమ్**
**నిరాబాధో హరిష్యామి రాహుశ్చన్ద్ర ప్రభా మివ**

"రామలక్ష్మణు లిద్దరూ దూరంగా వెళ్ళిపోగానే ఏ ఆటంకము లేకుండా సుఖంగా, రాహువు చంద్రప్రభను హరించునట్లు సీతను అపహరిస్తాను" అన్నాడు రావణుడు.

ఈ శ్లోకం సందేశాత్మక మైనది. వాల్మీకి అగాధ భావసాగరం నుండి బయల్వెడలిన ఆణిముత్యాలలో ఒకటి. తోడేకొద్దీ ఊరే స్వభావం గలది. దీనిని పరిశీలించి ఆ తరువాత ముందు కేగుదాం.

రాహువు చంద్రకాంతిని హరించునట్లు తాను సీతను అపహరిస్తానని రావణుడు మారీచునితో పలికాడు.

చంద్రునికి చంద్రకాంతి దూరం కాదు. కాలేదు. చంద్రుడు, చంద్రిక సదా అవిభక్తమే. వారిని ఎవ్వరూ వేరు చేయలేరు.

రాముడు చంద్రవంశానికి సంబంధించినవాడు కాకపోయినా రాముని పేరులో చంద్రుడున్నాడు. రామచంద్రుడు అని రాముని పిలుస్తాము. అదలా ఉంచండి.

చంద్రకాంతి చంద్రునికి దూరం కాదు. చంద్రుడున్న చోట చంద్రప్రభ ఉన్నట్లే. సీతమ్మ కూడా రామునికి దూరం కాదు. రాముడున్న చోటే సీతమ్మ ఉంటుంది. అయోధ్య అయినా, అరణ్యమైనా సీతమ్మ రాముని "ఛాయేవానుగతా" ఛాయలాగా అనుసరిస్తుంది. ఈ విషయాన్ని వివాహ మంటపములో జనకుడు ప్రకటించాడు. ఆ సత్యాన్ని పౌరులు, ఋషులు, రాణులూ చూస్తూ చెప్తూ ఆమోదిస్తూనే ఉన్నారు.

చంద్రుని నుండి చంద్రప్రభను వేరుచేయుట ఎలా సాధ్యం కాదో, రాముని నుండి సీతమ్మను వేరుచేయడం కూడా సాధ్యమయ్యే పని కాదు.



మరి గ్రహణకాలంలో చంద్రునికి చంద్రప్రభ దూరం కావడంలేదా? ఈ ఎడబాటు గౌణమే కానీ ముఖ్యం కాదని మనకు తెలుసు. సత్యం కాదని మనకు తెలుసు. చంద్రుడి నుండి చంద్రకాంతి గ్రహణకాలంలో కూడా వేరు కాలేదు. వేరైనట్లు చూచే వారికి గోచరించవచ్చు గాని వాస్తవానికి వేరు కాలేదు.

ఇలా వేరైనట్లు తెలిసే, అధ్యాస కూడా కొంతకాలమే. గ్రహణం వీడిపోగానే, వేరైనట్లు గోచరించిన చంద్రికాచంద్రులు అవిభక్తంగానే ఉన్నట్లు తెలుస్తుంది.

అలాగే సీతారాముల వియోగము కూడా గౌణమే. చంద్రికాచంద్రుల వలె సీతారాముల దాంపత్యము అవిభాజ్యము. అవిభక్తము. గ్రహణ కాలం లాగే ఈ ఎడబాటు కొంతకాలమే గాని శాశ్వతం కాదు. గ్రహణం తొలగగానే చంద్రుడు చంద్రకళతో శోభించునట్లు, ఎడబాటు తొలగి మళ్ళీ సీతారాములు ఏకమై శోభిస్తారు.

చంద్రికా చంద్రులను వేరు చేసినానని విర్రవీగే రాహువు ప్రగల్భాలు ఎలా అర్థ రహితాలో, సీతారాములనే వేరు చేస్తానని పలికే రావణుని ప్రతాపాలు కూడా వ్యర్థ సహితాలే.

సీతా వియోగంలో సుఖాంతము, శుభాంతమే గాని, విషాదాంతము, శోకాంతము కాదని స్పష్టంగా తెలుస్తోంది. కథయొక్క పూర్ణాహుతి ఎలా ఉంటుందో కూడా రావణుడు పలికిన ఉపమానం లోనే ఇమిడి వుంది.

రాహువు చంద్రప్రభను హరించునట్లు సీతను అపహరిస్తాను అన్నాడు రావణుడు. ఇది ఎంత విడ్డూరము? ఎంత వికృతము? మెడ మీద తల ఉన్నవాడు చేసే ఆలోచనయేనా ఇది? పైగా పది తలలు. పనికిరాని తలలు పదుంటే ఏమి? పగిలిపోతే ఏమి? అలా అయితే రెండవదే ఖాయమేమో! దానికా మారీచుని సాయం! ఏమో! ఇది మాత్రం సాయంకాల స్వప్నమే. విపరీత బుద్ధియే.

క్షీరసాగరమథనం జరిగినపుడు అమృత వితరణము జరిగే సమయాన దేవతల రూపంలో వచ్చి సూర్యచంద్రుల మధ్య కూర్చుని అమృతపానం చేయుచున్న రాహుకేతువుల శిరస్సులను పరమాత్మ ఖండించాడు. మొండానికి దూరమైన రాహువు తల చంద్రుని పట్టుకొనేందుకు పోయిందని మనకు తెలుసు.*

ఇది తెగిన తల చేసిన ఆలోచన కదా? మరి రావణుని తలలు ఇంకా తెగిపోలేదు కదా! అప్పుడే ఈ ఆలోచన లేమిటి? సీతాపహరణము వల్ల కూడా రావణునికి జరగబోయే ప్రమాదము కూడా సూచిత మవుతూ ఉంది. రాహువుకు తల ఎలా దూరమైందో, రావణుని పది తలలు కూడా దూరం కాక తప్పవు అని భావము. ఈనాడు రావణుడు చేసే ఈ తలలేని ఆలోచన ఏం చెబుతున్నదో తెలుసా? నేడు తలలేని ఆలోచనలతో తల్లడిల్లుతున్నావు. రేపు అసలు తలలే లేకుండా తగలబడతావు అని చెబుతోంది. ఏం చెబితే ఏం లాభం? చెడ్డవానికి నోరే గాని చెవు లెక్కడుంటాయి?

ఆనాడు రాహువు తలను ఛేదించింది విష్ణుమూర్తి సుదర్శనమే. రేపు రావణుని తలలను ఛేదించేది సాక్షాత్తు విష్ణుమూర్తియే అయిన రాముని కోదండమే.

* శ్రీమద్ భాగవతం ...............

మనం చేయబోయే కార్యములయొక్క మంచిచెడులను మన బుద్దే చెబుతూ వుంటుంది. అంతరేక్షణతో సత్యాసత్యములను గ్రహించి జీవించువారు రాము లవుతారు. అంతరాత్మను కాలదన్ని అహంకారంతో ముందు కురికేవారు రావణు లవుతారు. తమ గోతిని తామే త్రవ్వు కుంటారు.

రావణుడు త్రవ్వడమేకాదు. మారీచునిపై ఎత్తెత్తి పోస్తున్నాడు.

"మారీచా! నేను సీతను అపహరించగానే రాముడు దుర్బలుడై పోతాడు. నేను అప్పుడు సునాయాసంగా కాదు, అనాయాసంగా రాముణ్ణి కొట్టేస్తాను. కూల్చేస్తాను. చెట్టు నుండి కాయలవలె వాడి ప్రాణాల్ని రాల్చేస్తాను;" అన్నాడు రావణుడు.

## రామో విగ్రహవాన్ ధర్మః

రాముని పేరు వినపడగానే మారీచుని ముఖం వాడిపోయింది. కంటిపై రెప్ప వాలడం మానేసింది. పెదవులు ఎండిపోయాయి. తేమ ఆరిపోయిన నాలుక ఎండిపోయిన పెదవుల్ని నాకుతోంది.

మారీచుడు దీనుడై, బలహీనుని లాగా కన్పిస్తున్నాడు. భయంతో కంపించిపోయాడు. మరణించిన వానిలాగా గోచరిస్తూ, చేతులు జోడించి రావణునికి నమస్కరిస్తూ ఉభయులకు హితకరమైన మాటలు పలికాడు.

**సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః**
**అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః**

"రాజా! తీపి కబుర్లు చెప్పేవారు సులభంగా దొరుకుతారు. అయిష్టంగా వున్నా నిజం పలికేవారు అరుదు. వినేవాళ్ళు కూడా అరుదే;" అంటూ తన ధర్మప్రసంగాన్ని ప్రారంభించాడు మహాత్ముడైన మారీచుడు.

రావణుడు మారీచుని సమీపించినపుడు "కష్టాల్లో నీవే కదా నాకు దిక్కు;" అన్నాడు. ఆవిధంగా తనపై ఆధారపడి వచ్చిన వానికి ప్రియం చెప్పాలా! లేక సత్యం చెప్పాలా! అని మారీచుడు ఆలోచించాడు.

రావణుని వద్ద గొప్పవాళ్ళు చాలామంది ఉన్నారు. వారంతా రాముని విషయంలో రావణునికి తియ్యని కబుర్లు చెప్పారే గానీ నిజం చెప్పలేదు. వారు హితం కోరి పలికి ఉంటే రావణుడు దురభిప్రాయాన్ని మార్చుకో నుండాలి. వారు చెప్పలేదు సరికదా, పైగా దుష్ట భావాన్ని దృఢపరచారు. అందుకే రావణుడు స్థిరనిశ్చయుడై తనవద్దకు వచ్చాడని మారీచుడు గ్రహించాడు. రాముని గూర్చిన పూర్తి వివరాలను దూతలు రావణునికి అందివ్వలేదని కూడా మారీచుడు రావణునితో చెబుతాడు.

ఒకవేళ రావణునికి భయపడి దూతలు గాని, సలహాదారులు గాని నిజం చెప్పి వుండకపోవచ్చు. రాజు కష్టాల్లో ఉన్నపుడు మంత్రులు హితకరమైన సలహా లివ్వాలేగాని, ప్రియంగా ఉండేటట్లు కల్లబొల్లి కబుర్లు తియ్యగా చెప్పకూడదు అంటున్నాడు మారీచుడు.



అనుకూల వాయువుల్ని వీస్తూ ప్రియంగా మాట్లాడే వారే ఎక్కువగా ఉంటారు. అప్రియమైనా సత్యమును పలికేవారు చాలా అరుదుగా ఉంటారు. చెప్పేవారే కాదు విజాన్ని వినేవారు కూడా అరుదే నంటూ పరోక్షంగా రావణునికి వాత పెట్టాడు మారీచుడు.

రావణుని సలహామండలి సముచిత సలహాను ఇవ్వలేక పోయింది. యథాతథంగా దానిని గ్రహించే మంచి బుద్ధి రావణునికి లేకపోవడం కూడా బలమైన కారణంగా తెలుస్తోంది.

అయితే, తాను మాత్రం అప్రియమైన దైనా నిజం చెప్పాలనే నిర్ణయించుకున్నాడు మారీచుడు. చేదైన విజాన్ని గ్రహించగలిగే విశాల బుద్ధిని సిద్ధం చేసుకోమని రావణునికి సలహా ఇవ్వడం కూడా ఇక్కడ నిగూఢంగా తెలుస్తోంది. మారీచుడు చెప్పడానికి ఉపక్రమించాడు.

"నాయనా! రావణా! రాముడు సుగుణవంతుడు. గొప్ప వీరుడు. నీకు గూఢచారులు సరియైనవారు కారని నేను భావిస్తున్నాను. ఇంద్రవరుణులతో సమానమైన రాముని గూర్చి నీవు పేలవంగా పలుకుతున్నావు.

"చూడు. ఇక రాక్షసులు సుఖంగా, క్షేమంగా జీవిస్తారా! కోపించిన రాముడు రాక్షస వంశాన్ని సర్వనాశనం చేయడు కదా! ఇష్ట మొచ్చిన విధంగా ప్రవర్తించే నీ లాంటి రాజు వల్ల లంకానగరం నశించదు కదా!

**అపి తే జీవితాన్తాయ నోత్పన్నా జనకాత్మజా**
**అపి సీతా నిమిత్తం చ న భవేద్వ్యసనం మమ**

"సీత పుట్టింది నీ ప్రాణాలు తోడేందుకు కాదు కదా! సీత కారణంగా నాకు కష్టం వాటిల్లదు కదా!

"రావణా! నీవు దుష్టస్వభావంతో ప్రవర్తిస్తున్నావు. పాపపు ఆలోచనలు సాగిస్తున్నావు. ఈ ఆలోచనల ఫలితంగా నీవు, నీ బంధువులు, నీ రాజ్యము, సమస్తమూ నశిస్తుంది.

"రాముణ్ణి గూర్చి నీవు పలికిన నిందావాక్యములు ఏవీ నిజం కావు. రాముడు నియమం తప్పడు. నీతి తప్పడు. లుబ్ధుడు కాడు. దుష్టుడు కాడు. దుశ్శీలుడు కాడు. అధర్మపరుడు కాడు. తీక్ష్ణమైనవాడు కాడు. సర్వుల చెడును అభిలషించేవాడు కాడు.

"రావణా! రామునిలో లేని లక్షణాలన్నీ నువ్వు పలికావు. నిన్ను ఇలా పాడుచేసిం దెవరు? తియ్యని కబుర్లు చెప్పి నీలోకి విషాన్ని దింపిం దెవరు?

"తండ్రి వెళ్ళగొడితే రాముడు అరణ్యానికి వచ్చాడని నీవు చెప్పింది తప్పు. సత్యసంధుడైన దశరథుని కైకేయి వంచించింది. తండ్రికి సత్యాన్ని ఉల్లంఘించాడనే అపకీర్తి రాకూడదని రాముడు అడవికి వచ్చాడు. కోరి కష్టాల్ని వరించాడు. సత్యం కోసం తండ్రికి ఇష్టం లేని పని చేశాడు. ధర్మం కోసం బాధల్ని ఆహ్వానించాడు.

"రాముడు కఠినుడు కాడు. మూర్ఖుడు కాడు. ఇంద్రియలోలుడు కాడు. నీవు పలికిన ఈ మాటలన్నీ నిజం కావు. నిజమేమిటో నీ హితం కోరే నేను చెప్తున్నాను. విను.

**రామో విగ్రహవాన్ ధర్మః సాధుః సత్య పరాక్రమః**
**రాజా సర్వస్య లోకస్య దేవానాం మఘవానివ**

"రాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపము. రాముడు సాధుపురుషుడు. సత్య పరాక్రముడు. దేవతలకు మహేంద్రునివలె సమస్త లోకమునకు ప్రభువు.

"రామునికి కీడు చేయాలనే తలంపు నీకు ఎందుకు కలిగింది? సూర్యుని నుండి ప్రకాశాన్ని ఎవ్వరూ వేరుచేయలేరు. రామునికి సీతను దూరం చేయడం ఎవరికీ సాధ్యం కాదు;" అన్నాడు మారీచుడు.

**శేషమాథీచా నిజమణి! అణూశకేల సాంగకోణి ।**

**తేవీ సీతా శ్రీరామపా సోనీ! కేవీ అముచేని అణవే !**

"శేషుని పడగ నుండి మణిని గ్రహించడము సాధ్యమా? రాముని నుండి సీతను వేరు చేయడం కూడా అంతే" అంటాడు భావార్థ రామాయణంలో మారీచుడు.

"రావణా! రాముని బాణాగ్నిలో దూకాలని ప్రయత్నించకు. హాయిగా భోగా లనుభవిస్తూ రాజ్యాన్ని పాలించుకో. రాముని ఛాయలకు కూడా వెళ్ళడం మంచిది కాదు.

"రావణా! సీత సామాన్యురాలు కాదు. జనకమహారాజు కుమార్తె. సింహోరస్కుడైన రామునికి ప్రాణముల కంటె మిన్నయైన అర్ధాంగి. సదా ఆమె రామునే అనుసరిస్తూ వుంటుంది. ప్రజ్వలించే అగ్నిలా శోభిస్తూ ఉంటుంది. రావణా! వ్యర్థమైన ఆలోచనలు ఆపేయి.

**దృష్ట శ్చేత్త్వం రణే తేన తదన్తం తవ జీవితమ్**

"రాముడు యుద్ధభూమిలో నిన్ను ఎప్పుడు చూస్తాడో అప్పుడే నీ జీవితం అంతమవుతుంది.

"చాలా కాలము జీవించాలనే ఆశ నీకుంటే రామునికి అపకారం చేయాలనే ఆలోచన మానేయి. ఇది నా అభిప్రాయము. లేదా, ధర్మాత్ములైన విభీషణుడు లాంటివారు నీవద్ద వున్నారు. వారి సలహా తీసుకో. ఏది యుక్తమో, ఏది అయుక్తమో నిర్ణయించుకో.

"రావణా! రామునితో యుద్ధము నీకు హితము కాదని నా అభిమతము. చూడు. పనికొచ్చే ఒక మంచి మాట చెబుతాను. శ్రద్ధగా విను," అంటూ తన స్వానుభవాన్ని చెప్పేందుకు మారీచుడు ప్రారంభించాడు.

## మర్మ మెరిగిన మారీచుడు

"రావణా! రాముని గూర్చి నాకు బాగా తెలుసు. నేను అనుభవించింది చెప్తున్నా. విను.

"అప్పుడు నేను భూలోకమంతా తిరిగేవాణ్ణి. వేయి ఏనుగుల బలం ఉండేది నాకు. పర్వతం లాగా తెలిసేవాణ్ణి. నీలమేఘం లాగా ఉండేవాణ్ణి. బంగారు కుండలాలు, కిరీటము ధరించి పరిఘ అనే ఆయుధాన్ని చేత పట్టుకొని ఉండేవాణ్ణి.

"నన్ను చూస్తే లోకాలు హడలెత్తి పోయేవి. ఋషులను చంపి, వారి మాంసాన్ని భక్షిస్తూ దండకారణ్యంలో చరించేవాణ్ణి. అప్పుడు విశ్వామిత్రుడనే మహర్షి అక్కడ ఉండేవాడు. ఆయన ధర్మాత్ముడు.



"ధర్మాత్ముడైన విశ్వామిత్రుడు ఒకనాడు రాముని తండ్రి యైన దశరథుని వద్దకు వెళ్ళాడు. నా వల్ల అతనికి కలిగిన భయాన్ని తెలిపాడు. రాముని పంపమని అర్థించాడు.

"బాలుడు, అస్త్రవిద్యలు నేర్వని రాముని పంపుటకు దశరథుడు అంగీకరించలేదు. చతురంగ బలముతో తానే వచ్చి రాక్షసుల్ని వధిస్తాను అని చెప్పాడు. విశ్వామిత్రుడు అందుకు అంగీకరించలేదు. రాముడు తప్ప ఆ రాక్షసుల్ని ముల్లోకాలలో ఎవరూ ఎదిరించలేరని చెప్పాడు. దశరథుని మెప్పించి రాముని ఆశ్రమానికి తీసికొని వచ్చాడు.

"రాముడు బ్రహ్మచారి అగుట వలన ఏకవస్త్రం ధరించి ఉండేవాడు. అప్పటికి రామునికి మీసకట్టు కూడా రాలేదు. ఉదయభానుని వలె ప్రకాశిస్తూ ఉండేవాడు.

"వరములనే ఐశ్వర్యంతో మదించిన నేను విశ్వామిత్రుని ఆశ్రమానికి వెళ్ళాను. నన్ను చూడగానే ఏ మాత్రము భయము లేకుండా రాముడు విల్లును ఎక్కు పెట్టాడు.

"అతడు బాలుడే కదా అని నిర్లక్ష్యం చేసి నేను విశ్వామిత్రుని యాగశాలను సమీపించాను. రాముడు నాపై బాణప్రయోగం చేశాడు. అది నన్ను నూరు యోజనముల దూరంలో విసిరి పడేసింది. నన్ను చంపాలని రాముడు భావించలేదు. అందుచేత అలా దూరంగా పడునట్లు కొట్టాడు.

"రామబాణము నన్ను లోతైన సముద్రంలో పడేసింది. స్పృహ రాగానే ఎలాగో నేను లంకాపురికి చేరాను. నాకు సహాయం చేయడానికి వచ్చిన రాక్షసుల్ని రాముడు సంహరించాడు.

"బాలుడైన రాముడు అప్పటికి అస్త్రవిద్యను కూడా పూర్తిగా నేర్వలేదు. రావణా! నేను రామబాణము యొక్క వైభవాన్ని చూచినవాణ్ణి కాబట్టి నిన్ను నివారిస్తున్నాను. రామునితో విరోధము నీకు వినాశాన్నే కల్పిస్తుంది.

"రాక్షసులందరూ సుఖంగా జీవిస్తున్నారు. అనేక ఉత్సవాలు చేసుకుంటూ హాయిగా సుఖిస్తున్నారు. నీ వల్ల వారుకూడా ఆపదలో చిక్కుకుంటారు. నానారత్న విభూషితమైన లంకానగరము సీత మూలంగా నశించిపోతుంది.

"పాపాత్ములతో సంబంధము వలన ఏ పాపమూ ఎరుగని మంచివాళ్ళు కూడా సర్పాలు నివసించే మడుగులోని చేపల్లాగా నశించిపోతారు.

"రావణా! నా మాట విను. రామునితో వైరుధ్యము మంచిది కాదు. రాక్షసులందరూ నశించిపోతారు. లంకానగర మంతా దగ్ధమైపోతుంది. పరభార్యా గమనము నీకు శ్రేయోదాయకం కాదు.

"లంకేశా! నీవు ఎక్కువ కాలము జీవించాలని ఆశించేటట్లయితే రామునికి కీడు తలపెట్టకు. నా మాటను వినకుండా సీతను అవమానించావా, నీవు, నీ సైన్యము, నీ బంధువులు అందరూ యమపురికి చేరుతారు.

"రావణా! నా విషయం ఇంకా చెప్పాల్సి ఉంది. రామబాణము యొక్క వైభవాన్ని అప్పుడు చూశాను గదా! అలాగని ఊరుకోక ఇటీవల ఇద్దరు రాక్షసుల్ని వెంటబెట్టుకొని దండకారణ్యంలో ప్రవేశించాను.

"నేను గొప్ప మృగరూపం ధరించాను. భయంకరమైన కోరలతో, ప్రజ్వలించు నాలుకతో, పెద్ద దేహంతో దండకారణ్యంలో సంచరించడం ప్రారంభించాను. మునుల్ని చంపి వారి మాంసాన్ని తింటూ, రక్తాన్ని త్రాగుతూ ఒకనాడు రాముని చూశాను.

"రాముడు సీతాలక్ష్మణ సమేతుడై కన్పించాడు. జడలు ధరించి మునిలా గోచరించాడు. పూర్వము నన్ను కొట్టిన రాముడు ఇతడే అని గ్రహించాను. అయినా తాపసవృత్తిలో ఉన్నాడు కదా అని భావించి రాముని వధించుటకు వెళ్ళాను.

"రాముడు వెంటనే మూడు బాణాలను సంధించాడు. రక్తపానం చేసే వజ్రతుల్యమైన ఆ బాణాలు మావైపు వచ్చాయి. రామబాణము యొక్క దారుణ ప్రభావమును గతంలో చవిచూచి యున్నవాణ్ణి గనుక నేను, అటు ఇటు పరుగెత్తి సముద్రము అవతలి తీరం చేరాను. సముద్రం వరకు వచ్చి రామబాణము వెనుదిరిగి పోయింది. నేనలా రక్షింపబడ్డాను. నాతోపాటు వచ్చిన ఇద్దరు రాక్షసులు రామబాణానికి హతులయ్యారు.

"ఆనాటి నుండి నా మనసు అదోలా మారిపోయింది. మనస్సును నిగ్రహించుకున్నాను. యోగమార్గాన్ని అనుసరించాను. మునివృత్తిని చేపట్టాను.

"రావణా! అప్పట్నుండి చెట్టును చూసినా, పుట్టను చూసినా, కొండను చూసినా, కోనను చూసినా నాకు రాముడే కన్పిస్తున్నాడు. నాకు అన్నిచోట్ల రాముడే కన్పిస్తూ ఉంటాడు.

**రామభూత మిదం సర్వం అరణ్యం ప్రతిభాతిమే**

"ఈ అరణ్యమంతా నాకు రామమయంగా కన్పిస్తోంది;" అంటున్నాడు మారీచుడు.

మారీచునికి భ్రమరకీటక న్యాయంగా అన్నిచోట్ల రాముడే దర్శనమిస్తున్నాడు. రామ బాణాన్ని నివారించను ఎవరికీ సాధ్యం కాదని తెలుసుకొనిన మారీచుడు భగవద్భక్తిని, జ్ఞానాన్ని సంపాదించాడు.

తనకు మించినవారు లేరని భావించి అజ్ఞానంతో రాముని వధించాలని ప్రయత్నించాడు. రామబాణ వైభవాన్ని గ్రహించిన తరువాత భక్తిని పెంచుకొని తాపసవృత్తిని చేపట్టాడు మారీచుడు.

**After all, man knows mighty little, and may some day learn enough of his own ignorance to fall down and pray.**

"మనిషికి తెలిసింది చాలా స్వల్పమే. కాలం గడిచే కొలది తన అజ్ఞానాన్ని గూర్చియే ఎక్కువగా తెలుసుకొని, మోకరిల్లి ప్రార్థించు రోజు వచ్చి తీరుతుంది" అంటాడు హెన్రీ ఆడమ్స్.

మారీచుని విషయంలో అదే జరిగింది. మునివృత్తిలో జీవిస్తూ, రాక్షస గుణాల్ని త్యజించి జీవిస్తున్న మారీచునకు అంతా రామమయంగా గోచరిస్తూ వుంది.

మారీచుడు రావణునితో చెప్తున్నాడు.

"రావణా! ఎవ్వరూ లేని చోట కూడా నాకు రాముడు కన్పిస్తున్నాడు;" **(రహితే రామమేవ హి పశ్యామి)**



రాముడు లేని దెక్కడ? సర్వవ్యాపి యైన రాముడు అంతటా వున్నాడు. జీవులు కొన్నిచోట్ల ఉండవచ్చు. కొన్నిచోట్ల లేకపోవచ్చు. దేవుడైన రాముడు అన్నిచోట్ల దర్శనీయుడే కదా! మారీచునికి ఎవరూ లేని చోట, ఏమీ లేని చోట కూడా, ఆ లేనిదానికి ఆధార మైనది ఏదో అది ఉన్నట్లే తెలుస్తూ వుంది.

**ఏకస్యాపి కూటస్థస్య చిత్త తారతమ్యాత్. జ్ఞానైశ్వర్యాణామ్**
**అభివ్యక్తిః పరేణ పరేణ భూయసీ భవతి ।**

"నిత్యమైన ఒకే సత్యము బాహ్యంగా గోచరించే వివిధ దశలలో క్రమక్రమంగా ఉన్నత రూపాలలో దృశ్యమాన మవుతోంది" అని శ్రీశంకరాచార్య స్వామి బ్రహ్మసూత్ర భాష్యంలో తెల్పుతారు.

"రావణా! రాముని విషయంలో నా మనస్సు ఎంతగా వ్యామోహమును పొందిందో తెలుసా! 'ర' అనే అక్షరంతో ప్రారంభమయ్యే రత్నాలు, రథాలు మొదలైన పేర్లు వింటే కూడా నేను భయకంపితుడ నవుతూ ఉంటాను.

"రాక్షసరాజా! ఆ రాముని ప్రభావము నాకు తెలుసు. అతనికి సమానులు లేరు. అతనితో సమరం నీకు సముచితమైనది కాదు. చూడు. రావణా! రాముడితో యుద్ధం చేయడమా! మానడమా! అనేది నీ వ్యక్తిగతమైన విషయం. కానీ నేను కొంతకాలము జీవించాలనే అభిప్రాయం నీకుంటే, నాముందు రాముని విషయం ప్రస్తావించకు.

"రావణా! ఈ ప్రపంచంలో ఎందరో ధర్మాత్ములు ఇతరులు చేసిన అపరాధాలకు బలియై మరణించారు. అలాగే నీవు చేయబోయే అపరాధానికి నేను బలి కావలసి వస్తుంది. నీకు ఏది మేలని తోస్తే దానిని ఆచరించు. నేను మాత్రం ఆ విషయం తలపెట్టను. ఆ పనిలో కాలుపెట్టను.

"చూడు నాయనా! శూర్పణఖ చెప్పిన మాటలు విని యుక్తాయుక్తములు ఆలోచించకుండా ఖరుడు రామునికి అపకారం చేయాలని యత్నించి రాముని చేతిలో మరణించాడు. ఇందులో రాముడు చేసిన తప్పేమిటో చెప్పు. నా మాట విని నీ ప్రయత్నాన్ని విరమించుకో;" అన్నాడు మహాత్ముడైన మారీచుడు.

## అరణ్య రోదనము

మారీచుని సదుపదేశము రావణునికి రుచించలేదు. మరణించా లనుకున్నవాడు మందు పుచ్చుకుంటాడా? మంచి కోరి మారీచుడు చెప్పిన మాటలు రావణునికి విషగుళిక ల్లాగా కన్పించాయి. వెంటనే కఠినోక్తులతో మారీచునిపై విరుచుకపడ్డాడు రావణుడు.

"మారీచా! నీవు పలికే పలుకులు ఎంత అసందర్భంగా ఉన్నాయో, అప్రస్తుతంగా ఉన్నాయో నీవు గుర్తించలేక పోతున్నావు.

"నేను చేయదలచుకున్న కార్యము మంచిదా? లేక చెడ్డదా? అని నిన్ను నే నడిగానా? నాకు శక్తి ఉన్నదో, లేదో పరీక్షించి చెప్పమని నిన్ను కోరానా? నీ వేమి మాట్లాడుతున్నావు?

"రాజు ప్రత్యేకించి అడిగినపుడు నమస్కరించి వినయంగా మాట్లాడటం బుద్ధిమంతులైన మంత్రుల, అనుయాయుల లక్షణం. అడగని విషయాన్ని ప్రస్తావించి పేలడం అజ్ఞానుల లక్షణం.

**రాజ్ఞ మప్రతికూలం తు మృదుపూర్వం హితం శుభమ్**
**ఉపచారేణ యుక్తం చ వక్తవ్యో వసుధాధిపః**

"రాజుతో పలికే మాటలు ప్రతికూలమైనవి కాకూడదు. మృదువైనవిగా ఉండాలి. హితకరంగా, శుభకరంగా ఉండాలి. వినయముతో కూడి వుండాలి;" అన్నాడు రావణుడు.

ఇదీ రాక్షసస్వభావం. అశుభకర్మలు చేస్తూ శుభఫలితాల్ని ఆశించడం ఉచితమా? శుభాన్ని కోరేవాడు తన మనసుకు ప్రతికూలంగా ఉన్న విషయాన్ని కూడా అంగీకరించ గలగాలి.

విషయం శుభకరంగా ఉండాలి. కానీ అది రాజు మనసుకు ప్రతికూలంగా ఉండ కూడదు. ఎలా సాధ్యం? ఇలా గాకుండా రాజుకు అనుకూలమైన విషయాన్నే మాట్లాడమని చెప్తే సరిపోతుంది కదా! అలాంటప్పుడు ఇక హితమేమిటి? శుభమేమిటి? రాజు మెచ్చింది ధర్మం. రాజు వచ్చింది సత్యం. అంతేనా? దీనినే రాక్షసనీతి అంటారు. అప్రియమైనా హిత మును పలికేవారు, అప్రియమైనా హితమును వినగలవారే మాననీయులు. కాని అలాంటివారు అరుదు కదా!

**అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతాహి దుర్లభః**

"అప్రియమైనను ఉపయుక్తములైన మాటలను పలికే వక్త, వినే శ్రోత ఇద్దరూ ఈ ప్రపంచంలో దుర్లభ మైనవారే" అని మహాభారతము-శాంతిపర్వము బోధించింది.

"మారీచా! నీవు అజ్ఞానివి. దుష్టబుద్ధివి. నీ ఇంటికి వచ్చిన నన్ను చులకనగా మాట్లాడు తున్నావు. అభ్యాగతుని అనాదరంగా చూస్తున్నావు. అర్థరహితమైన మాటలన్నీ పలుకుతున్నావు. నీ పలుకులన్నీ ఊషరక్షేత్రంలో నాటిన బీజాల వలె వ్యర్థములు.

"రాముడు పాపి. మూర్ఖుడు. ముఖ్యంగా మానవుడు. అట్టి రాముని నావద్ద గొప్ప చేసి మాట్లాడుతున్నావు. నాకు భయాన్ని కల్పించాలని యత్నిస్తున్నావు.

"నాకు ప్రియసోదరుడైన ఖరుణ్ణి రాముడు సంహరించాడు. రాముడికి ప్రియురాలైన సీతను నీ సహాయంతో నేను అపహరిస్తాను. ఈ విషయంలో నా బుద్ధి స్థిరంగా ఉంది.

**న వ్యావర్తయితుం శక్యా సేన్ద్రైరపి సురాసురైః**

"ఈ విషయంలో సురాసురులందరు ఇంద్రునితో కలిసి వచ్చినా నన్ను మార్చ లేరు" అన్నాడు రావణుడు.

సాధారణంగా కోపం వచ్చినపుడు ఏం మాట్లాడాలో తెలియని అయోమయస్థితిలో అజ్ఞానులు ఇలా పలుకుతుంటారు.



"హరి హరాదులు అడ్డొచ్చినా నన్ను ఆపలేరు"
"సూర్యచంద్రులు ఏకమైనా నన్ను మార్చలేరు"
"భూమ్యాకాశాలు ఒక్కటైనా నాకు నష్టం రాదు"
"నన్ను పీడించడం పుట్టించిన వాడికి కూడా సాధ్యం కాదు"

ఇలాంటి ప్రగల్భాలు పలికే అప్రయోజకుల్ని మనం సమాజంలో తరచుగా చూస్తూవుంటాం. హరిహరాదులు దిగిరావడానికి, సూర్యచంద్రులు ఏకం కావడానికి, బ్రహ్మోద్భవానికి కారణ భూతుడు కావడానికి తనలోని ఔన్నత్య మేమిటో క్షణం కూడా ఆలోచించడు.

గాలి ఎలా వీస్తే నావ అలా పయనించునట్లు, మనసు ఎలా చెబితే నాలుక అలా వాగడమే గాని బుద్ధి నుపయోగించి సత్యాసత్యాల్ని గ్రహిస్తే కదూ!

సురాసురులు ఇంద్రునితో కలిసి వచ్చినా తనను మార్చలేరని రావణుడు ప్రగల్భాలు పలుకుతున్నాడు. ఇలా మాట్లాడేవారే రాక్షసులు.

"మారీచా! బాగా విను. నేను నీ సలహా కోరలేదు. నీ సహాయాన్ని కోరాను. నీవు చేయవలసిన కార్యాన్ని చెబుతున్నా. అవధానంతో విని ఆచరించు. తెలిసిందా!

"వెండి చుక్కలు గల బంగారు లేడిగా నీవు మారాలి. సీతకు కనిపించేలా రాముని ఆశ్రమం ముందు సంచరించాలి. సీతలో ఆసక్తిని రేకెత్తించేలా ప్రవర్తించాలి.

"నిన్ను చూసి సీత ప్రథమంగా ఆశ్చర్య పడుతుంది. ఆ తరువాత ఆశ పడుతుంది. చివరికి లేడిని పట్టి తీసుకురమ్మని రాముని కోరుతుంది.

"రాముడు నిన్ను వెంబడిస్తాడు. నీవు దూరంగా వెళ్ళు. అప్పుడు రాముని కంఠధ్వనిని అనుకరిస్తూ "అయ్యో! సీతా! అయ్యో! లక్ష్మణా!" అని పలుకు.

"ఆ ధ్వని విని సీత కంగారు పడుతుంది. కలత పడుతుంది. కన్నీరు కారుస్తూ లక్ష్మణుని రాముని కొరకు పంపుతుంది.

"లక్ష్మణుడు నిష్క్రమిస్తాడు. నేను ప్రవేశిస్తాను. ఇంద్రుడు శచీదేవిని వలె సీతను అనాయాసంగా అపహరిస్తాను.

"మారీచా! ఈ సహాయం చేసిన పిమ్మట నీ ఇష్టమొచ్చిన చోటికి నీవు వెళ్ళవచ్చు. నాకు నీవు చేసిన ఈ ఉపకారానికి నీకు నా రాజ్యంలో సగభాగం ఇస్తాను.

"ఇక ఆలోచించడం మానేయి. నీవు ముందు నడువు. నీ వెనుకే రథంలో నేను నిన్ను అనుసరిస్తాను. రాముణ్ణి వంచించి, సీతను పోరాటం లేకుండా పొందుతాను.

"మారీచా! ఈ పని నీవు చేసి తీరాలి. లేదా బలవంతంగా నైనా నీ చేత ఈ పనిని చేయిస్తాను. నేను చెప్పినట్లు వినకపోతే నిన్ను ఇక్కడే, ఇప్పుడే చంపేస్తాను. రాజుకు శత్రువై ఎవడూ సుఖించలేడు.

"మారీచా! నేను చెప్పినట్లు విని నీవు రాముని ఆశ్రమం వద్దకు వెళ్తే నీవు మరణించ వచ్చు. లేదా మరణించక పోవచ్చు. కానీ నాతో విరోధాన్ని కాంక్షించావా! ఇక్కడే రాలిపోతావు. ఇప్పుడే విగతజీవి వవుతావు. నీకు ఏది హితమో! ఆలోచించుకో;" అని తన అజ్ఞాన ప్రలాపాన్ని ఆపాడు రావణుడు.

## కాలం తీరింది

మారీచుడు ఎంతగా చెప్పినా రావణునికి నచ్చలేదు. మరణం సమీపించే కాలంలో మంచి రుచించదేమో! అని తనను తాను నిగ్రహించుకున్నాడు మారీచుడు.

రావణుడి మాట ఎలా ఉన్నా ముందు తన పరిస్థితి ప్రమాదంలో పడింది. వెళ్తే రాముడు చంపుతాడు. వెళ్ళకపోతే రావణుడు చంపుతాడు. ఏది జరిగినా, ఏది జరగకపోయినా చావడం మాత్రం తప్పక జరిగి తీరుతుంది.

మరణించడం ముఖాన వ్రాసి ఉంది. ఎవరి చేతిలో మరణించాలి? అనేది మారీచుడు మనసులో నిర్ణయించుకోవాలి. ఏ మరణం శ్రేయమో తేల్చుకోవాలి.

మారీచుడు ఆలోచించాడు. పాపాత్ముడైన రావణుని చేతిలో చావడం కన్నా ధర్మాత్ముడైన రాముని చేతిలో చావడమే మేలని అభిప్రాయపడ్డాడు. తన అభిప్రాయాన్ని ప్రకటించే ముందు, ఆగంతుకంగా వచ్చి మరణానికి ముహూర్తం పెట్టిన రావణుని పరుషవాక్కులతో నిందించాడు మారీచుడు.

"రావణా! ఇంతకీ, ఈ పాపాన్ని నీకు ఉపదేశించిన వాడెవరు? నీవు, నీ బిడ్డలు, నీ మంత్రులు, బంధువులు, నీ రాజ్యము - సమస్తమూ నశించే ఈ దుష్టకార్యాన్ని ఆచరింపమని నిన్ను ప్రేరేపించింది ఎవరు?

"వాడెవడైనా సరే, నీ సుఖాన్ని చూడలేకనే ఈ పాపకార్యానికి పూనుకున్నాడు. ఈ ఉపదేశము ద్వారా నీకు మృత్యుద్వారాన్ని తెరిచాడు. నీవు రాముని చేతిలో నశించడం చూడాలని ఉబలాటపడినవారే ఒక పథకం ప్రకారం ఈ పన్నాగం నడిపారు.

"నిన్ను సన్మార్గంలో నడపవలసిన ధర్మము నీ మంత్రుల మీద ఉంది. ఆ కార్యాన్ని వారు పూర్తిగా విరమించారు. అట్టి మంత్రులు వధార్హులే అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

**వ్యసనం స్వామి వైగుణ్యా త్ప్రాప్ను వన్తీతరే జనాః**

"ప్రభువు దుష్టుడైతే ప్రజలంతా కష్టాల పాలవుతారు.

"రావణా! అయోగ్యుడైన సారథి నడిపేటప్పుడు మిట్టపల్లాలు రాగానే వేగంగా పరుగెత్తే గుఱ్ఱాలు క్రిందపడి నశిస్తాయి. వాటితోపాటు సారథికూడా నశిస్తాడు.

"అలాగే రాజు అయోగ్యుడైన సారథి అయినపుడు మంత్రులు అస్తవ్యస్తంగా ప్రయాణం చేస్తే రాజూ నశిస్తాడు. అతనితోపాటు మంత్రులూ నశిస్తారు.

"ధర్మాత్ములైన వారు కూడా అన్యులు చేసిన అపరాధాల వల్ల సమూలంగా నశించిపోయినట్లు చాలా వార్త లున్నాయి. రావణా! దుష్టుడైన రాజు యొక్క పాలనలో జీవించు పౌరులు నక్క రక్షణలోని గొఱ్ఱెల లాగా వృద్ధి చెందరు.

"రావణా! విధి బలీయమైంది. నాకు ఈ క్షణాన ఆకస్మికంగా ఆపద వచ్చిపడింది. నీవు నా వద్దకు వస్తే చాలా సంతోషించాను. మరణవార్తను తెచ్చిన యముడివని ఊహించలేకపోయాను.



"నా విషయం ఇక నిర్ణయ మైనట్లే. నన్ను గూర్చి నాకు విచారము లేదు. నా ఆలోచన అంతా నిన్ను గూర్చే. రావణా! నీవు, నీ సైన్యమంతా నిశ్శేషంగా ఖర్చయిపోతారు.

"రావణా! నీవు నా వీడవే నని మరచిపోకు. రాముడు నన్ను వధించగానే, నీవూ రాముని చేతిలో మరణిస్తావు.

"రాముడు నన్ను చూశాడా! నేను మరణించినట్లు ఆ క్షణాన్నే నిర్ణయించుకో. సీతను హరించగానే నీవూ బంధువులతో కలిసి మరణిస్తావు.

"రావణా! సీతాపహరణమే జరిగితే నీవు ఉండవు. నేను ఉండను. లంక ఉండదు. రాక్షసు లుండరు. ఇది సత్యం. నేను ఇంతగా చెప్తున్నా నా మాటలు నీ మనసు కెక్కడంలేదు.

**పరేత కల్పాహి గతాయుషో నరా**
**హితం న గృహ్ణన్తి సుహృద్భిరీరితమ్**

"ఆయువు మూడి, చావు దగ్గర పడ్డప్పుడు మిత్రులు చెప్పే మంచి మాటలు విన పడతాయా?

"రావణా! సరే. ఏం చెప్పి ఏమి ప్రయోజనం? పోతాం పద. రాముణ్ణి ఎదిరించినవాడు బ్రతికి బట్టకట్టడు. నా ఆట ముగిసినట్లే. యమదండము నన్ను వధించేసింది. ఇపుడు నీ ముందున్నది నా బొమ్మ మాత్రమే.

"కొందరి స్నేహాలు జీవితాల్లో సుఖాల్ని నింపుతాయి. కొందరి స్నేహాలు మరణాల్ని దింపుతాయి. ఏం చేద్దాం! పద. నీకు శుభం కలుగుగాక!" అని మారీచుడు పలికాడు.

రావణుడు మారీచుణ్ణి కౌగిలించుకొని సంతోషించాడు. "భేష్! ఇప్పుడు నీవు నిజమైన మారీచుడివి. ఇంతకు ముందు మానీచుడివి. రా .... నాతోపాటు రథమెక్కు;" అని రావణుడు పలికాడు.

మారీచుడు రావణుని రథ మెక్కాడు. కంచరగాడిదలు లాగే ఆ కాంచనరథం మారీచునికి రథంలా అనలేదు. శవపేటికలా అనింది. ప్రయాణం శ్మశానానికే అన్నట్లు ఉండింది.

రథం దండకారణ్యంలో ప్రవేశించింది. రావణుడు రాముని ఆశ్రమాన్ని చూశాడు. మారీచుని చేయి పట్టుకొని లాలిస్తూ రావణుడు ఇలా పలికాడు.

"మిత్రమా! అదిగో. ఆ అరటిచెట్ల మధ్య ఉన్నదే ఆశ్రమము. వచ్చిన పనిని త్వరగా పూర్తిచేయి;" అన్నాడు. వెంటనే మారీచుడు మృగరూపాన్ని ధరించాడు. రాముని ఆశ్రమం ముందు తిరుగసాగాడు.

## పసిడి లేడి

మునివృత్తిలో ప్రవేశించి జీవిస్తున్న మారీచుడు మరులు గొలిపే మాయలేడిగా మారాడు. మాయలు తెలిసిన మారీచుడు గతంలో అభిలషించి ఎన్నో మాయలు ప్రదర్శించాడు. ఈనాడు ఇష్టం లేకున్నా తానే మాయలో పడ్డాడు.

పైడిలేడి ఆశ్రమం ముందు ప్రత్యక్షమైంది. దాని కొమ్ముల అంచులు ఇంద్రనీల మణుల్లా శోభిస్తున్నాయి. దాని ముఖము ఎఱ్ఱని కమలము వలె ప్రకాశించగా, చెవులు నల్ల కలువల వలె శోభించాయి.

దాని పొట్ట మల్లెపూవు లాగా, చంద్రుడు లాగా, వజ్రం లాగా మెరుస్తోంది. పార్శ్వాలు ఇప్పపువ్వు రంగులో ఉన్నాయి. డెక్కలు వైడూర్య మాణిక్యాల వలె ఉన్నాయి. తోక వజ్రాయుధము వలె పైకి లేచి ఉంది.

దేహమంతా వందలకొలది వెండి చుక్కలతో మెరిసిపోతూ, పద్మము వలె అందమైన పృష్ఠభాగముతో వెలిగిపోతూ ఆ మాయ జింక రాముని ఆశ్రమం ముందు అటూ ఇటూ తిరుగుతోంది.

కొంతసేపు చెట్లమధ్యకు వెళ్ళి మళ్ళీ బయటకు వస్తుంది. లేళ్ళ సమూహాన్ని చూచి వాటి దగ్గరకు పరుగెత్తి పోతుంది. కొంతసేపటికి సీత తనను చూడాలని ఎగిరెగిరి గంతులేస్తూ వస్తుంది. గుడ్లప్పగించుకొని గుండ్రంగా తిరుగుతుంది.

మాయజింకను చూచింది మాయ లెరుగని జానకి. విచిత్రంగా కన్పిస్తున్న ఆ మృగాన్ని చూచి విస్మయ మొందింది. వెంటనే భర్త యైన రాముని, ఆయుధపాణి యైన లక్ష్మణుని బిగ్గరగా పిలిచింది.

రామలక్ష్మణులు వచ్చి పైడిలేడిని చూశారు."అన్నా! ఈ కాంచనమృగము రాక్షసుడైన మారీచుడే అని నా అభిప్రాయము. వినోదార్థము వేటాడుటకు అరణ్యాలకు వచ్చిన అనేక మంది రాజులను తన మాయారూపములను ప్రదర్శించుట ద్వారా మారీచుడు వధించి యున్నాడు.

"రామా! రత్నఖచితమై శోభిల్లే స్వర్ణలేడి ఎక్కడైనా ఉందా? మాయల మారీచుడే ఈ మాయామృగంగా మారినాడు. ఈ విషయంలో సందేహము అవసరం లేదు;" అన్నాడు లక్ష్మణుడు.

కాంచనమృగము యొక్క చర్మమును కాంక్షిస్తున్న వైదేహి లక్ష్మణుని మాటలకు అడ్డుతగిలి రామునితో ఇలా పలికింది.

"రామా! మనోహరమైన ఈ మృగము నా మనసును ఆకర్షించింది. దానిని పట్టి తెచ్చి నాకివ్వండి. దానితో ఆడుకుంటాను. రోజూ మనం ఎన్నో మృగాలను చూస్తున్నాము. కానీ ఇంత అందమైన మృగాన్ని నేనెప్పుడూ చూడలేదు;" అంటూ మొదలుపెట్టింది సీతమ్మ.

ఈ సందర్భములో ఒక అందమైన శ్లోకాన్ని పలుకుతాడు వాల్మీకి. రాక్షసమాయను లక్ష్మణుడు రామునికి వర్ణించి చెప్తున్న సందర్భములో సీతమ్మ లక్ష్మణుని మాటలకు అడ్డు తగిలి మాట్లాడిన సందర్భములో వాల్మీకి తన హృదయాన్ని మెల్లగా విప్పుతాడు.

**ఏవం బ్రువాణం కాకుత్థ్సం ప్రతివార్య శుచిస్మితా**
**ఉవాచ సీతా సంహృష్టా చర్మణా హృతచేతనా ।**

"మృగచర్మము సీత మనసును ఆకర్షించగా, లక్ష్మణునికి అడ్డు తగిలి అందమైన మందహాసముతో సీతమ్మ ఇలా పలికింది." ఇదీ శ్లోకభావం. ఇది వాల్మీకి హృదయవాణి.



**ఆర్యపుత్రాభిరామోఽసౌ మృగో హరతి మే మనః**
**ఆనయైనం మహాబాహో క్రీడార్థం నో భవిష్యతి**

"ఆర్యపుత్రా! అందమైన ఈ లేడి నా మనసును హరించింది. ఓ మహాబాహో! ఈ మృగాన్ని పట్టి తీసుకురా. దాంతో మనం ఆడుకోవచ్చు;" అని సీతమ్మ రామునికి చెప్పింది. ఇదీ శ్లోకభావం. ఇది సీతమ్మ ఆంతర్యం.

మారీచుడే మృగరూపంలో వచ్చాడని లక్ష్మణుడు రామునితో చెప్తున్నాడు. పైగా నిస్సందేహం అంటున్నాడు. ఈ మాటలు విన్న సీతమ్మ లక్ష్మణునికి అడ్డు తగిలి రామునితో మాట్లాడింది.

మృగము యొక్క అందమైన చర్మము సీతమ్మను ఆకర్షించింది. "రండి-రండి" అని రామలక్ష్మణుల్ని పిలిచింది. అప్పుడు రాముడు, ఆయుధపాణియైన లక్ష్మణుడు వచ్చారు అన్నాడు వాల్మీకి.

లక్ష్మణుడు ఆయుధాన్ని ధరించి ఉన్నాడు. లేడిని పట్టి తెమ్మని సీతమ్మ లక్ష్మణునికి చెప్పి ఉండాలి. కానీ అలా చేయకుండా రామునితో చెప్పింది. ఈ లేడి రాక్షసమాయ అని లక్ష్మణుడు రామునితో పలికిన మాటలను విని జానకి తన మనోరథము నెరవేరుటకు రాముని ఆశ్రయించడమే మంచిది అని భావించింది.

మృగము చాలా మనోహరంగా ఉందని పై శ్లోకంలో సీతమ్మ వర్ణించింది. **'అభిరామః అసౌ మృగః'** ఈ మృగము మనోహరంగా ఉంది. మృగానికి 'అభిరామ' అనే విశేషణం చేసి పల్కింది సీతమ్మ. తన మనసును ఆకర్షించిన మృగాన్ని వర్ణించడంలో భర్త పేరును జోడించింది. 'అభిరామః' అంటే మనోహరమైన అని అర్థము.

తన మనసు ఇంతవరకు రాముని కన్నా అన్యమైన వస్తువులచే ఆకర్షింప బడలేదని అర్థము. మృగం అభిరామంగా ఉండడం చేత దానిని తెచ్చిపెట్టమని అయోధ్యారాముని అరణ్యంలో సీతమ్మ కోరింది.

అభిరామ విశేషణంతో మృగాన్ని వర్ణించిన సీతమ్మ శ్రీరాముని "గొప్ప బాహువులు కలవాడా!" **(మహాబాహో)** అని సంబోధించింది. లేడిని తెచ్చిపెట్టడం రామునికి సులభమైన కార్యమే అని సూచించడం ఆ సంబోధనలో స్పష్టంగా తెలుస్తూ ఉంది. సీతమ్మ మృగచర్మానికి ఆకర్షింపబడటమే ఈ మాటలన్నిటి వెనుక దాగియున్న ఆంతర్యం. మాయ ముసుగులో దాగియున్న సౌందర్య మర్మాన్ని సున్నితంగా స్పృశిస్తాడు వాల్మీకి.

**'చర్మణా హృత చేతనా'** - చర్మణా=చర్మముచేత, హృతచేతనా=హరించబడిన చిత్తము కలది. పైన తెల్పిన వాల్మీకి శ్లోకంలో ఈ విధంగా సీతమ్మ యొక్క ఆకర్షణ వర్ణింపబడింది. రావణుడు సీతమ్మను అపహరించుటకు ముందుగానే సీతమ్మ చిత్తము హరింపబడింది అంటాడు వాల్మీకి.

మనసు హరించబడిన తరువాతే మగువ అపహరించ బడింది. మనసును హరించింది మృగచర్మము. మగువను అపహరించింది మృగతుల్యుడైన రాక్షసుడు.

ఇంతకీ సీతమ్మ మనసును అపహరించింది ఎవరు? మృగమా? మృగచర్మమా? సీతమ్మను మభ్యపెట్టింది అందమైన చర్మమే గాని లేడి కాదు.

చక్షువులను భ్రమింపజేసే శక్తి చర్మాని కుంది. చర్మ సౌందర్యము ఎంతటి వారినైనా చంచల చిత్తులుగా మార్చేస్తుంది. చర్మము యొక్క చమత్కారము చిత్తానికి దక్కేదే గాని చర్చలకు చిక్కేది కాదు. చిత్తాన్ని చలింపచేసే ఈ చర్మసౌందర్యము గతంలో చరిత్రలనే తారుమారు చేసి ఉంది. గతించిన తరువాత చర్మకారునికి కూడా ఉపకరించని చర్మము జీవితకాలంలో అందరి చర్మాలకు వేడెక్కిస్తుంది. చలదళము వలె చపలమైన చర్మసౌందర్యము ఆకర్షితులైన వారి మరణానికి చలానా చెల్లిస్తుంది. చరమక్రియను నిర్వహిస్తుంది.

దేహము యొక్క సౌందర్యము అనిత్యమని అందరికీ తెలుసు. అయినా చర్మసౌందర్యానికి చిత్తము చిందులేస్తూనే ఉంటుంది. మోహంలో పడి మునుగుతూనే ఉంటుంది. ఇదే మాయా మోహము. ఆ మాయామోహమే ఈ మాయామృగము. అదే రాక్షసమాయ. మాయారూపుడైన మారీచుని మాయ.

శ్మశానంలో చిటపటమంటూ పగిలిపోయే చర్మంలో సౌందర్య ముందా? అట్టి చర్మాన్ని ధరించిన దేహములో సుఖముందా? ఎంత సుందరమైన దేహమైనా నది సముద్రాన్ని చేరినట్లు శ్మశానాన్ని చేరాల్సిందే.

**పిబన్తి పాంసవో రక్తం క్రవ్యాదా శ్చాప్యనేకశః**
**చర్మాణి చ శివా భుంక్తే ఖం యాన్తి ప్రాణవాయవః**

"మట్టి రక్తాన్ని పీల్చేస్తుంది. మాంసాన్ని శునకాదులు భక్షిస్తాయి. చర్మాన్ని నక్కలు ఒలిచి తింటాయి. ప్రాణాలు గాలిలో తేలిపోతాయి."

ఇలాంటి క్షణికమైన దేహసౌందర్యము పై భ్రాంతి దేనికి? నీటి బుడగ లాంటి చర్మ సౌందర్యముపై మోహ మెందుకు? మోహం నశిస్తే ఆకర్షణే లేదు. ఆకర్షణ అదృశ్యమైతే ప్రపంచమే లేదు. ప్రపంచం మనసులో అదృశ్యమైన వానికి దుఃఖ మెక్కడుంటుంది? దుఃఖం పోవాలని అందరూ పరితపిస్తారు గాని దుఃఖకారణమైన మోహాన్ని తొలగించుకో రెందుకనో?

**మోహ ఏవ మహామృత్యుః ముముక్షో ర్వపు రాదిషు**

"ముముక్షువైన వానికి దేహముపై మోహము మృత్యువుతో సమానము" అంటారు వివేకచూడామణిలో శంకరాచార్యులవారు.

మృగచర్మాన్ని చూసి సీతమ్మ మోహానికి గురైంది. తన చర్మసౌందర్యం రాక్షసుడైన రావణుని మోహానికి గురిచేస్తుందని ఊహించలేక పోయింది. తాను కోరే వస్తువుపై దృష్టి నిలిపిందే గాని తనను కోరే వారిపై దృష్టిని ఎలా సారించగలదు?

నిత్యము కోరికల వలలో చిక్కి, చిక్కుముడుల మధ్య బయట పడలేక చిడివడే వారేగాని, కోరికల వలలో చిక్కకుండా తప్పించుకో గలవారు ఎందరుంటారు? దృశ్యాలలో లేని సౌందర్యాన్ని దర్శింపచేసేవి కోరికలే కదా!

**Our desire lends the colours of rainbow to the mere mists and vapours of life.**

"బ్రతుకు యొక్క ఆవిరికి, పొగమంచుకు హరివిల్లు రంగులను పులిమేది మన కోరికే కదూ!" అంటాడు "స్ట్రే బర్డ్స్"లో రవీంద్రనాథ్ ఠాకూరు.



ఒకప్రక్క కాంచనమృగము యొక్క చర్మసౌందర్యానికి సీతమ్మ మురిసిపోతుంటే, అదే సమయంలో మరో ప్రక్క చెట్టు మాటున సీతమ్మ సౌందర్యానికి పిచ్చివా డవుతున్నాడు రావణుడు.

ముందున్న అందాలు, ఆనందాలు కనిపిస్తాయే గాని, వెనుక పొంచియున్న వికారాలు, విషాదాలు తెలిసి వస్తాయా? ముందున్న బ్రతుకు పల్లకీలో ఎక్కి ఊరేగాలని ఉబలాట పడేవారే గాని, తనను ఎక్కించుకొని వల్లకాటికి మోసుక పోయేందుకు వెనుక కదలి వస్తున్న పాడెను తిరిగి చూసే వారెవరు? ఇదే భ్రాంతి. ఇదే మోహం. ఇదే మాయ ప్రదర్శించే మహేంద్రజాలం.

అందమైన లేడితో ఆడుకోవాలని సీతమ్మ ఉబలాట పడుతోంది. సీతమ్మ బ్రతుకుతోనే ఆడుకోవాలని రావణుడు ఆరాట పడుతున్నాడు. లేడి రూపంలో వచ్చినవాడు మారీచుడేనని లక్ష్మణుడు చెప్తున్నాడు. లక్ష్మణుని మంచిమాట సీతమ్మకు రుచించలేదు. రామునికి ఎదురు నిలవడం మృత్యువును ఆహ్వానించడమే అని మారీచుడు రావణునికి పదే పదే చెప్పాడు. కానీ మారీచుని హితవచనం రావణుడికి ప్రియంగా తోచలేదు.

లక్ష్మణుని నివారించి, మాయలేడిని కాంక్షించి, రామునికి దూరమౌతుంది సీతమ్మ. మారీచుని నివారించి, జానకిని వాంఛించి, ప్రాణాలకు దూరమౌతాడు రావణుడు. చేయ కూడని ఆలోచనలు చేసేవారు చేరకూడని ప్రదేశాలకు చేరుతారు.

అకళంక మైన వైదేహి లంకకు చేరి దుఃఖిస్తుంది. నిష్కంటకంగా పాలించిన రావణుడు శ్మశానానికి చేరి నశిస్తాడు. అనిత్యాల వెంట పరుగెత్తేవారు అగచాట్లకు గురి కాకపోరు.

అంతేకాదు. కొందరి వెతలు మరికొందరికి వెలుగులుగా మిగుల్తాయి. కొందరి ఏడుపులు మరికొందరికి వేడుకలుగా తెలుస్తాయి.

మారీచుడు మనోహరంగా గోచరిస్తున్నా, అతని మనసులో కొండంత విచారం దాగి ఉంది. రాముని చేతిలో ఏ క్షణాన హతుడు కావలసి వస్తుందోనని మారీచుడు భయ భ్రాంతులకు లోనై, ప్రాణాల్ని గుప్పిట్లో పెట్టుకొని చంచలమైన దృక్కులతో అటు ఇటూ చూస్తూ బెదిరి పోతున్నాడు. కాకపోతే, ధరించిన రూపానికి ఈ బెదరుపాటు నూతన శోభ నిచ్చింది. మారీచుడు అలా విషాదంతో కుమిలిపోతుంటే, చెట్టుమాటు నుండి మాయారూపమైన మారీచ మృగము యొక్క అందాన్ని చూసి, ఈ అందానికి సీత తప్పక మోహితురా లవుతుందని రావణుడు సంబరపడి పోతున్నాడు. మారీచుని ఏడుపు రావణునికి వేడుకగా ఉంది.

పైడి లేడిని చూచి మోహానికి గురియైన సీతను జూచి రావణుడు సంతోషపడుతూ ఉంటే, సీత అందాన్ని చూచి పిచ్చివా డవుతున్న రావణుని చూసి దేవతలు సంతోషిస్తున్నారు.

సీత భ్రమించింది కనుక కార్యసిద్ధి లభించినట్లే అని రావణుడు తృప్తి చెందుతూ ఉంటే, రావణుడు మోహించాడు కనుక తమకు కూడా కార్యసిద్ధి ప్రాప్తించినట్లే నని దేవతలు సంతృప్తి చెందుతున్నారు.

ఒకవైపు రాక్షసమాయ ధగధగమంటూ మెరిసిపోతుంది. మరొకవైపు దైవమాయ జాజ్వల్య మానంగా జమాయిస్తోంది.

రాక్షసమాయలో మాయతో పాటు రాక్షసులందరూ నశిస్తారు. దైవమాయలో మాయాతెరలు తొలగిపోతాయి. భ్రాంతి పొరలు ఊడిపోతాయి. మహిమ వ్యక్త మవుతుంది. మహిలో శాంతి విండుతుంది.

**జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా**

"జనకుని వంశము నందు పుట్టిన జానకి రాక్షసులను మోహింప చేయుటకై సృష్టింప బడిన దేవమాయ వలె శోభించుచున్నది" అని శ్రీమద్రామాయణము బాలకాండ యందలి ప్రథమ సర్గలోనే వాల్మీకిమహర్షి సీతమ్మను వర్ణించి యున్నాడు.

వినాశకారులైన రాక్షసుల రాక్షసమాయతో కళ్యాణకరమైన దేవతల దైవమాయ చేయి కలిపి పోరాడేందుకు రంగం సిద్ధమైంది. జయాపజయాలు దైవనిర్ణయాలు. కాలాధీనాలు.

## వలపు పరచిన వల

సీతమ్మ రామునితో చెబుతోంది.

"నాథా! ఆ మృగాన్ని తెచ్చి నా కివ్వరాదా! చాలా ముద్దొస్తుంది కదా! చూడు చూడు. ఎంత నిర్భయంగా చరిస్తోందో! ఆకాశంలో చంద్రుడు విహరించునట్లు, చంచలమైన నేత్రాలు గల ఈ బుజ్జి జింక అరణ్యంలో హాయిగా చరిస్తోంది.

**అహో రూప మహో లక్ష్మీః స్వర సంపచ్చ శోభనా**
**మృగోఽద్భుతో విచిత్రాంగో హృదయం హరతీవ మే ॥**

"ఆహా! ఏమి రూపము! ఏమి సౌందర్యము! ఏమి ఆ గాత్ర మాధుర్యము! విచిత్ర దేహంతో ఆశ్చర్యకరంగా గోచరిస్తున్న ఈ పసిడిలేడి నా హృదయాన్ని అమాంతం దొంగిలించింది" అంటోంది సీతమ్మ.

ఈ ప్రపంచంలో ఏవి సౌందర్య రూపాలు? అనిత్యమైన జగత్తులో ఏది అందము? ఏది ఆనందము?

నశించేందుకే రూపాలు పుడుతున్నాయి. కాలరూప ప్రవాహంలో కొట్టుకొని పోయే రూపాలు ఒక కాలంలో మతాబుల కాంతి లాగా వెలిగి ఆరిపోతాయి. ఎండమావు ల్లాగా భ్రమను కల్పించి పారిపోతాయి. ఇవేనా అందమైన రూపాలు?

**యదంగ మధ్య సంవీతం కౌశేయ స్రగ్విలేపనైః**
**దిగంబరం తదేవ శ్వో దూరే విశరితాఽవటే ।**

"ఈనాడు ఏ దేహము పట్టువస్త్రాలతో, పూలమాలలతో, సుగంధ లేపనాలతో ప్రకాశిస్తూ వుందో అదే దేహము రేపు దిగంబరంగా ఒక మట్టి గుంటలో పడి క్రుళ్ళి నశిస్తూ వుంది;" అని యోగవాసిష్ఠము.

శ్రీరాముని శుభలక్షణుడని, సదా ప్రియదర్శనుడు అని వాల్మీకి బాలకాండములో వర్ణించి యున్నాడు. నిత్యుడైన రాముని రూప సౌందర్యమును ప్రక్కనే పెట్టుకొని అనిత్యమైన



స్వర్ణలేడి సౌందర్యానికి మురిసిపోతూ "ఏమి రూపము? ఏమి సౌందర్యము?" అంటూ పరవశిస్తోంది జానకి.

నిత్యసౌందర్యాన్ని విస్మరించి అనిత్యమైన అందాల వెనుక పరుగెత్తి అలసిపోవడం జీవలక్షణం. సీతమ్మ కూడా దానినే తక్షణ కర్తవ్యంగా భావిస్తోంది.

బోయవాడు పరచిన వలలో అమాయకంగా దిగుతాయి పక్షులు. తమకు తాముగా ఏర్పరచుకున్న వాంఛావలలో దూరి సతమత మవుతారు మానవులు. విలువలు తెలియని వలపులన్ని వలలే నని మరువకూడదు. నిత్యసౌందర్యాన్ని వాంఛించాలే గాని, ఆరిపోయే దీపాల వంటి రూపాల్ని చూసి "ఓహో - ఆహా" అంటూ పలవరించ కూడదు. ఈ పలవరింత లన్నీ చివరికి పరితాపాలే. ఈ కలవరింత లన్నీ చివరికి కన్నీళ్ళే.

రాముడు సీతమ్మకు చేరువలోనే ఉన్నాడు. కానీ హృదయంలో బంగారులేడి ప్రవేశించింది. అంతే. కోరికలన్నీ కాంచనమృగము వైపే కదలి పోయాయి. నిత్యుడైన రాముడు దగ్గరే ఉన్నా ఆ క్షణాన ఉపేక్షింప బడ్డాడు. హృదయంలో కోరికలు నశించగనే ఇప్పుడే, ఇక్కడే పరమాత్మను దర్శించగలం.

**యదా సర్వే ప్రముచ్యంతే కామా యే అస్య హృది శ్రితా**
**అథ మర్త్యో అమృతో భవతి అత్ర బ్రహ్మ సమశ్నుతే ॥**

"హృదయంలో నిక్షిప్తమై ఉన్న కోరికలన్నీ ఎప్పుడు నశిస్తాయో అప్పుడే మర్త్యుడైన మానవుడు అమృతు డవుతాడు. ఇహము నందే పరముము పొందుతాడు" అని కఠోపనిషత్తు ప్రవచించింది.

అనిత్యమైన సుఖాన్ని తెచ్చిపెట్టమని సీతమ్మ రాముని అర్థిస్తోంది. ఎలాగైనా పైడిలేడిని తెచ్చిపెట్ట మంటున్నది.

ఆలయాలలో, పూజా మందిరాలలో, పుణ్యక్షేత్రాలలో, సద్గురు సన్నిధిలో మనం కూడా బంగారు జింకను కోరిన సీతమ్మ పాత్రనే ధరిస్తూ ఉంటాం. కోరికల పొట్లాలు విప్పి భగవంతునికి నైవేద్యం సమర్పిస్తాము. వాంఛల వినతిపత్రాల్ని గురువుల ముందు పరుస్తాం. నిత్యవస్తువు లభించే పవిత్ర స్థలంలో అనిత్యవస్తువుల కొరకు ప్రాకులాడుతాం. సీతమ్మ కూడా అదే చేసింది. హరిని విడచి హరిణిని స్మరిస్తోంది.

సీతమ్మ రామప్రభువుతో చెబుతోంది.

"చూడండి.ఎలాగైనా ఈ మృగాన్ని సజీవంగా పట్టి తీసుకరండి. మన వనవాసము కూడా పూర్తయ్యే సమయం సమీపించింది. ఈ లేడిని మనం అయోధ్యకి తీసుకపోతాం. మన అంతఃపురానికి ఇది చాలా శోభాయమానంగా ఉంటుంది.

"ఇది అంతఃపురములో తిరుగుతూ వుంటే మీకు, నాకు, భరతునికి, అత్తలకు చాలా ఆనందం కల్గుతుంది. మరి తీసుకరారూ! ఎలాగైనా దీనిని అయోధ్యకు తీసుకపోవాలి;" అంటూ చెప్పుకపోతోంది సీతమ్మ.

తాము అయోధ్యను వదలి అరణ్యానికి రావడానికి ఏ కోరికలు ప్రధానపాత్ర వహించాయో, ఇపుడు ఆ కోరికల బండిలోనే కూర్చుని అయోధ్యకు పోవా లనుకుంటోంది జానకి.

పోయేది మాత్రం ఖాయమే. ఎందుకంటే కోరికలు కూర్చోనివ్వవు కదా! అయితే పోయేది ఎక్కడికి? అయోధ్యకు మాత్రం కాదు. లంకాపురికి. కోరికలు గలవారు వసించేది, వసించ వలసింది లంకలోనే కాని అయోధ్యలో కాదు. కోరికల సంతగోల అణగిన ప్రదేశమే అయోధ్య.

"నాథా! ఒకవేళ ఆ బంగారు జింక సజీవంగా లభించకపోతే దానిని వధించి అయినా తీసుకరండి. దాని చర్మము నాకు కావాలి. లేత పచ్చికలో దాని చర్మాన్ని పరచుకొని కూర్చోవాలని నాకు కుతూహలంగా ఉంది.

"భర్తను ఇలా నిర్బంధించి పంపడం స్త్రీలకు ధర్మం కాదని నాకు తెలుసు. కానీ ఆ లేడిని చూస్తూ వుంటే నాకు ఆశ్చర్యంగా ఉంది" అంటోంది సీతమ్మ.

అడగడం మంచిది కాదని సీతమ్మకు తెలుసు. ఆ విషయం ఆమే చెప్తూ వుంది. అయినా అడగక తప్పడం లేదు అంటోంది. ఉవ్వెత్తున లేచే వాంఛాకెరటాల్ని నిరోధించలేక పోతోంది.

ప్రభుత్వ కార్యాలయాల్లో జీతం కన్నా వేరుగా, మారుగా ఏదీ పుచ్చుకో కూడదని మనకు తెలుసు. అయినా కాగితం కనిపిస్తే చాలు. కనికరం లేకుండా కరము బల్ల క్రిందికి చేరు తుంది. ఆ క్షణంలో కదిలే చేతిని ఆపుకో గలిగితే చిత్తము చిగురించినట్లే.

బియ్యంలో రాళ్ళు కలప కూడదని మనకు తెలుసు. డబ్బు పెట్టి ఓట్లు కొనగూడదని తెలుసు. అలాగే డబ్బు పుచ్చుకొని ఓటు వేయకూడదని తెలుసు. మత్తుపానీయాలు మంచివి కావని తెలుసు. అన్నీ తెలుసు. ఏం లాభం? తెలిసింది మునగడానికి కాదు. తేలడానికి.

దుర్యోధనుని అదుపులో ఉంచుకోకపోతే కలిగే దుష్పరిణామాలను మహాభారతంలో విదురుడు ధృతరాష్ట్రునికి ఎంతో చక్కగా బోధిస్తాడు. సహేతుకంగా విదురుడు చెప్పిన బోధనంతా విన్న తరువాత ధృతరాష్ట్రుడు ఇలా అంటాడు.

**తే॥ నీవు చెప్పిన మాటలు నిర్మలములు**
**నిపుణ సమ్మతములు, రాజనీతి మార్గ**
**బోధకంబులు నైనను బుత్రు విడువ**
**నోవ 'ధర్మోజయతి' యని యుండువాడ.**

"విదురా! నీవు నిర్మలమైన వచనాలు పలికావు. పండితులు మెచ్చేవే పలికావు. రాజనీతిని నీ మాటలు చక్కగా బోధిస్తున్నాయి. అయినా నేను నా కొడుకు దుర్యోధనుని విడువలేను. 'ధర్మం జయిస్తుంది' అని అలా ఉండిపోతాను" అని ధృతరాష్ట్రుడు పలికిన విషయాన్ని ఉద్యోగపర్వంలో వివరిస్తాడు కవిబ్రహ్మ.

సీత పదేపదే కాంచన మృగాన్ని కాంక్షిస్తూ రామునితో పలుకుతుంటే ఆమె హృదయాన్ని గ్రహించిన ధర్మాత్ముడైన రాముడు లక్ష్మణునితో ఇలా పలికాడు.

"లక్ష్మణా! సీతకు ఈ మృగంపై ఎంత మక్కువో విన్నావు కదా! ఇలాంటి లేడి భూలోకంలో అరుదు అనే మాట మాత్రం సత్యం. అత్యంత ఆకర్షణీయంగా గోచరించే ఆ మృగాన్ని వాంఛించడం సహజమే.



"తమ్ముడూ! నీవు ఊహించినట్లు మోసగాడైన మారీచుడే ఈ రూపంలో వచ్చి యున్నట్లయితే ఇక ఆలస్య మెందుకు? గతంలో అనేకమంది మునులను పొట్ట పెట్టుకున్న ఈ మారీచుని వధించే సమయం ఆసన్నమైంది.

"ఇది నిజమైన మృగమైతే దానిని పట్టి గాని, లేదా చంపి గాని, దానిని తీసికొని వచ్చి సీతకు ఇస్తాను. ఒకవేళ మారీచుడే అయితే అగస్త్యుడు వాతాపిని జీర్ణం చేసినట్లు వీడ్ని అదృశ్యం చేస్తాను.

"లక్ష్మణా! నీవు ఆయుధపాణివై, సావధాన చిత్తముతో సీతను రక్షిస్తూ వుండు. ముఖ్యంగా సీత ఈ లేడి చర్మాన్నే అభిలషించింది కనుక ఇక ఈ మృగం జీవించదు. నేను త్వరగా తిరిగి వస్తాను. మీరిద్దరు ఏమరిపాటు లేకుండా ఉండండి.

"లక్ష్మణా! ఏ క్షణానయినా ఆపద రావచ్చు. ఏ వైపు నుండైనా రావచ్చు అనే భావనను మనసులో అవధరించు. సమర్థుడు, బలవంతుడు, బుద్ధిశాలి అయిన జటాయువును కూడా దగ్గరే ఉంచుకో. మీరిద్దరూ సీతను కనిపెట్టుకొని ఉండండి;" అని పలికి ఖడ్గమును నడుముకు కట్టుకొని, ధనుస్సును చేత పట్టుకొని, అంబులపొదులను కట్టుకొని మృగమును అనుసరించాడు రాముడు.

కాలం విచిత్రమైంది. ఒక్కోసారి చల్లగా సుఖ పవనాల్ని కదిలించి తృప్తి పరుస్తుంది. ఒక్కోసారి కష్టాల్ని వరద వెల్లువలా ప్రవహింప చేస్తుంది. కాలంలో ఎప్పుడు ఏమి జరుగుతుందో పరిమిత బుద్ధులు గల మనం ఊహించలేము.

ప్రతి విషయానికి ఆవేశపడే లక్ష్మణుడు ఎదురయ్యే ఆపదను ఊహించాడు. వెళ్ళవద్దని అన్నను వారించాడు.

ప్రతి చిన్న విషయాన్ని కూడా రెండుసార్లు ఆలోచించే రాముడు సీతమ్మ కోర్కెను తీర్చాలనే నిశ్చయంతో సందేహిస్తూనే వెళ్ళాడు.

ఎప్పుడూ, ఏదీ కోరని సీతమ్మ ఈనాడు పైడిలేడిని కోరింది. కోరడమే కాదు. చిన్న బిడ్డలాగే మారాం చేసింది.

ఆపదల్లో ఆలోచనలు కూడా తారుమా రవుతాయా? రాబోయే ఇడుములు ముందు గానే తమ ఛాయల్ని మనసులపై పరుస్తాయా? లేకపోతే రాముని ఛాయలా అనుసరించే సీతమ్మతల్లి కోరి రాముని దూరం చేసుకుంటుందా?

ఇంతకాలం కానల్లో జీవించారు. ఇకమీదట కష్టాల్లో జీవించాలా?

కెరటాలు లేని కడలి ఉంటుందా? బాధలు లేని బ్రతుకుంటుందా? కెరటాల్ని చూసి కలత చెందనవసరం లేదు. బాధల్ని చూసి భయపడాల్సిందీ లేదు.

**Troubles are often the tools by which God fashions us for better things.**

"మనల్ని ఉన్నతులుగా తీర్చిదిద్దటానికి తరుచుగా భగవంతుడు కష్టాల్నే పనిముట్లుగా స్వీకరిస్తూ ఉంటాడు;" అన్న ఆంగ్లకవి సూక్తి సీతారామలక్ష్మణుల విషయంలో ఎంతవరకు సముచితమో!

# మారీచుని మరణం

రాముడు మృగాన్ని తరుముతూ అరణ్యంలో ప్రవేశించాడు. అది రాముణ్ణి చూసి పరుగెత్తింది. రాముడు దాని వెంట బడ్డాడు. ఒక క్షణంలో దగ్గరే ఉన్నట్లు కన్పిస్తుంది. మరోక్షణంలో చాలా దూరం వెళ్ళినట్లు అగుపిస్తుంది.

ఒక క్షణంలో భయంతో ఆకాశానికి ఎగిరినట్లు గోచరిస్తుంది. రాముడు మాత్రం లేడి ఎలా వెళ్తూవుంటే అలా అనుసరించి వెళ్ళాడు. దగ్గరున్నట్లే ఉంటుంది. క్షణంలో మాయమై దూరంగా కన్పిస్తోంది. ఈవిధమైన మాయలతో రాముని అరణ్యమధ్యానికి తీసుకొని పోతూవుంది.

**ఛిన్నాభ్రైరివ సంవీతం శారదం చంద్ర మండలమ్**
**ముహూర్తాదేవ దదృశే ముహుర్దూరా త్ప్రకాశతే ॥**

"మేఘ ఖండాల వెనుకనున్న శరత్కాలపు పూర్ణచంద్రునివలె ఆ మాయజింక అరణ్యములో కనబడి కనబడకుండా ఉంది. ఒక క్షణంలో కనిపించి మరొక క్షణంలో దూరంగా కన్పిస్తూ ఉంది."

పొదల మాటున దాగి, చెట్ల వెనుక పొంచి పొంచి కనిపించీ కనిపించక, దగ్గరుంటూ దూరంగా తెలిసే ఆ మాయలేడి యొక్క గమనాన్ని మబ్బుతునకల వెనుక భాసించే శరత్కాలపు చంద్రమండలముతో పోల్చాడు వాల్మీకి. అద్వైత సిద్ధాంతములోని మాయావాదాన్ని సున్నితంగా స్పృశించాడు వాల్మీకి.

మాయలేడి భూమిపై ఆడే దాగుడుమూతలు ఆకాశంలో మబ్బుల మాటున కదిలే చంద్రబింబము వలె ఉంది అంటాడు వాల్మీకిమహర్షి.

శరత్కాలములో జలభారము తగ్గుట చేత మేఘాలు తొందర తొందరగా పరుగిడుతుంటాయి. రాముడు శరప్రయోగం చేసే సమయం కూడా సమీపించింది కనుక వయోభారము తగ్గి లేడి యొక్క ప్రాణాలు శరత్కాల మేఘాల్లాగా తొందరగా పయనిస్తున్నాయి.

చంద్రునిలో లేడి ఉన్నదని పలుకుతుంటాము. వాస్తవానికి అలాంటిదేదీ చంద్రుని యందు లేదు. లేకనే ఉన్నట్లు గోచరిస్తున్నది. అదే మాయ. అలాగే ఏ పసిడిలేడి రామునికి కనిపించీ కనిపించక, దగ్గరగా తెలుస్తూ దూరాన గోచరిస్తున్నదో ఆ లేడి వాస్తవానికి లేనిది. అది మారీచుని మాయయే గాని నిజమైన కాంచనమృగము కాదు.

**దృశ్యతేఽభ్రేషు ధావత్సు ధావన్నివ యథా శశీ**

ఆకాశమున మేఘములు కదుల్తూ వుంటే చంద్రుడు కదులుతున్నట్లు గోచరిస్తుంది. చలనము లేని చోట చలనమును గాంచుటయే మాయ అని ఆదిశంకరుల వారు తమ 'ఆత్మబోధ' ప్రకరణ గ్రంథములో తెలిపారు.

మాయామృగము రాముని మభ్యపెడుతూ చాలా దూరం తీసికొని వెళ్ళింది. రాముడు క్రుద్ధుడయ్యాడు. అలసిపోయిన రాముడు కొంచెం సేపు పచ్చిక మీద కూర్చున్నాడు.



ఈలోగా మళ్ళీ మృగముల గుంపులో మాయలేడి కన్పించింది. రాముడు లేచేసరికి భయాన్ని అభినయిస్తూ పరుగెత్తి పోయింది. కొంతసేపటికి దూరంగా చెట్ల మధ్యనుండి వస్తున్న పైడిలేడి రాముని కంటబడింది. ఇక దానిని వధించాలని రాముడు నిర్ణయించుకున్నాడు.

తీక్ష్ణమైన బాణమును తీసి ధనుస్సుపై ఎక్కుపెట్టి బలంగా లాగాడు. ఆయాసంలో సర్పంలాగా బుసలు కొడుతున్న మృగంపై అగ్ని లాగా మండుతున్న అస్త్రం ప్రయోగించాడు రాముడు. వజ్రాయుధము వంటి ఆ బాణము మృగదేహంలో ప్రవేశించి మారీచుని గుండెను చీల్చేసింది.

ఆ శరఘాతానికి మాయలేడి తాటిచెట్టు ఎత్తుకు ఎగిరి క్రిందపడింది. మృగరూపము పోయింది. నిజరూపం వచ్చింది. వెంటనే రాక్షసుడైన మారీచుడు గొంతుమార్చి, రాముని కంఠధ్వనితో "అయ్యో! సీతా!, అయ్యో! లక్ష్మణా!" అంటూ గట్టిగా అరచి ప్రాణాలు విడిచాడు.

మారీచుడు మరణించాడు. రాముని చేతిలో మరణించడం విశేషం. అది అతని పుణ్యం. మరి అంతటి పుణ్యాత్ముడు ప్రాణం పోయేటప్పుడు "అయ్యో! సీతా! అయ్యో! లక్ష్మణా!" అన్నాడే కాని రాముడు ప్రత్యక్షంగా దర్శనమిస్తున్నాడు కదా! 'రామ-రామ' అంటూ ప్రాణాలు వదలలేక పోయాడుకదా!

**అన్తకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః**

"మరణకాలమున ఎవడైతే నన్నే స్మరిస్తూ దేహాన్ని త్యజిస్తున్నాడో, అట్టివాడు విప్పం దేహముగా నన్నే పొందుతున్నాడు" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత-అక్షరపరబ్రహ్మ యోగములో తెలిపియున్నాడు.

మారీచుడు భక్తుడే అయితే అంత్యకాలంలో రామనామం పలికి పరమాత్మను పొందవచ్చును గదా! సీతాలక్ష్మణుల పేర్లు ఎందుకు పలికాడు? సాధారణంగా అంత్యకాలంలో ఎక్కువమంది అపస్మారకంగానే ఉంటారు. స్మృతిజ్ఞానం లేకుండా ఉంటారు. మతి చలించి ఉంటారు. మాటను కదలించక పోతారు. అందుచేతనే నామస్మరణకు మృత్యుకాలం పై ఆధారపడకుండా జీవితకాలం లోనే స్మరించి తరించాలని భక్తులు భావిస్తూ ఉంటారు. జీవిస్తూ ఉంటారు.

**కృష్ణ త్వదీయ పదపంకజ పంజరాంత**
**మద్యైవ మే విశతు మానస రాజహంసః**
**ప్రాణ ప్రయాణ సమయే కఫవాత పిత్తైః**
**కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే ॥**

"కృష్ణా! నా మనసు అనే రాజహంస నీ చరణకమలములు అనే పంజరంలోకి ఇప్పుడే ప్రవేశించు గాక! ప్రాణము శరీరాన్ని వదలిపెట్టి పోవు సమయంలో కఫ వాత పిత్తముల చేత కంఠము మూసికొని పోతూ ఉండగా నిన్ను స్మరించుట సాధ్యమా?" అని భక్త కవిశేఖరుడైన కులశేఖరుడు తన "ముకుందమాల* " గ్రంథంలో రచించాడు.

* వివరాలకు ఆశ్రమప్రచురణ "ముకుందమాల" గ్రంథములో 8వ శ్లోకంపై స్వామీజీ వ్యాఖ్యానము అనుసరణీయము.

మారీచునికి కఫ వాత పిత్తాలు అడ్డుపడలేదు. రామనామం పలకలేక పోయాడు పరిగదా, సీతాలక్ష్మణుల పేర్లను పెద్దగా అరచి రామునికి గడ్డు సమస్యను సృష్టించి మరీ వెళ్ళాడు.

మారీచుడు జీవించి యున్నప్పుడు వాడి మాయలు ఎలా అవగతం కాలేక పోయాయో, మరణించిన తరువాత కూడా వాడి ఆంతర్య మర్మాలు వెల్లడి కాకుండా పోయాయి. నా బుద్ధికి అందిన దాన్ని మీ బుద్ధికి బరువు కాకుండా అందించి ముందుకు సాగిపోతాను.

మారీచుడు రాక్షసుడు. మునులను చంపి, వారి మాంసాన్ని భక్షిస్తూ జీవిస్తుండేవాడు. సిద్ధాశ్రమ పరిసరాల్లో రామబాణం యొక్క రుచిని ప్రత్యక్షంగాను, దండకారణ్యంలో పంచవటీ ప్రాంతంలో పరోక్షంగాను అనుభవించినవాడు.

ఆనాటి నుండి ఎందుకో అతనిలో మార్పు వచ్చింది. దుష్టకర్మలు మాని, తాపసవృత్తిలో ప్రవేశించాడు. తెలిసో తెలియకో, భక్తితోనో భయంతోనో రాముని సర్వత్ర దర్శించే భాగ్యానికి నోచుకున్నాడు.

సాధనలో సోపానక్రమంగా సాగిపోతున్న దశలో దారుణమైన విఘ్నముగా రావణుడు ప్రవేశించాడు. సాధన పక్కానికి రాని దశలో రావణుని అనుసరించి పంచవటికి చేరవలసి వచ్చింది. ప్రాణప్రయాణ సమయంలో రామనామం పలికే టంతటి సంస్కారాన్ని ఇంకా కూడ గట్టుకో లేదేమో!

**సాధిభూతాధి దైవమ్ మామ్ సాధి యజ్ఞం చ యే విదుః**
**ప్రయాణ కాలేపి చ మామ్ తే విదుర్యుక్త చేతసః**

"అధిభూత, అధిదైవ, అధియజ్ఞములును నేనే అని ఎవరు గ్రహించుచున్నారో అట్టివారు మరణకాలమున మనోనియమము కలవారై నన్ను తెలుసుకుంటారు" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత-విజ్ఞానయోగములో తెలిపియున్నారు.

బహుశ మారీచుడు ఈ స్థితికి చేరనివాడు కావచ్చు కదా! మరికొంత కాలము సాధనలో కొనసాగి ఉంటే తప్పక ఆ స్థితికి చేరి ఉండేవాడేమో?

ఈలోగా రావణుడు మృత్యువులా మారీచుని జీవితంలో ప్రవేశించాడు. చెడు చేసిన రోజుల్లో అది తప్పని వారించిన వారెవ్వరూ లేరు. తాపసవృత్తిలో ప్రవేశించిన తరువాత బలవంతంగా మళ్ళీ చెడ్డమార్గం లోకి మారీచుని దింపాడు రావణుడు.

చెడును విస్మరించి, సన్మార్గములో చరించాలని ప్రయత్నించే వారిని కల్లబొల్లి మాటలతో వెనుకకు మరల్చేవారు ఎవరో కాదు. రావణులే. అట్టి వారిని అనుసరిస్తే మారీచునికి పట్టిన గతే పడుతుంది.

**ఆత్మబంధువులారా!**

పుణ్యాత్ముడైన మారీచుని జీవితం ద్వారా మనం గ్రహించవలసిన సాధన సామగ్రిని పేకరించుకున్నాం. ఇపుడు మహాత్ముడైన మారీచుని భక్తి సరోవరంలో గ్రుంకులిడి పునీతు లగుటకు మిమ్మల్ని కొన్ని నిముషాలు ప్రధానస్రవంతి నుండి దారి మళ్ళిస్తున్నాను. మీతోపాటు నేను కూడా నా భాగ్యానికి పరవశిస్తూ రామచరితమానసం లోకి దిగుతున్నాను.



సీతమ్మ బంగారు జింకను అభిలషించింది. మారీచుడే మాయలేడి రూపంలో ఉన్నట్లు లక్ష్మణుడు సందేహించాడు కూడా. సీతమ్మకు కావలసింది ఆ జింకయే. దాని అందమైన చర్మమే. అలాంటప్పుడు లేడిని పట్టి తెమ్మని రాముడు లక్ష్మణుని పంపి ఉండవచ్చు కదా? తానే ఎందుకు వెళ్ళాలి? ఈ కోణం నుండి తులసీదాస్ కలం కదిలింది.

దండకారణ్యానికి రావణునితో కూడి బయలుదేరేటప్పుడు మారీచుడు ఇలా భావించా డంటాడు తులసీదాస్.

"ఈరోజెంత సుదినము! నా కళ్ళారా శ్రీరాముని ముఖారవిందాన్ని చూచి తరించే భాగ్యానికి నోచుకుంటున్నాను. సీతారామలక్ష్మణుల చరణారవింద దర్శనం నాకు లభిస్తోంది.

"సుఖసాగరుడైన పరమాత్మ బాణాన్ని ప్రయోగించి నేడు నన్ను సంహరిస్తాడు. నా జన్మ సఫలమౌతుంది. ఇంతకంటే భాగ్యమేముంది?

**మమ పాఛే ధర్ ధావత్ ధనేం సరాసన బాన్**
**ఫిరి ఫిరి ప్రభుహి బిలోకి హౌ॰ ధన్య న మో సమ ఆన ॥**

"ఆహా! నేడు నా రాముడు ధనుర్బాణాలు ధరించి, నా వెంట పరుగెత్తుతాడు. మాటిమాటికి నేను వెనుదిరిగి రాముని చూస్తూ పరుగెత్తుతాను. నావంటి ధన్యుడెవరు? నా జన్మ ధన్య మౌతుంది" అని దండకారణ్యానికి బయలుదేరే ముందే మారీచుడు భావించాడు అంటాడు తులసీ.

రామ రూపాన్ని నేత్రాలతో దర్శిస్తూ, రామనామాన్ని నాలుకపై ధరించి, రామబాణంతో రాలిపోవాలని భక్తుడైన మారీచుడు భావించినపుడు రాముడు లేడిని పట్టి తెమ్మని లక్ష్మణుని ఎలా పంపుతాడు? అందుకే తాను వెళ్ళాడు. మారీచుని తరింప చేయుటకు తరలి వెళ్ళాడు తారకరాముడు.

రాముని చేతిలో మరణిస్తే తన జన్మ ధన్య మౌతుంది అని మారీచుడు భావించాడు. తులసీ ప్రకటించిన ఈ అభిప్రాయంతో ఏకనాథస్వామి కూడా శ్రుతి కలుపుతాడు.

**శ్రీరామాచా నిజబాణ । జ్యాసీలాగె తో న భాగ్యపూర్ణ్**
**బాణ నవ్హే హా ఆనంద ధన్ ! సుఖ సంపన్న శ్రీరామే**

"రామబాణం ఎవరిని స్పృశిస్తుందో వాడు పరిపూర్ణ భాగ్యవంతుడు. వాడి విషయంలో అది శరము కాదు. ఆనందప్రదమైన సంపద. శ్రీరాముని వలన వాడు నిరవధిక సుఖాన్ని పొందుతాడు" అని మారీచుడు భావించినట్లు మరాఠీ భాషలో భావార్థ రామాయణాన్ని రచించిన ఏకనాథ్ మహరాజ్ అంటాడు.

రాముడు మాయలేడిని వెంటబడి తరుముతున్నాడు. మారీచుడు పరుగెత్తుతూ, మధ్యమధ్యన వెనుదిరిగి రాముని దర్శిస్తూ వున్నాడు. జీవన ప్రయాణంలో మనం ఎక్కడ ఎలా చరిస్తున్నా మన వెంట పరమాత్మ ఉండేలా చూసుకోవాలి. ఎవరి మనస్సులో పరమాత్మ సుప్రతిష్ఠుడై ఉంటాడో అట్టి వారిని సదా అనుసరిస్తూనే ఉంటాడు.

**నిగమ నేతి సివ ధ్యాన్ న పావా! మాయామృగ పాఛే సో ఇ ధావా !**

"వేదములు ఏ పరంధాముని "ఇది కాదు-ఇది కాదు" (నేతి-నేతి) అనే వాక్యాల ద్వారా నిర్వచించాయో, ఏ పరమాత్మ లోతును పరమశివుడు కూడా ధ్యానించి తెలుసుకో లేకపోయాడో అట్టి జగద్రక్షకుడైన పరమాత్మ మాయామృగము యొక్క రూపమును ధరించిన మారీచుని వెంబడించి నడవడం కాదు, పరుగెత్తుతున్నాడు" అంటాడు తులసీదాస్.

వ[illegible] చనిపోతూ, "హా సీతా-హా లక్ష్మణా" అని అరిచాడు కదా! 'రామా' అంటూ ఎందుక మరణించలేక పోయాడు?

మారీచుడు లోకానికి మేలు జరగాలని భావించి బాహ్యానికి సీతాలక్ష్మణుల పేర్లు పలికాడు. తనకు మేలు జరగాలని చింతించి ఆంతర్యంలో 'రామ-రామ' అని స్మరిస్తూ ప్రాణం వదిలాడు.

సరే. ఇదీ బాగానే వుంది. లోకకళ్యాణార్థము సీతాలక్ష్మణులను పేర్లు పెట్టి పిలిచాడు మారీచుడు. పోనీ, ఆ తరువాతైనా 'రామా' అని ఒక్కసారి కూడా పలికినట్లు లేదే? అనే సందియము రావచ్చు. అలా పైకి రామనామాన్ని పలక కూడదని మారీచుడే అభిప్రాయ పడ్డాడట. మారీచుడు తనలో తాను ఇలా భాషించుకుంటాడు.

"రాముని చేతిలో మరణించాలని నేను భావించాను. నన్ను తృప్తిపరచాలని నా ప్రభువు ధనుర్బాణాలు ధరించి నా వెంట పడ్డాడు. నేను మరణించేటప్పుడు "రామా" అని బిగ్గరగా అరవను. దానివల్ల నా రామప్రభువుకు అపఖ్యాతి వస్తుందేమో! లోకాపవాదానికి రాముడు గురి కావలసి వస్తుందేమో! చూశారా! రామనామము పలుకుతున్న మారీచుని రాముడు వధించాడు అని భావశూన్యులు రాముని విమర్శిస్తారేమో!

"నా భక్తి బహిరంగం కావలసిన పనేముంది? నా భక్తి నా కొరకే. అందువల్ల నేను ఆంతర్యంలో రాముణ్ణి స్మరిస్తూ, రామనామాన్ని కీర్తిస్తూ మరణిస్తాను" అని మారీచుడు అభిప్రాయ పడ్డాడట.

'అట; ఇట' అంటా ఎటకో పట్టుకపోతుంది భక్తి. జ్ఞానము సూటియైన దారి. భక్తి సున్నితమైన దారి. ఎలా కావాలంటే అలా మలచ బడుతుంది. మర్మాలు, మార్గాలు తెలిపి ముక్తిని ప్రసాదిస్తుంది.

**అంతర్ ప్రేము తాసు పహిచానా! ముని దుర్లభ గతి దీన్హి సుజానా!**

"మారీచుని హృదయంలో స్పందించిన ప్రేమభక్తిని గుర్తించిన రామప్రభువు మహర్షులకు దుర్లభమైన సద్గతిని మారీచునికి ప్రసాదించాడు" అని మారీచుని మహిమను చివరగా కీర్తించాడు తులసీదాస్.

రాక్షసుడై పుట్టినా, రాక్షసుడుగా పెరిగినా, చివరికి భక్తుడై రాముని బాణానికి నేల రాలాడు ధన్యాత్ముడైన మారీచుడు.

ఇక వాల్మీకి వద్దకు పోదాం.



# విధివిన్యాసం - ధర్మసంకటం

"అయ్యో! సీతా!, అయ్యో! లక్ష్మణా!" అంటూ మారీచుడు బిగ్గరగా అరచాడు. నేలపై బడి రక్తపుమడుగులో దొర్లుతున్న మారీచుని రాముడు చూశాడు. లక్ష్మణుని సందేహ వాక్యాలు స్మృతిలో మెదిలాయి. మారీచుని కేకలు వినగానే రాముడు గగుర్పాటుతో చలించిపోయాడు.

మారీచుడు తన కంఠధ్వనిని అనుకరించాడు. సీత లక్ష్మణుని తన కొరకు పంపితే లక్ష్మణుడు వచ్చేస్తాడేమో! లక్ష్మణుడు దూరం కాగానే రాక్షసులు సీతను సమీపించి ఏ కీడు తలపెడతారో అని రాముడు భయాందోళనలతో కలత చెందాడు. ఆశ్రమానికి తిరిగి ప్రయాణ మయ్యాడు. ఆశ్రమానికి రాముడు చాలా దూరంలో ఉన్నాడు.

రాముని దీనస్వరము సీతాలక్ష్మణులకు వినిపించింది. సీతకు మనసు మనసుగా లేదు. అంతా ఆందోళనే. అంతా ఆవేదనే.

"లక్ష్మణా! మీ అన్న అరుపు వినిపించిందా? నాయనా! రామునికి ఏదో ప్రమాదం వాటిల్లిందని నా మనసు శంకిస్తోంది. నా ప్రాణాలు నిలిచేలా లేవు. నా హృదయం బ్రద్దలయ్యేలా ఉంది.

"నాయనా! రాక్షసులు మీ అన్నను చుట్టుముట్టారేమో? వృషభము సింహాల మధ్య చిక్కినట్లు నా రాముడు రాక్షసులకు చిక్కిపోయాడేమో! తొందరగా వెళ్ళు. లక్ష్మణా! ఏమైనదో తెలుసుకో;" అన్నది సీతమ్మ.

సీతమ్మ అలా పలికినా లక్ష్మణుడు చలించలేదు. అన్నగారి ఆజ్ఞను మనసులో ధరించి నిలబడ్డాడు లక్ష్మణుడు. సీతమ్మ క్రుద్ధురా లైంది. లక్ష్మణునితో ఇలా పలికింది.

"లక్ష్మణా! రాముడు కష్టాల్లో చిక్కుకున్నాడని స్పష్టంగా తెలుస్తోంది. అయినా రామునికి సహాయంగా వెళ్ళాలని, రాముణ్ణి రక్షించాలని నీకు అనిపించడం లేదు. ఎంతో స్థిమితంగా కనిపిస్తున్నావు.

"రామునికి కష్టాలు సంభవించాలనే నీవు మనసులో కోరుకుంటున్నావు. సోదరునిపై నీకు ప్రేమ లేదు. నీవు చూపే ప్రేమంతా బూటకం. నీవు చేసే సేవంతా నాటకం. అందుకే రాముడు కనిపించక పోయినా నీవు హాయిగా కన్పిస్తున్నావు.

"లక్ష్మణా! నువ్వు రాముని వద్దకు ఎందుకు వెళ్ళడం లేదో నాకు తెలుసు. నీ మనసులో ఏముందో నేను పసిగట్టాను. పాపీ! దుష్టుడా! నామీద నీ కన్ను పడింది. నాపై మోహాన్ని పెంచుకొని రాముణ్ణి మోనం చేయాలని చూస్తున్నావు.

"నువ్వు ఎవరికోసం అడవికి వచ్చావు? రాముని కొరకు వచ్చిందే సత్య మయితే, రాముడు ప్రాణాపాయ స్థితిలో ఉండేటప్పుడు ఇక్కడ నాతో నీకేం పని? నీ ముఖ్యకర్తవ్య మేమిటి? రాముణ్ణి రక్షించడమా? నాకు తోడు కావడమా?" అంటూ ఆడజింక వలె భయభ్రాంతులకు లోనై కన్నీళ్ళు కార్చుతూ సీతమ్మ రోదిస్తూ ఉంది.

వినలేని, వినరాని మాటలు వినే సరికి లక్ష్మణుడు విచలిత మనస్కు డయ్యాడు. తన చెవుల్ని తానే నమ్మలేక పోయాడు. ఇది కలా! నిజమా! అని సందేహించాడు. బాధతో కుంచుకు పోయిన చిత్తాన్ని సవరించుకొని సీతమ్మను ఓదార్చుతూ ఇలా పలికాడు.

"వదినా! నీ భర్త సామాన్యుడు కాడు. ఆయనను ఎదిరించే శక్తి ముల్లోకాలలో ఎవరికీ లేదు. దేవతలు గాని, గంధర్వులు గాని, అసురులు గాని, పన్నగులు గాని రాముని జయించే శక్తి కలవారు కారు. ఈ విషయంలో సందేహించ వలసింది లేదు.

"నీవు కంగారు పడకు. రాముని అసమాన పరాక్రమం నాకు తెలియనిది కాదు. యుద్ధంలో రాముణ్ణి ఎదిరించేవారు లేరు. నీవు ఇలా మాట్లాడడం మంచిది కాదు.

"అన్న ఆజ్ఞను నేను పాటించాలి. రాముడు చెప్పింది చేయడమే నా ధర్మం. నిన్ను ఒంటరిగా ఈ అరణ్యంలో వదలి వెళ్ళడం నాకిష్టం లేదు. తల్లీ! నా మాట విను. దుఃఖాన్ని ఆపుకో. అనవసరంగా కలత చెందకు. మృగాన్ని చంపి రాముడు తొందరగా వస్తాడు.

"వదినా! మనకు వినిపించింది రాముని కంఠం కాదు. అది మాయకేక. అదంతా రాక్షసమాయ అని నాకు తెలుసు. ఇంద్రజాలికుడు చూపే గంధర్వనగరం లాగా ఇదంతా మాయావి యైన రాక్షసుడు ఆ మారీచుని పన్నాగమే.

"జనస్థానంలో ఖరదూషణులను వధించిన నాటినుండి రాక్షసులు మనపై పగబూని ఉన్నారు. హింసకు అలవాటుపడిన ఈ రాక్షసులు విచిత్రమైన అరుపులు వినిపిస్తూ ఉంటారు. దీనికి నీవు భయపడ కూడదు.

"నిన్ను రక్షిస్తూ ఉండమని అన్న చెప్పి వెళ్ళాడు. సావధాన చిత్తంతో ఉండమని, ఆపదను ఊహిస్తూ నిన్ను కాపాడమని మరీ మరీ చెప్పి వెళ్ళాడు. నీవు ఒంటరి దానవు. నిన్ను ఈ పరిస్థితుల్లో విడిచి వెళ్ళడం నాకిష్టం లేదు" అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణుని మాటలు విని సీతమ్మ క్రుద్ధురా లైంది. నేత్రాలు ఎర్రబడ్డాయి. పెదవులు వణకుతున్నాయి. శరీరం కంపించింది. లక్ష్మణునితో ఇలా పరుషంగా మాట్లాడింది సీతమ్మ.

"ఓరీ క్రూరుడా! కులపాంసనుడా! ఎంత సాహసానికి ఒడిగట్టావురా! నీ మాటలు ఎవరు నమ్ముతారు? రాముడికి కష్టాలు రావడమే నీకు సుఖం. అదే నీ అభిమతం. రాముడు అపాయంలో చిక్కినాడని తెలిసే నీవు ఇలా పేలుతున్నావు.

"నీచుడా! నీ కుట్ర ఏమిటో నాకు తెలుసు. అన్న - ఆజ్ఞ అంటూ మా బ్రతుకుల్ని సర్వనాశనం చేయాలని చూస్తున్నావు. నీవంటి క్రూరాత్ములైన దాయాదులకు ఇలాంటి పన్నాగాలు సహజమేలే.

**శ్రీరామ సన్నిధ్ దేఖోనీ మ్హణసీ జానకీ మార్ఝీ జననీ**
**శ్రీరామ రాక్షసీ వధిలియా వనీ సీతాపత్నీ కరూ పాహసీ**

"శ్రీరాముని సన్నిధిలో జానకి మా అమ్మ అంటావు. రాముణ్ణి రాక్షసులు వధిస్తే సీతను భార్యగా చేసుకోవాలని చూస్తున్నావు;"అని ఏకనాథ్ విరచిత భావార్థ రామాయణము.

"లక్ష్మణా! దుష్టుడా! నీవు రామునితో కూడా అరణ్యానికి ఎందుకు వచ్చావో ఇప్పుడు తేటతెల్ల మైంది. నీవు వచ్చింది రాముని కోసం కాదు. నాకోసమే వచ్చావు. రాముణ్ణి అడ్డు



తొలగించి నన్ను అపహరించాలని చూస్తున్నావు. దీని వెనుక భరతుని హస్తం కూడా ఉంటుంది.

"ధర్మాత్ముడైన రామునికి ఎలాంటి క్రూరాత్ములు సోదరు లయ్యారు! అమాయకుడైన నా రాముణ్ణి మీరంతా ఒక పథకం ప్రకారం మోసం చేశారు. త్రాచుపాము ల్లాంటి మిమ్మల్ని నమ్మి మా గోతుల్ని మేమే తవ్వుకున్నాం.

"కానీ, ఓరీ పాపీ! చెప్తున్నా విను. భరతుని పథకం, నీ పన్నాగం నా దగ్గర సాగవు. ఇందీవరశ్యాముని, కమలాక్షుని భర్తగా పొందిన నేను మరొక పురుషునికి దక్కను.

"వెళ్తావా! లేదా! నీ మాయదారి మాటలు కట్టిపెట్టు. నీ దొంగవేషాలు మానేయి. వెళ్ళకపోయావా! నీ ముందే, ఇక్కడే ప్రాణాలు విడిచేస్తాను. ఈ విషయంలో రెండో ఆలోచన లేదు. రాముడు లేకుండా నేను క్షణం జీవించలేను;" అంటూ కాళరాత్రిలా విజృంభించింది వైదేహి.

**మార్ఝూ అభిలాష ధరోని మనీ ।**
**వనాసీ ఆలాసీ సేవక్ హో ఉనీ ।**
**శ్రీరామ రాక్షసీ వధిల్యా వనీ ।**
**మజ నిజపత్నీ కరూ పాహసీ ॥**

"నన్ను మనస్సులో అభిలషించి నీవు సేవకుని వలె అరణ్యానికి వచ్చావు. శ్రీరాముని రాక్షసులు వధిస్తే నన్ను భార్యగా పొందాలని భావిస్తున్నావు" అని భావార్థ రామాయణంలో పలుకుతుంది సీతమ్మ.

సీత మాటలు లక్ష్మణుని హృదయానికి ములుకుల్లా గ్రుచ్చుకున్నాయి. ధర్మాత్ముడు, మహాత్ముడైన లక్ష్మణుని గుండె పగిలినట్లైంది. జితేంద్రియుడైన లక్ష్మణుడు రెండు చేతులెత్తి నమస్కరిస్తూ సీతతో ఇలా పలికాడు.

"అమ్మా! నీవు నాకు దేవతవు. నీ మాటకు అడ్డు చెప్పడం నాకు ఇష్టం లేదు. ధర్మబద్ధుడనైన నన్ను నీవు ఎంత పరుషంగా నిందిస్తున్నావో భగవంతుడికే తెలుసు.

"నీవు ఇలా మాట్లాడడం నాకు ఆశ్చర్యాన్ని కల్గించడం లేదు. నీవు స్త్రీవి. స్త్రీ స్వభావానికి భిన్నంగా నీవెలా మాట్లాడగలవు? సాటిలేని రీతుల్లో మాట్లాడే స్త్రీల గుణం లోకానికి తెలిసిందే.

**విముక్త ధర్మా శ్చపలా స్తీక్ష్ణా భేదకరాః స్త్రియః**

అవసరమైతే స్త్రీలు ధర్మాన్ని త్యజిస్తారు. చపలచిత్తులైన స్త్రీలు ఎలాంటి విరోధాన్నైనా సృష్టించగలరు. జానకీ! నీ మాటల్ని నేను సహించలేక పోతున్నాను. నీ పరుషవాక్కులు అగ్ని తప్తమైన బాణాల్లాగా నా చెవుల్లో గుచ్చుకున్నాయి.

"నిజం చెప్పినందుకు నన్ను నిష్ఠూరంగా నిందిస్తున్నావు. నీ అధర్మపలుకుల్ని, పరుషవాక్కుల్ని ఈ వనదేవత లందరూ సాక్షులై వింటున్నారు. దేవుడు లాంటి అన్న ఆజ్ఞను పాటిస్తున్న నన్ను అనరాని మాటలన్నావు.

"స్త్రీవి గనుక దుష్టస్వభావంతో నన్ను శంకిస్తున్నావు. నాకు పాపాన్ని అంటగడుతూ మాట్లాడుతున్నావు. స్త్రీబుద్ధి ఎంతటి ప్రళయాన్నైనా సృష్టించగలదని గతంలో విన్నాను.ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాను.

"నీకు చెడురోజులు దాపురిస్తున్నాయి. లేకపోతే నీవిలా మాట్లాడవు. ఇది నీకు వినాశకాలము. నిరపరాధినైన నన్ను అంత క్రూరంగా మాట్లాడిన నువ్వు నశించిపోతావు. నిన్ను భగవంతుడు కూడా క్షమించడు.

"వెళ్తున్నాను. గుండెను రాయి చేసికొని పోతున్నాను. రాముడెక్కడుంటే అక్కడికి వెళ్తాను. నీవు సుఖంగా వుండు. నీకు శుభం కలుగుగాక! వనదేవత లందరూ నిన్ను రక్షింతురుగాక!

"వైదేహీ! నాకు భయంకరమైన శకునాలు గోచరిస్తున్నాయి. నేను తిరిగివచ్చి నిన్ను, రాముని ఒకచోట చూడగలనా! చూడలేనా! అనే సందేహము కలుగుతోంది;" అన్నాడులక్ష్మణుడు.

"లక్ష్మణా! నీవేమైనా చెప్పు. రాముడు లేనిదే నేను జీవించలేను. గోదావరిలో దూకి చస్తాను. లేదా ఉరిపోసుకుంటాను. లేదా కొండపై నుండి క్రిందికి దూకి మరణిస్తాను.

"విషం త్రాగేస్తాను. మంటల్లో దూకేస్తాను. ఏదైనా చేసేస్తాను. కానీ రామునికన్నా అన్యమైన పురుషుణ్ణి మాత్రం ఈ బొందెలో ప్రాణముండగా కాలితో కూడా స్పృశించను;" అంటూ లక్ష్మణుని దూషించి, కన్నీళ్ళు కార్చుతూ, చేతులతో గుండె బాదుకుంటూ రోదించింది.

సీతమ్మ బాధను చూచి లక్ష్మణుడు కూడా దు:ఖించాడు. వదినను ఓదార్చాడు. సీతమ్మ లక్ష్మణుని ముఖం చూడలేదు. మారు పలుకలేదు.

మహాత్ముడైన లక్ష్మణుడు రెండు చేతులు జోడించి సీతకు నమస్కరించాడు. సీతమ్మకు ఎదురుగా నిలిచి ఏడుస్తూ మళ్ళీ నమస్కరించాడు. కన్నీళ్ళు కార్చుతూ సీతమ్మకు అంజలి ఘటించి ప్రదక్షిణం చేశాడు. మాటిమాటికీ వెనక్కి తిరిగిచూస్తూ, తల్లికి దూరమవుతున్న బిడ్డలా ఏడుస్తూ రాముని వద్దకు వెళ్ళిపోయాడు.

ఏమిటీ బాధ? ఎవరికి అర్థమవుతుంది ఈ గాథ! పసిబిడ్డలాంటి లక్ష్మణుని గుండె ఎంతగా పగిలిపోయిందో? తల్లిని వదలి, భార్యను విస్మరించి, తండ్రిని దూషించి, సీతారాములే తల్లిదండ్రులని భావించి అరణ్యాలకు వచ్చిన త్యాగమయుని హృదయానికి ఈ ఆంపపు కోత ఏమిటి? ఈ నరకయాతన దేనికి?

మనసును పచ్చి పుండులా చేసికొని, పసిబిడ్డలా వెక్కివెక్కి ఏడుస్తూ వెళ్తున్న పుణ్యాత్ముడైన లక్ష్మణుని దురవస్థ మరొకరికి రాకుండా ఉండుగాక! త్యాగాలకు గాయాలు ఫలితాలు కాకుండా ఉండుగాక!

కష్టాల్లో బిడ్డలు తల్లిని చేరి ఊరట పొందుతారు. తల్లికన్నా మిన్నగా ఎవరిని భావించి పూజించాడో అట్టి సీతమ్మే అనరాని, వినరాని మాటలు పలికినపుడు సౌమిత్రి హృదయం ఎలా తల్లడిల్లి పోయిందో?



"నాయనా! సీతమ్మే నేననుకో. రాముడే దశరథుడనుకో. అరణ్యమే అయోధ్య అనుకో" అని హితబోధ చేసి పంపిన మాతృదేవి సుమిత్ర వచనాలను తు.చ. తప్పకుండా పాటించినందుకు ఇదేనా ఫలితం?

విధి ఎంత రక్కసిగా మారింది? కత్తులు ఝుళిపిస్తూ పసికందును ఎంత ఘోరంగా శిక్షించింది? చేయని నేరానికి ఈ శిక్షలేమిటి? సాధు హృదయానికి ఎప్పుడూ యాతనలేనా! మంచికి ప్రతిఫలం వంచనయేనా? ఈ చరిత్ర ఇంతేనా! ఇది మారదా! మారలేదా! మార్పురాదా? దీనికి ఎవరు తీర్పు చెప్పాలి? ఈ మంటల్ని ఎవరు ఆర్పాలి?

## అంతర్మథనం

మారీచుడు గొంతు మార్చి రాముని కంఠధ్వనిని అనుకరిస్తూ పలికినపుడు ఆ అరుపులు రామునివే నని సీతమ్మ భయభ్రాంతులకు లోనైంది. వెంటనే వెళ్ళమని లక్ష్మణుని కోరింది.

"రాముడు అసమాన పరాక్రమవంతుడు. రామునికి అపకారం చేయగలవారు ముల్లోకాలలో లేరు. రాముని విషయంలో కంగారు, కలత అవసరం లేదు"- ఇవి లక్ష్మణుడు సమాధానంగా సీతమ్మతో చెప్పిన మాటలు!

రాముని బలపరాక్రమాలు సీతమ్మకు తెలియవా? రాముని తెలియని క్రొత్తవారైతే చెవులప్పగించుకొని వినుండేవారేమో! రాముడికి అపాయం సంభవించిందేమో నని భీతి చెందుతున్న తరుణంలో రాముని శక్తిసామర్థ్యాలను హరికథలాగా శ్రవణం చేసే సహనం ఎందరి కుంటుంది?

అదియును గాక రాముని ప్రతాపం తను ఎరిగి ఉన్నది. శివధనుర్భంగము నాటినుండి, పరశురాముని గర్వభంగమే గాకుండా, మొన్నమొన్ననే ఖరదూషణాదులతో కలిసి పద్నాలుగు వేలమంది రాక్షసులను రాముడు కూల్చివేయడం ప్రక్కన నిలబడి చూడకపోయినా, గుహలో దాగి సీతమ్మ చూచింది కదా!

రాముడికి శక్తి ఉందా! లేదా! అని సీతమ్మ సందేహించి ఉంటే, లక్ష్మణుడు చెప్పిన హరికథ ఆమెకు రుచించి ఉండేదేమో! ప్రమాదాన్ని ఊహించి భీతి చెందుతున్న మనస్సు ప్రతాపాన్ని ఆలకిస్తూ శాంతంగా ఉండగలదా?

రాముని కంఠస్వరంతో మారీచుడు "సీతా - లక్ష్మణా" అని అరచాడు. వాస్తవానికి లక్ష్మణుడు ఊహించినట్లు ప్రమాదం రామునికి జరిగివుండక పోవచ్చు. కానీ ప్రమాదం జరిగిందేమో! అనే సందేహానికి అవకాశా లున్నాయా? లేవా?

భర్త ప్రమాదంలో చిక్కిఉన్నట్లు సందేహం కలిగినప్పుడు కూడా భర్తను ప్రాణసమానంగా ప్రేమించే భార్య ప్రశాంతంగా ఉండగలదా? లేక ఉండాలా? ఉండలేని స్థితిలో లక్ష్మణుని రామునికి సహాయంగా ఊరేగమనడం తప్పా?

ఇంతకీ రాముని కంఠస్వరాన్ని విని, పైగా సీతమ్మ ఆవేదన చెందుతూ తొందరపెడుతున్నా లక్ష్మణుడు వెళ్ళడు ఎందుకని? పైగా సీతమ్మను కొత్త చుట్టంలా భావించి రాముని బలపరాక్రమాల్ని ఏకరువు పెడతాడెందుకు?

రాముడు వెళ్తూవెళ్తూ సీతను జాగ్రత్తగా రక్షిస్తూ ఉండమని లక్ష్మణునికి చెప్పాడు. ఆపదను ఊహిస్తూ జీవించమని హెచ్చరించి మరీ వెళ్ళాడు. లక్ష్మణుడు స్వామిభక్తి పరాయణుడు. రాముడు ఇంతగా నొక్కి చెప్పడం గతంలో ఎప్పుడూ జరుగలేదు.

ఇంతగా చెప్పి వెళ్ళినా రాముని ఆజ్ఞను ఉల్లంఘించి లక్ష్మణుడు వెళ్ళడాన్ని రాముడు అంగీకరిస్తాడా? లక్ష్మణుడు రాముని సేవకుడుగా జీవిస్తున్నాడు. ప్రభువు చెప్పిన మాటను సేవకుడు అనుసరించ దగినవాడే కానీ స్వీయనిర్ణయాలతో ప్రవర్తించ దగినవాడు కాడు. రాముని ఆజ్ఞను ఉల్లంఘించి రాముని వద్దకు వెళ్ళి ముఖం ఎలా చూపించాలి? అనేది లక్ష్మణుని సంశయం.

సరే. ఈ మాత్రం ప్రభుభృత్య న్యాయం సీతమ్మకు తెలియదా? నిష్కారణంగా, వైరం లేని రాక్షసులను వధించడం ధర్మం కాదని దండకారణ్యంలో ధర్మాత్ముడైన రామునితో వాదించింది సీతమ్మ కాదా? సతిధర్మాన్ని, స్త్రీధర్మాన్ని గూర్చి కౌసల్యతోను, అనసూయతోను చర్చించిన మహాసాధ్వి సీతమ్మ కాదా?

రామాజ్ఞను పాటించాలి. పాలించాలి. అది సేవకుడైన లక్ష్మణుని ధర్మం. బావుంది. ఇంతకీ రామాజ్ఞను ఎందుకు పాటించాలి? రాముని కొరకే కదూ? మరి అట్టి రాముడే అపాయంలో చిక్కియున్నట్లు అనుమానం కలిగినపుడు రామాజ్ఞను పాటించాలి అంటూ రాముని విస్మరించడం ధర్మమా? ఆపదలు సంభవించినపుడు సమయస్ఫూర్తి ఉండనవసరం లేదా? మరి లక్ష్మణుడు సీతమ్మ వెళ్ళమంటున్నా వెళ్ళడెందుకని?

రాముని బలపరాక్రమాలు తనకు తెలుసు కనుక లక్ష్మణుడు వెళ్ళడానికి నిరాకరించాడు అని సరిపెట్టుకుందామా? ముందుగా మనం చర్చించినట్లు సీతమ్మకు కూడా తెలుసు కదా! అనే ప్రశ్న మళ్ళీ తలఎత్తే అవకాశం ఉందికదూ! సరే. సీతమ్మ కన్నా ఆ విషయంలో లక్ష్మణుని అనుభవం పెద్దది, గొప్పది అని మనం చెప్పుకోవచ్చు. రాముడు శక్తిమంతు డైనంత మాత్రాన అపాయం రాకూడదని ఏముంది? అపాయాలు, ప్రమాదాలు శక్తిహీనుల కొరకే సృష్టింపబడ్డాయా?

రామునికి ఎదురుగా నిలిచి ఎవరూ జయించలేరు అని లక్ష్మణుడు చెప్పిన మాట సత్యమే. అపాయం తలపెట్టినవాడు ఎదురుగానే నిలబడాలా? అపాయం తలపెట్టే వానికి అనుచరుడు ఉపాయమే గదా!

సీతమ్మను రక్షిస్తూ ఉండమని రాముడు లక్ష్మణుని ఆజ్ఞాపించాడు. సీతమ్మ కూడా ఆ మాటకు కట్టుబడి ఉండాలే కానీ రామాజ్ఞను ఉల్లంఘించే సాహసం చేయకూడదు అని కొందరి వాదన.

స్త్రీగా ఉండి పురుషుడైన లక్ష్మణుని నీచాతి నీచంగా నిందించడం సీతమ్మ చేసిన అపచారం. ఈ అపచారం వల్లనే, భాగవతోత్తముడైన లక్ష్మణుని నిందించిన కారణంగానే సీతమ్మ ఆ తరువాత బాధ లనుభవించవలసి వచ్చింది. ఈ కారణంగానే దురదృష్టాలన్నీ చుట్టుముట్టినట్లు చాలామంది భావించారు. రామాయణ సంస్కృత వ్యాఖ్యానకర్తలలో ముఖ్యులైన గోవిందరాజులు కూడా అలాగే అభిప్రాయపడ్డాడు.



లక్ష్మణుడి మీదున్న ప్రేమతో వీరంతా ఆ క్షణంలో రావణవధకు కారణమైన రామాయణ కథనంతా మరచిపోయారనో, లేక ప్రక్కన పెట్టారనో భావించాల్సి వస్తుంది.

ధర్మాధర్మ నిర్ణయాలు చేయునపుడు లింగభేదం ప్రధానమని భావించేవారికి పై వాదన తృప్తి నిస్తుందేమోగాని, తత్త్వజ్ఞులైన తల్లుల్ని ప్రవేశపెట్టిన భారతీయ సంస్కృతిని అవగతం చేసుకున్నవారికి మాత్రం రుచించదు. పురుషాధిక్యాన్ని చాటుతూ ధర్మప్రవచనాన్ని చేయడం జాతి హర్షించదు.

సరే. అదలా ఉంచండి. లక్ష్మణుడు సమస్తాన్ని త్యజించి సీతారాముల సేవకై అరణ్యానికి అరుదెంచాడు కదా! లక్ష్మణుని మాటను విశ్వసించి సీత ఊరుకోవచ్చు గదా? లక్ష్మణుని వెళ్ళమని మరీ పట్టుపట్టడ మెందుకు? ఈ మంకుపట్టు కూడా ధర్మమేనా?

**న విశ్వసే దవిశ్వస్తే విశ్వస్తే నాతివిశ్వసేత్**

"విశ్వసించదగని వానియందు విశ్వాసము ఉంచకూడదు. విశ్వసించదగిన వానిని కూడా హద్దుమీరి విశ్వసించరాదు" అని పంచమవేదమైన భారతము నీతిని ప్రవచించింది.

సంక్లిష్టమైన పరిస్థితుల్లో విశ్వాసాలను నిచ్చెనలవలె ఉపయోగించుకోవచ్చు. అలాగని వ్యక్తిగత నిర్ణయాలనే భూమిని వదలి సాము చేయకూడదు. కళ్ళుండి అంధునిలా బ్రతకడాన్ని ఆర్షధర్మం ప్రోత్సహించదు.

**ఆత్మ బంధువులారా!**

సీతమ్మ లక్ష్మణస్వామిని పరుషంగా నిందించడం మీకు బాధను కల్గించవచ్చు. నావరకు నేనూ దుఃఖించాను. వ్రాస్తూ కూడా కన్నీళ్ళు కార్చాను. ఇదంతా మన భావస్పందనకు, భావసంపదకు సంబంధించిన విషయం.

మనం ఇక్కడ అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నది ఎవరిని గురించో అది మరచి పోకూడదు. కొన్ని వేల సంవత్సరాలుగా ఏ స్త్రీమూర్తి నామాన్ని ఉచ్చరించగానే యావ త్ప్రపంచము వినమ్రతతో తలవంచిందో అట్టి మహామాతృమూర్తి సీతమ్మతల్లిని, ఆమె ఆంతర్యాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాం. ఆదర్శ మాతృమూర్తి అడుగుజాడల్ని పరిశీలిస్తున్నాం.

ఆమె నడచిన మార్గం సామాన్యమైనది కాదు. ఆమె అడుగుజాడల్ని అన్వేషించి పట్టుకోవడం సులభసాధ్యం కాదు. ఆవేశపరులు, పరిమితమైన సిద్ధాంతాల ముసుగులో నుండి వీక్షించేవారు, తొందరపాటు నిర్ణయాలకు అలవాటు పడ్డవారికి సీతమ్మ దివ్యమైన పాదముద్రలు గోచరించవు.

సీతమ్మ ఏ స్థితిలో ఉండి ప్రవర్తిస్తున్నదో మనం ఊహించలేము. మనం సీతమ్మ పరిస్థితిలో ఉంటే ఎలా ప్రవర్తించేవారమో అర్థం చేసుకుంటే కొంతవరకు ముసుగు తొలిగే అవకాశముంది.

రాముడు ధర్మాత్ముడు. ప్రపంచంలోనే మహోన్నతమైన వ్యక్తి. పురుషోత్తముడు. అట్టి రాముని సీతమ్మ భర్తగా పొందింది. దివ్యాత్ముడైన రాముని వదలి క్షణం కూడా జీవించలేక రామునితో పాటు సీతమ్మ కష్టాల్ని కూడా సహించి అరణ్యాలకు తరలివచ్చింది.

ఎవరి కొరకు సర్వాన్ని త్యజించి కానల్లో కాలుపెట్టిందో అట్టి భర్తే అరణ్యంలో అపాయానికి గురైనట్లు తెలియగానే ఆమె మానసిక పరిస్థితి ఎలా ఉంటుందో ఒక్కక్షణం ఆగి ఆలోచించండి.

అపాయం జరిగే ఉంటే ఈ అపాయం తనవల్లనే సంభవించింది. తాను కాంచనమృగాన్ని వాంఛించడం చేతనే దానిని పట్టి తేవడానికి రాముడు వెళ్ళాడు. తనవల్లనే రాముడికి ప్రమాదం సంభవించింది అనే బాధ కూడా ఆమెకు ప్రత్యేకంగా ఉంది. ఆ తల్లి మనసు ఎంత అలజడికి, ఆవేదనకి గురై ఉంటుందో ఆలోచించండి.

పూడిక తెలియని అగాధంలో పడ్డట్లు దరి, దారి కానక అలమటిస్తున్న తరుణంలో ఆమె నుండి ఎవరైనా ఏమి ఆశించగలరు? తన జీవితం ఏమౌతున్నదో తనకే తెలియడం లేదు. పిచ్చిదానిలాగా రాముడికోసం రోదిస్తోంది.

బాధల్లో ఉండేవారు, ఆందోళనతో చెదిరిపోయిన వారు, పరిస్థితులకు బెదిరిపోయిన వారు శాంతిమంత్రాలు పఠించాలని ఆశించడం ఎంతవరకు సబబు?

భర్తకి ఏమి జరిగిందో, రాముడెలా ఉన్నాడో అర్థంగాక కళ్ళను కడలిగా మార్చుకొని సీతమ్మ రోదిస్తున్నది. లక్ష్మణా! వెళ్ళు నాయనా! అంటే, పరాక్రమవంతుడైన రామునికి ఏమీ జరగదంటూ లక్ష్మణుడు కలత లేకుండా కనిపిస్తున్నాడు. ఈ దారుణ పరిస్థితుల్లో ఎవరికి కోపంరాదు రాయికి చెట్టుకు తప్ప? సీతమ్మ కూడా కుపిత అయింది. తప్పేమిటి? అపచారమేమిటి?

కోపం రావచ్చు. అంతవరకు బాగుంది. కోపం వచ్చినంత మాత్రాన ఎలా పడితే అలా తిట్టడమేనా? యుక్తాయుక్తములను పరిశీలించ నవసరం లేదా?

నిజమే. కోపం వచ్చినా సీతమ్మ తిట్టకుండా ఉండి ఉన్నట్లయితే చాలా గొప్పగా ఉండేది. తూచి మాట్లాడి ఉంటే చాలా బావుండేది. కోపం తీవ్రస్థాయికి చేరినపుడు వ్యాకరణాన్ని అనుసరించే వారిని చూడాలని ఉబలాట పడడం సముచితమేనా?

కోపమంటేనే లోపాలకు ఆలవాలం. కోప్పడడం తప్పు కాదని నిర్ణయించినపుడు కోపవచనాలు తప్పని నిర్ధారణ చేయడం అర్థరహితమైన విషయం.

ఒక ముఖ్యవిషయాన్ని మనం గమనించాలి. రాముడు అపాయంలో ఉన్నట్లు సీతమ్మ మనసు ఊహిస్తోంది. తన బాధను ఆ నిర్జన ప్రదేశంలో ఆమె ఎవరికి చెప్పుకోవాలి? లక్ష్మణుని కన్నా చెప్పుకోవడానికి ఆమెకు ఎవరున్నారు ఆ అరణ్యంలో?

ఎంతగా బ్రతిమాలినా లక్ష్మణుడు చలించకపోయె. ఏం చేయాలి? చెప్పండి. ఎలాగైనా లక్ష్మణుని రాముని వద్దకు త్వరగా పంపాలి. భర్తను రక్షించుకోవాలి. ఏవిధంగా మాట్లాడితే వెళ్తాడో సోపానక్రమంగా చెప్తూవచ్చిన సీతమ్మ, అప్పటికీ కదలని లక్ష్మణుని చూసి **అప్రయత్నంగా** కోపంలో అనరాని మాటలు అన్నది.

అలా మాట్లాడిన తరువాతే లక్ష్మణుడు వెళ్ళాడు. భర్త పట్ల ఆమెకున్న నిరవధిక ప్రేమవల్ల, రాముని భద్రతను కాంక్షిస్తూ ఆవేశంలో అలా మాట్లాడిందే కాని లక్ష్మణుని నిందించాలని మాత్రం కాదు.



సీతమ్మకు విచక్షణ లేదని భావించకండి. ఆమె విచక్షణను శోకవిషాదాలు మింగేశాయి. దీన్ని మనసుతో అర్థం చేసుకోవాలని ప్రయత్నించకండి. హృదయంతో స్పృశించే ప్రయత్నం చేయగలిగితే చేయండి.

పలకకూడని అపశ్రుతులు పలికి సీతమ్మ అపచారం చేసింది అని పలికే పండితుల్ని, ప్రబుద్ధుల్ని నేను వినమ్రుడనై సూటిగా ఒక్కప్రశ్న అడుగుతున్నాను.

"లక్ష్మణా! నీవు నన్ను ఆశించే అరణ్యానికి వచ్చావు. రాముడు మరణించాలని కోరుకుంటున్నావు. నీ సన్నాగమైనా, భరతుని సన్నాగమైనా నేను రాముని వదలి పరపురుషుని అభిలషించను" అని కర్కశంగా సీతమ్మ పలికింది కదూ? ఈ మాటల్ని సీతమ్మ నమ్ముతున్నదా? తాను మాట్లాడింది సత్యమని విశ్వసిస్తున్నదా? ఈ ప్రశ్నకు మన అంతర్యం నుండి సమాధానం రాగలిగితే సీతమ్మను మనం అర్థం చేసుకోగలం.

సీతను అపహరించడానికి రావణుడు రామాశ్రమానికి వచ్చినపుడు తాను వనవాసము చేయుటకు గల కారణాలను వివరించేటప్పుడు రామునితో కూడా తాను, లక్ష్మణుడు వచ్చినట్లు సీతమ్మ చెబుతుంది. అప్పుడు లక్ష్మణుని గూర్చి రావణునితో ఇలా పలుకుతుంది.

**సభ్రాతా లక్ష్మణో నామ ధర్మచారీ దృఢవ్రతః**

"రాముని తమ్ముడైన లక్ష్మణుడు ధర్మాచరణము గలవాడు. దృఢవ్రతుడు".

లక్ష్మణునిపై సీతమ్మకు ఎలాంటి అభిప్రాయముందో ఈ వాక్యాన్ని బట్టి గ్రహించవచ్చు.

ధర్మాచారి, దృఢవ్రతు డైనవాడు అన్న భార్యను వాంఛిస్తాడా? అన్న భార్యను పొందాలనే కాంక్షను మనసులో అవధరించి అరణ్యానికి వచ్చి ఉంటాడా? అలాంటివాణ్ణి ధర్మాచారి అంటారా?

సీతమ్మ కోమలమైన మనసును మనం చక్కగా చూడవచ్చు. ఒకవైపు వచ్చిన అతిథిని సన్మానించాలి. మరొకవైపు రాముడి కేమి జరిగిందో? రామలక్ష్మణులు ఇంకా రాలేదు అనే బెంగ.

దృఢవ్రతుడు, ధర్మాచారి అయిన లక్ష్మణుని, కోపంలో, తొందరలో తాను అనరాని మాటలు అనినందుకు సీతమ్మ పశ్చాత్తాపపడుతోంది. లక్ష్మణుని ఎలాగైనా తొందరగా రాముని వద్దకు పంపాలనే తపనే గాని లక్ష్మణుని శీలాన్ని, మనసును సీతమ్మ ఏవిధంగానూ శంకించలేదని స్పష్టమవుతోంది. అలా కానిచో లక్ష్మణుని ధర్మచారిగా, దృఢవ్రతుడుగా వర్ణిస్తుందా?

ఈ అంతర్మథన విశ్లేషణను ముగించే ముందు చిన్న ముక్తాయింపు.

జీవితము ఒక భయంకరమైన అరణ్యము. అగాధమైన సాగరము. ప్రయాణము సాఫీగా సాగుతుందని చెప్పలేము. విధి విన్యాసాలు వ్యక్తి పరిధిలోనివి కావు. కనుక పరిస్థితులు మన ఆధీనంలో ఉండవు.

విషమ పరిస్థితులు ఎదురైనట్లే, విషమ పరీక్షలు కూడా చుట్టూ ముట్టి బాధిస్తాయి. శిల్పి దెబ్బలకు ఓర్చుకొని రాయి విగ్రహ మవుతుంది. నిప్పులో కాలి బంగారము నిగ్గు తేరుతుంది.

విధి వక్రించినపుడు, ధర్మసంకటాలు తలెత్తినపుడు అంతర్మథనం తప్పదు. అంతర్మథనం లోనే జీవితం అమృతమయంగా మారుతుంది. కష్టాలు సహజం. కన్నీళ్ళూ సహజం. వాటినుండి పాఠాలు నేర్చుకోకపోతే అవికూడా వ్యర్థమైపోతాయి.

అన్న ఆజ్ఞను పాటించడమే లక్ష్మణునికి ధర్మం. పైగా రామునికి అపాయం లేదని, రాముని కంఠస్వరంతో పలికింది మారీచుడేనని లక్ష్మణునికి తెలుసు. అందుకని సీతమ్మను వదలి పోవడానికి లక్ష్మణుడు నిరాకరించాడు. ఇందులో లక్ష్మణుడి తప్పు ఇసుమంతైనా లేదు.

ఇకపోతే సీతమ్మ విషయం. దారుణమైన మానసిక కల్లోలంలో భర్త భద్రతను కాంక్షిస్తూ పలికిన ఆవేశవాక్కులే గాని, ఆలోచించి పలికినవి మాత్రం కావు. ఆమెను సానుభూతితో అర్థం చేసుకోవాలే గాని ఆవేశంలో ఏదో ఏదో ఊహించి ఆమె పట్ల అపచారం చేయకూడదు.

కొన్ని వేల సంవత్సరాలుగా ఒక్క భారతదేశంలోనే గాక ఆగ్నేయాసియా దేశాలన్నిటిలో కూడా సీత నామము స్ఫూర్తిని కల్గిస్తూనే ఉంది.

**What to speak of Sita? You may exhaust the literature of the world that is past, and I may assure you that you will have to exhaust the literature of the world of the future, before finding another Sita. Sita is unique. The character was depicted once and for all. There may have been several Ramas, perhaps, but never more than one Sita. She is the very type of the true Indian woman, for all the Indian ideals of a perfected woman have grown out of that one life of Sita; and here she stands these thousands of years, commanding the worship of every man, woman and child, through out the length and breadth of the land of Aryavarta.**

"సీతను గూర్చి ఏం చెప్పాలి? ఇంతవరకు వెలుగు చూసిన విశ్వసాహిత్యాన్నీ, ఇక ముందు వెలువడబోయే విశ్వసాహిత్యాన్నీ కాగడాలు పెట్టి వెదికినా మరొక సీత కనిపించదని నేను మీకు హామీ ఇస్తున్నాను. సీత పాత్ర అలా అమోఘంగా చిత్రించబడింది. రాముళ్ళు చాలామంది ఉండగలరేమో గాని సీత మాత్రము ఒక్కతే. నిజమైన భారతీయ స్త్రీమూర్తికి ఆమె ప్రతినిధి. పరిపూర్ణ స్త్రీ మూర్తిమత్వానికి ఏ భారతీయ ఆదర్శాలు అవసరమో అవన్నీ ఒక్క సీతమ్మ జీవితం నుండే వృద్ధి పొందాయి. అందుచేతనే ఆర్యావర్తంలో ఆసేతు హిమాచల పర్యంతం ఇన్నివేల సంవత్సరాల తరబడి ప్రతి పురుషుడు, స్త్రీ, శిశువు ఆమెను ఆరాధిస్తున్నారు," అంటారు వేదాంత సింహకిశోరం స్వామీ వివేకానంద.

లక్ష్మణుడు సీతమ్మకు నమస్కరించి రాముని వెతుక్కుంటూ అరణ్యంలో ప్రవేశించాడు. పర్ణశాల ముందు నిలబడి రామలక్ష్మణుల రాకకై సీతమ్మ ఆత్రుతతో నిరీక్షిస్తూ ఉంది.

రాముడు వెళ్ళాడు. లక్ష్మణుడూ వెళ్ళాడు. అవకాశం కొరకు నిరీక్షిస్తున్న రావణునికి సంతోషమైంది. వెంటనే మాయవేషాన్ని ధరించాడు మోసగాడైన రావణుడు.

రావణుడు మృదువైన కాషాయవస్త్రాన్ని ధరించాడు. జడధారియై, కాళ్ళకి చెప్పులు, తలపై ఛత్రము ధరించాడు. ఎడమ భుజానికి దండకమండలాలు ధరించాడు. పర్ణశాల ముందు ప్రత్యక్షమయ్యాడు.



**అంతంత నిలుచుచు హరిహరి యనుచు, శాంతి బొందుచు బర్ణశాల కేతెంచు**
**తను జూచి వనదేవతలు జగద్ద్రోహి, చనుదెంచె వీడని సభయులై యొదుగ**
**నిక్కపు మునివోలె నిలిచిన జూచి, యక్కపటాత్ము సంయమిగాగ దలచి**
**గ్రక్కున వైదేహి కడుభక్తి మెఱసి, మ్రొక్కి హస్తాంబుజంబులు ముకుళించి.**

అని, కుహనా సన్యాసి యైన రావణుడు పంచవటిలో పర్ణశాలను సమీపించే సన్నివేశాన్ని వర్ణించింది రంగనాథ రామాయణము.

## యతి వేషంలో రావణుడు

రాముని గూర్చి దుఃఖిస్తూ, చింతాక్రాంతయై, కన్నీరు కార్చుతూ సీతమ్మ పర్ణశాల వద్ద ఉంది. పచ్చని పట్టుబట్ట కట్టుకొని లక్ష్మీదేవిలా శోభిస్తున్న సీతమ్మను రావణుడు చూశాడు. మెల్లగా సమీపించాడు.

దుష్టకార్యములు చేయు ఆ రావణుని చూచి జనస్థానంలో చెట్లు వణికిపోయాయి. గాలి వీచడం మానేసింది. వేగంగా ప్రవహిస్తున్న గోదావరి ఎఱ్ఱని కళ్ళతో చూస్తున్న రావణునికి భయపడి వడి తగ్గించింది.

రావణుడు సీతమ్మను సమీపించాడు. రావణుడు సీతమ్మను సమీపించి, వీక్షించిన సన్నివేశాన్ని ముచ్చటగా మూడు ఉపమానాలతో వర్ణించాడు వాల్మీకిమహర్షి.

**శ్లో ॥ తామాస సాదాతిబలో భ్రాతృభ్యాం రహితాం వనే**
**రహితాం చంద్రసూర్యాభ్యాం సన్ధ్యామివ మహత్తమః (1)**

**శ్లో॥ తామపశ్యత్తతో బాలాం రామపత్నీం యశస్వినీమ్**
**రోహిణీం శశినాహీనాం గ్రహవద్భృశ దారుణః (2)**

**శ్లో ॥ అభవ్యో భవ్యరూపేణ భర్తారమను శోచతీమ్**
**అభ్యవర్తత వైదేహీం చిత్రామివ శనైశ్చరః (3)**

1. గొప్ప బలవంతుడైన రావణుడు రామలక్ష్మణులు దగ్గరలేని సమయంలో, సూర్య చంద్రులు లేని సంధ్యను చీకటి ఆవరించునట్లు, సీతను సమీపించాడు.

2. సమీపించి, చంద్రుడు దగ్గర లేని రోహిణిని అంగారకగ్రహము చూచినట్లు, కీర్తిమంతురాలు, రామపత్ని, చిన్నవయసు కలది అగు సీతను చాలా క్రూరుడైన రావణుడు చూశాడు.

3. శని చిత్రానక్షత్రము దగ్గరకు వచ్చునట్లు, అశుభకరుడైన రావణుడు శుభకరమైన సన్యాసి వేషముతో భర్తను గూర్చి విచారిస్తున్న సీత దగ్గరకు వచ్చాడు.

రావణాసురుడు సీతమ్మను సమీపించడం, చూడటం, దగ్గరకు చేరడం, ఈ మూడు విషయాల్ని చక్కని మూడు ఉపమానాలలో అందిస్తూ ఈ క్షణం నుండి జరుగబోవు దంతయూ సూక్ష్మంగా వివరించాడు వాల్మీకిమహర్షి.

**మొదటి ఉపమానం:-** సూర్యచంద్రులు లేని సంధ్యను గాఢాంధకారము ఆవరించినట్లు రామలక్ష్మణులు సమీపంలో లేని సీతను రావణుడు సమీపించాడు.

ఈ ఉపమానంలో సీతమ్మ సంధ్యగాను, రామలక్ష్మణులు సూర్యచంద్రులు గాను, రావణుడు కటికి చీకటిగాను పోల్చబడ్డారు.

సంధ్యారుణ శోభ ఎలా భాసిస్తుందో సీతమ్మ సౌందర్యము కూడా అరుణకాంతులను విరజిమ్ముతోంది.

సూర్యుడు ఎలా స్వప్రకాశుడో అలాగే శ్రీరాముడు ప్రకాశైక స్వరూపుడు. చంద్రుడు సూర్యుని ప్రకాశంపై ఆధారపడి జీవించునట్లు, లక్ష్మణుడు రామునిపై ఆధారపడి జీవిస్తుంటాడు.

సూర్యుడు స్థిరంగా ప్రకాశించునట్లు రాముడు స్థిరుడై గోచరిస్తాడు. చంద్రునిలో వృద్ధిక్షయాలు తెలియునట్లు లక్ష్మణునిలో తోషవిషాదాలు తెలుస్తుంటాయి.

రావణుడు దట్టమైన చీకటితో పోల్చబడ్డాడు. చీకటి నల్లగా ఉంటుంది. అంధకారము అజ్ఞానమునకు సూచితము కనుక రావణుడు అజ్ఞాని అని వేరుగా చెప్పనవసరం లేదు.

సూర్యచంద్రులు లేని సంధ్య అమావాస్యనాటి మలిసంధ్య. అపుడు గాఢమైన అంధకారము అలుముకుంటుంది. చీకటి సంధ్యను ఆవరించక తప్పదు. అలాగే రావణుడు సీతమ్మను కూడా తప్పక అపహరిస్తాడు అనే భావాన్ని వాల్మీకి సూచిస్తున్నాడు.

చీకటి సంధ్యను హరించవచ్చు. అంతమాత్రాన సంధ్య నశించదు. తిరిగి శోభించకపోదు. అలాగే రావణుడు సీతమ్మను అపహరించవచ్చు. అయినా తిరిగి సంధ్యలాగా సీతమ్మ కూడా శోభిస్తుంది.

సూర్యుడు అంధకారాన్ని అదృశ్యం చేసి సంధ్యకు విముక్తిని ప్రసాదిస్తాడు. అలాగే సూర్యవంశరాజైన శ్రీరాముడు అజ్ఞానియైన రావణుని సంహరించి సీతమ్మకు విముక్తిని ప్రసాదిస్తాడు.

**రెండవ ఉపమానం :-** చంద్రుడు దగ్గర లేని రోహిణిని అంగారకగ్రహం చూచినట్లు రామచంద్రుడు దగ్గరలేని సీతను రావణుడు చూశాడు.

ఈ ఉపమానములో రోహిణీచంద్రులు సీతారాములుగా, అంగారక గ్రహము రావణుడుగా పోల్చబడ్డారు.

రోహిణీచంద్రుల దాంపత్యము ఆదర్శము. విడదీయరానిది. అలాగే సీతారాముల దాంపత్యము కూడా ఆదర్శవంత మైనది. ఎవరూ విడదీయలేనిది అని భావము.

మొదటి ఉపమానంలో రావణుడు ఆశ్రమాన్ని సమీపించాడు. రెండవ ఉపమానములో సీతమ్మను చూశాడు. అంటే సీతమ్మను రాముని నుండి విడదీయాలని చూశాడు అని అర్థము. సీతారాముల అవిభక్త దాంపత్యాన్ని వేరుచేయడం రావణునికి సాధ్యం కాదు.

అంగారకగ్రహము పాపగ్రహము. రావణుడుకూడా పాపియే. ఇక్కడ రావణుడు సీతమ్మను చూశాడు. ఈ ఉపమానము దృష్టికి సంబంధించింది. కనుక రావణుడు పాపపు దృష్టి కలవాడు అని స్పష్టమవుతూ ఉంది.



అంగారకగ్రహము యుద్ధమును సూచించు గ్రహము. రావణుని అంగారకగ్రహంతో పోల్చడం వల్ల రామరావణ సంగ్రామము అనివార్యమని చెబుతున్నాడు ఆదికవి.

**మూడవ ఉపమానం :-** శని చిత్రానక్షత్రము దగ్గరకు వచ్చునట్లు రావణుడు సీతమ్మ దగ్గరకు వచ్చినాడు.

ఈ ఉపమానములో సీతమ్మ చిత్రానక్షత్రముతోను, రావణుడు శనితోను పోల్చబడ్డారు. సీతమ్మ చిత్రమ్మే. విచిత్రమ్మే. కవి చిత్రమ్మే. ఆదికవి చిత్రమ్మే.

భూమినుండి ఎవరు పుడుతారు? .... చిత్రం కాక మరేమిటి?

వీర్యశుల్కగా ప్రకటింపబడటం విచిత్రం కాదా!

శివధనుర్భంగము గావించగా జరిగిన కళ్యాణవైభవము కవి చిత్రం కాదా!

కోమల శరీరి భర్తతో కానలు కేగడం చిత్రం కాదా!

చిత్ర విచిత్రమైన సీతమ్మ వైభవం ముందు ఇప్పుడు నిలిచియున్నది ఎవరో తెలుసా! రావణుడు. శని.

సీతమ్మ చిత్రాలలో విచిత్రమైతే, రావణుడు పాపులలో గొప్ప పాపి. పాపగ్రహా లన్నిటిలో మిక్కిలి పాపగ్రహం శనిగ్రహం.

పాపకార్యాలయందే ఆసక్తి గలవాడని కూడా భావము. శని గట్టిగా పట్టియుండుట కూడా ఈ పాపాచరణమునకు ప్రబలకారణము.

శని పట్టాడంటే, ఆ పట్టుబడిన వాడితో పరిపెట్టుకొని పోదు. వాడ్ని పట్టుకున్న వాళ్ళనుకూడా ఒకపట్టు పట్టకపోదు. రావణుని శని ఆవరించియున్నాడు కనుక రావణు డొక్కడే కాకుండా లంక అంతా ధ్వంస మౌతుందని భావము.

రావణుడు ప్రథమంగా సీతమ్మతో ఇలా భాషించాడు.

"చారునేత్రీ! నువ్వెవ్వరవు? భూలోకమున నీవంటి అందమైన స్త్రీని ఇంతవరకు నేను చూడలేదు. దేవ, గంధర్వ, యక్ష, కిన్నరులలో కూడా ఇట్టి మంగళకరమైన రూపమును ఇంతవరకు నేను గాంచలేదు.

"చారువేణీ! నీవు పార్వతివా! కీర్తికి మూలానివా! శ్రీదేవివా! కాంతిరూపిణివా! అప్సరసవా! ఐశ్వర్యానికి మూలానివా? లేక రతీదేవివా?

"విలాసినీ! ఇది భయంకరారణ్యము. నీవు సుకుమారివి. బాలవు. బేలవు. నీవు అరణ్యములో ఎందుకున్నావు? నిన్ను చూస్తున్నకొద్దీ నా మనసు కలత చెందుతూ ఉంది.

**సా ప్రతికామ భద్రంతే నైవ వస్తు మిహార్హసి**
**రాక్షసానామయం వాసో ఘోరాణాం కామరూపిణామ్**

"ఇక్కడ భయంకరులైన రాక్షసులు నివసిస్తూ ఉంటారు. వారు కోరిన రూపాలు ధరించి విహరిస్తూ ఉంటారు. నీవు ఇక్కడనుండి వెళ్ళిపో. నీకు శుభము కలుగుగాక!" అన్నాడు.

సాధువేషముతో శోభిస్తున్న రాక్షసుడగు రావణుడు తాను సాధువేనని సీతమ్మ గుర్తించునట్లు నమ్మించడానికి అలా మాట్లాడుతున్నాడు. అది సీతమ్మ ఉండదగిన ప్రదేశము

కాదని, అక్కడనుండి బయలుదేరి వెళ్ళమని చెప్తున్నాడు. సీతమ్మకు వాసయోగ్యమైన స్థానము లంకానగరమే గాని పంచవటి కాదనే భావంతో అలా పలికాడు.

సజ్జనులకు ఎవరూ చెడు చేయలేరు. సీతమ్మను అపహరించాలని వచ్చిన రావణుడు **"భద్రంతే"** "నీకు శుభము కలుగుగాక" అని పలికాడు. సీతకు మంచి జరగడమంటే రావణునికి చెడు జరిగినట్లే. భోగాసక్తులు అప్రయత్నంగా ఇలా భస్మాసురు లవుతూ ఉంటారు.

"సుందరీ! ఇక్కడ సింహాలు, పులులు, రాబందులు సంచరిస్తూ ఉంటాయి. అయ్యో! నీవు ఇక్కడ ఒంటరిగా ఎందుకున్నావు?" అంటూ రావణుడు మాయమాటలు పలుకుతుంటే, ఆ వచ్చినవాడు నిజమైన సన్యాసే అని సీతమ్మ భావించి అతిథిమర్యాదలు చేసింది. మంచి ఆహారమును సమర్పించి ఆరగించమని చెప్పింది.

ఈ సందర్భములో తాను నిజమైన సన్యాసియే అని నిరూపించుకోడానికి రావణుడు సీతమ్మనే సందేహించినట్లు సంత్ ఏకనాథ్ భావార్థరామాయణంలో రచిస్తాడు.

**తూ రాక్షస సుందరీ మనుష్యవేషే భీతరీ నేసి మారాయాసీ**
**అత్యాదరే బోలావిసీ సన్మాన్ దేసీ భక్షావయా!**
**ఐసే ఐకోని అతిథి ఉత్తర్ సీతామ్హణే శ్రీహరహర**
**ఆమ్హీన వ్హోగా నిశాచర్ నిత్యకింకర్ అతిథీం చె**

ఆతిథ్యాన్ని స్వీకరించమనిన సీతమ్మతో రావణుడు ఇలా అంటాడు.

"నీవు మానవాకృతిలో గోచరించే రాక్షసివేమో! ఆహ్వానించి చంపుతావేమో? చాలా ఆదరంగా మాట్లాడుతున్నావు. నన్ను మ్రింగడానికే ఈ గౌరవమంతా!"

రావణుడు అలా పలకగానే సీతమ్మ ఇలా అంటుంది.

"హరహర! మేము రాక్షసులము కాము. అతిథులకు నిత్యసేవకులం." ఈవిధంగా తానే సీతమ్మను అనుమానిస్తున్నట్లు రావణుడు భాషించడం వల్ల సీత రావణుని అనుమానించే అవకాశమే లేకుండా చేశాడు అంటాడు ఏకనాథ్. మేము రాక్షసులము కాము అని చెప్పుకొనే స్థితిని సీతకు కల్పించి తనపై ఏవిధంగానూ సందేహం కలిగేలా లేకుండా రంగం సిద్ధం చేసుకున్నాడు అంటాడు.

సీతమ్మ సౌందర్యానికి పిచ్చివాడైన రావణుడు ఎలాగైనా ఆమెను అపహరించాలని మనసులో తీవ్రంగా సంకల్పించాడు. సీత లభించనపుడు ప్రాణం ఉండి ఏమి ప్రయోజనం? అని తనను తాను ప్రశ్నించుకున్నాడు.

సీతమ్మ ఆలోచించింది. వచ్చినవాడు యతి. పైగా అతిథి. తనను గూర్చి ప్రశ్నించాడు. చెప్పకపోతే క్రుద్ధుడై శపిస్తాడేమో అని భావించి, తాను జనకపురిలో పుట్టింది మొదలు నేటివరకు జరిగిన చరిత్రనంతా సూక్ష్మంగా వర్ణించి చెప్పింది. తన భర్తయైన రాముని సుగుణాలను కూడా వివరించింది. సీతమ్మ చెప్పిన కథను ఆలకించిన రావణుడు తన మనసును బయటపెట్టాడు.



# గోముఖవ్యాఘ్రము గర్జించింది

"సీతా! ఎవరి నామాన్ని ఆలకించగానే దేవ, అసుర, పన్నగాదులే కాక సమస్త లోకాలు దారుణంగా వణికిపోతాయో ఆ రావణుణ్ణి నేనే.

"సుందరీ! ప్రవాహవేగంతో నది తీరాన్ని హరించునట్లు నీ రూపము నా మనసును కొల్లగొట్టింది. విలాసినీ! పచ్చని పట్టువస్త్రంతో పసిడిబొమ్మ లాగా నీవు వెలిగిపోతుంటే, నీ అందాన్ని చూచి నేను పిచ్చివాణ్ణవుతున్నాను. నా మనసులో నీవు గిలిగింతలు పెడుతూ ఉంటే నేను నా భార్యలతో సుఖపడలేక పోతున్నాను.

"సీతా! అందమైన స్త్రీల నెందరినో తెచ్చి నా అంతఃపురములో పెట్టుకున్నాను. వారందరిలో నీదే అగ్రస్థానము. పట్టమహిషిగా నా ప్రక్కన శోభించే హక్కు నీకే ఉంది.

"నా పట్టణము లంక. ఎలా చేరుతామనే శంక నీకు వద్దు. నిన్ను నేను చంకనెత్తుకొని పోతాను. నా నగరం వంక అలా చూస్తే చాలు. ఆ తరువాత స్వర్గాన్నికూడా అభిలషించవు.

"సీతా! లంక ఎలా ఉంటుందని భావిస్తున్నావు? చుట్టూ సముద్రము. సముద్ర మధ్యమున ఎత్తైన పర్వతం మీద ఇంద్రుడి అమరావతిని కాలతన్నేలా ఉంటుంది. ఉద్యానవనాలు ఎంత చక్కగా ఉంటాయనుకున్నావ్. అక్కడ మనం హాయిగా విహరించవచ్చు. ఈ అరణ్యవాసాన్ని నీవే అసహ్యించుకుంటావు.

"సీతా! నీవు నాకు భార్యవవుతావు. వెంటనే ఏమి జరుగుతుందో తెలుసా? నీకు ఐదువేలమంది దాసీలు సేవ చేసేందుకు సిద్ధమవుతారు. ఏమిటలా చూస్తావు? ఇదంతా నిజమా! అని సంశయిస్తున్నావా?" అంటూ శృంగార పైత్యాన్ని ఒలకబోసాడు రావణుడు.

అది విని సీతమ్మ ఉగ్రరూపం ధరించింది. క్రుద్ధురాలై రావణుణ్ణి నిందించింది.

"దుష్టుడా! నేనెవరని భావించి వాగుతున్నావు? సర్వలక్షణ సంపన్నుడు, సత్యసంధుడు, మహాభాగ్యవంతుడు, ఆశ్రితులకు కల్పవృక్షము వంటివాడు, పురుషశ్రేష్ఠుడు అయిన రాముని ధర్మపత్నిని.

"రాముడు పర్వతము వలె స్థిరమైనవాడు. సముద్రం వలె పూర్ణుడు. ఇంద్రుని వంటివాడు. పురుషసింహము. కీర్తిమంతుడు. అట్టి రామునియందు నేను వ్రతనియమము కలిగినదాన్ని.

"రావణా! నేను ఆడసింహాన్ని. నీవు జంబూకానివి. సూర్యుని ముట్టుకోవాలనే ఆలోచన నీకెందుకు కలిగింది? రాముని పత్నిని కోరుచున్నావు. ఇప్పటికే నీకు మృత్యుశకునాలు గోచరించి ఉండాలి.

"భయంకరమైన సర్పము కోరలను వినోదము కొరకు స్పృశించాలని భావిస్తున్నావు. సింహము కోరను లాగాలని ప్రయత్నిస్తున్నావు. కాలకూటవిషాన్ని పానంచేసి హాయిగా ఉండాలనుకుంటున్నావు.

"రాముని భార్యను వాంఛించడ మంటే సూదులతో కళ్ళు తుడుచుకోవడమని, నాలుకతో పదునైన కత్తిని నాకడమని నీకు తెలియదు కాబోలు. మండే అగ్నిని మూటకట్టాలనే నీ ప్రయత్నానికి ఆశ్చర్యంగా ఉంది.

"ఓరీ మృగమా! రాముడెక్కడ? నీవెక్కడ? కాలువకు కడలికి, కడుగునీళ్ళకు అమృతానికి, నక్కకీ సింహానికి ఎంత తేడా ఉందో నీచుడవైన నీకు పురుషోత్తముడైన రామునికి అంత తేడా ఉంది.

**యదన్తరం కాంచన సీసలోహయోః**
**యదన్తరం చందన వారి పంకయోః**
**యదన్తరం హస్తి బిడాల యోర్వనే**
**తదన్తరం దాశరథే స్తవైవ చ ॥**

"ఓరీ మూర్ఖుడా! బంగారానికీ సీసానికి, చందనానికి బురదకు, ఏనుగుకు మార్జాలానికి ఎంత భేదమో రామునికి నీకు అంత భేదముంది.

"ఓరీ గ్రద్దా! రాముడనే గరుత్మంతుని ఎప్పుడైనా చూశావా? ఓరీ కాకీ! రాముడనే హంసను గూర్చి ఎప్పుడైనా విన్నావా? కరినాత్ముడా! కత్తుల మీద నడవాలనే సాహసం ఎందుకు చేస్తున్నావు? నీవు నన్ను హరించడ మంటే వజ్రాన్ని మ్రింగాలని ఈగ ప్రయత్నించినట్లే అవుతుంది;" అంటూ గాలికి చలిస్తున్న అరటిచెట్టులాగా ఊగిపోతూ సీతమ్మ రావణుని నిందించింది.

**శ్రీరామ కేవళ్ క్షీరసముద్ర రావణ ముతాచె థిల్లర్**
**త్యాచె రామీ భోగ తత్పర్ తే శూకర్ నరదేహీ!**

"శ్రీరాముడు క్షీరసముద్రము వంటివాడు. రావణా! నీవు మూత్రపు తిత్తిలాంటి వాడవు. భోగతత్పరుడవు. నరరూప సూకరుడవు" అని భావార్థరామాయణంలో సీతమ్మ రావణుని నిందిస్తుంది.

రావణుడు సీతమ్మతో గాండ్రిస్తూ ఇలా మాట్లాడాడు.

"సీతా! నేను పదితలలవాణ్ణి. కుబేరుని సవతి తమ్ముణ్ణి. రావణుడంటేనే గొప్ప పేరు ఈ ప్రపంచంలో. చావును చూచి జనులు ఎలా భీతిచెందుతారో, నా పేరు వినగానే దేవ దానవ, గంధర్వ పిశాచ, పతగ ఉరగాదులు అలా భీతిచెంది పరుగులు తీస్తారు.

"నా సవతి సోదరుడైన కుబేరుడు నన్ను ఎదుర్కోలేక తన నగరాన్ని త్యజించి కైలాస పర్వతముపై నివసిస్తున్నాడు. నావద్ద నున్న పుష్పక విమానము ఆ కుబేరునిదే. సీతా! నాకు కోపం వచ్చిందని వినగానే దేవేంద్రునితో సహా దేవతలందరూ పారిపోయి దాక్కుంటారు.

"పిచ్చిదానా! నేను కదిలితే గాలి కదలడం మానేస్తుంది. ప్రచండమైన కిరణములతో ప్రకాశించే సూర్యుడు హిమవంతుని లాగా చల్లబడతాడు. నేను చరించే ప్రదేశాల్లో చెట్ల ఆకులుకూడా చలించవు. నదులు భయంతో మెల్లగా దొర్లుతూ పోతాయి.



"బంగారు మేడలతో, వైడూర్య మణులతో కూడిన తోరణాలతో, దీప్తిమంతమైన లంకాపట్టణములో దేవమనుష్యాదులకు అలభ్యమయ్యే భోగాలను అనుభవిస్తూ, నాతో విహరించే నీవు అల్పాయుష్కుడైన ఆ రాముని క్షణంలో మరచిపోతావు.

"పిచ్చిదానా! జ్యేష్ఠుడైనా రాముణ్ణి అడవులకు పంపి, దశరథుడు భరతునికి రాజ్యాన్ని ముట్టచెప్పడంలోనే రాము డెంతటి పరాక్రమవంతుడో తెలుస్తూ ఉంది.

"సీతా! రాముడు రాజ్యభ్రష్టుడు. దీనుడు. బుద్ధిహీనుడు. బలహీనుడు. తాపసి. అతడితో నీవేమి సుఖిస్తావు? రాక్షస ప్రభువునైన నేను మన్మథహారాలను మెడలో ధరించి, నిన్ను కాంక్షించి వచ్చాను. కామించి వచ్చాను. నన్ను నిరాకరించకు.

"పూర్వము ఊర్వశి పురూరవుణ్ణి కాదని తరువాత పశ్చాత్తాపం చెందింది. నీవు అలాంటి అనాలోచితమైన పని చేయకు.

**అంగుల్యా న సమో రామో మమ యుద్ధే న మానుషః**
**తవ భాగ్యేన సంప్రాప్తం భజస్వ వరవర్ణినీ!**

"సీతా! మానవమాత్రుడైన ఆ రాముడు సమరరంగంలో నా కాలిగోటికి సరిపోడు. చూడు. నీ అదృష్టంకొద్దీ నేను వచ్చాను. సరేనను;" అన్నాడు దుష్టుడైన రావణుడు.

రావణుని మాటలు సీతను మరీ కోపానికి గురిచేశాయి. ఆమె కళ్ళు చింతనిప్పుల్లా తయారయ్యాయి. నిర్జనమైన ఆ అరణ్యంలో నిర్భయంతో ఇలా మాట్లాడింది.

"కుబేరుడు పూజార్హుడు. అట్టివానిని నీ సోదరుడని చెప్పుకుంటూ ఇలాంటి నీచపు పనులకు దిగజారడానికి నీకు సిగ్గులేదూ? క్రూరుడా! దుష్టుడా! ఇంద్రియలోలుడనైన నీవల్ల నీ రాక్షసవంశమంతా నశించిపోతుంది.

**అపహృత్య శచీం భార్యాం శక్యమింద్రస్య జీవితుమ్**
**న చ రామస్య భార్యాం మామపనీయాస్తి జీవితమ్.**

"ఇంద్రుని అర్ధాంగి శచీదేవిని అపహరించి జీవించవచ్చునేమో గాని రాముని భార్యను అపహరించినవాడు అమృతం త్రాగినా జీవించడు;" అని క్రోధంతో పలికింది సీతమ్మ.

## సీతాపహరణము

సీతమ్మ మాటలకు రావణుడు ఆవేశపరు డయ్యాడు. చేతిలో చెయ్యేసి నొక్కుకున్నాడు. శరీరాన్ని క్షణంలో పెంచేశాడు.

"సీతా! నాకెందుకో సందేహంగా ఉంది. నీకు కొద్దైనా పిచ్చి ఉండాలి. నా శక్తి సామర్థ్యాలను నేనే చెప్తున్నా నీవు వినిపించుకోవడం లేదు.

"భూమిని అరచేతిలో నిలుపుకోగలను. సముద్రాన్ని గుటగుట తాగేస్తాను. యుద్ధభూమిలో నిలబడ్డానా! చావునే చంపేస్తాను.

"ఆగమంటే సూర్యుడు ఆగిపోతాడు. బాణాలు సంధించి భూమిని చీల్చి పడెయ్యగలను. కోరిన రూపం ధరించగలను. నీకు కోరికలు తీరకపోవడం అంటూ ఉండదు. నాకు భార్యవయిపో!" అంటూవుండగనే రావణుని కళ్ళు ఎరుపెక్కాయి.

రావణుడు సన్యాసి రూపాన్ని త్యజించాడు. రాక్షసరూపాన్ని ధరించాడు. పదితలలతో భీకరంగా గోచరించాడు. నీలమేఘంలా ధనుర్బాణాలు ధరించి నిలబడ్డాడు.

"సీతా! చివరిమాటగా చెప్తున్నా. బుద్ధి కలిగి విను. ఎదురొచ్చిన సంపదను కాలదన్నకు. ముల్లోకాలలో గొప్పవాడైన భర్త నీకు కావాలా? చెప్పు. కావాలా! అయితే అట్టివాడు నేనే. నీకు తగిన మొగుణ్ణి నేనే.

"నాతో హాయిగా జీవించు. నీవు సగర్వంగా చెప్పుకో కలిగిన భర్తను. నీ మాట ఎప్పుడూ దాటను. నువ్వు ఎలా చెబితే అలా వింటా. నీ మనసును రాముడినుండి పీకేసి నాకు తగిలించేయి.

"ఓసీ పిచ్చిదానా! మూర్ఖురాలా! అహంభావంతో అన్యాయం గాకు. పిరికిపంద ఆ రాముణ్ణి ఏం చూసి ప్రేమిస్తున్నావు? తప్పు నీదికాదు. నీదెలా తప్పవుతుంది? ఇంతకాలంగా నేను నీకు కనిపించకపోవడం నాదే తప్పు," అంటూ కామంతో కళ్ళు పూడుకుపోయిన రావణుడు, ఆకాశమున బుధుడు రోహిణిని సమీపించినట్లు సీతను సమీపించి ఆమెను పట్టుకున్నాడు. ఎడమచేత్తో జుట్టు పట్టుకొని, కుడిచేత్తో తొడలు పట్టుకొని ఎత్తుకున్నాడు.

భయంకరమైన కోరలతో మృత్యువువలె గోచరిస్తున్న రావణుణ్ణి చూసి భయార్తులైన వనదేవతలు పారిపోయారు. వెంటనే కంచరగాడిదలు పూన్చిన కాంచనరథం అక్కడ ప్రత్యక్షమైంది.

పరుషవాక్కులతో రావణుడు సీతమ్మను బెదిరిస్తూ, భయపెడుతూ రథం ఎక్కి, సీతను ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు.

సీతమ్మ భయంతో దుఃఖిస్తూ 'రామా-రామా' అని అరచింది. పాములాగా సీతమ్మ మెలికలు తిరిగిపోతూ, రావణుని భీకరరూపాన్ని చూచి పిచ్చిదానివలె రోదించింది.

"అయ్యో! లక్ష్మణా! పెద్దలను సదా సుఖపెట్టే నీకు ఈ దురాత్ముడు నన్ను ఎత్తుకపోతున్నాడని తెలియదుకదా!

"అయ్యో! రామా! ధర్మం కొరకు సుఖాలను త్యజించావు. సంపదలను త్యాగం చేశావు. జీవితాన్నే త్యాగం చేశావు. కానీ అధర్మపరుడైన ఈ దుష్టుడు నన్ను అపహరిస్తున్నాడే! నువ్వు చూడటంలేదు ఎందుకని? రామా! నన్ను రక్షించ వెందుకని? ఈ పాపాత్ముని నీవు సంహరించుట లేదు ఎందుకని?

"రావణా! నీకు చెడురోజులు చేరువవుతున్నాయి. అందుకే పాపిష్టికార్యం చేస్తున్నావు. రామబాణముతో నీవు నేలకూలేది ఖాయం. దీనిని ఎవరూ తప్పించలేరు.

"ధర్మాత్ముడైన రాముని అర్ధాంగియగు నన్ను ఈ రాక్షసుడు అపహరిస్తున్నాడు. కైకేయి కోరిక నేరవేరింది. రాముని ఇంతకన్నా కైకేయి ఏమి బాధించగలదు?

"ఓ కొండగోగు మాకుల్లారా! రావణుడు సీతను హరించుకొని పోతున్నాడని రాముడికి తెలియచేయండి. ఓ పర్వతమా! రావణుడు సీతను తీసుకొని పోతున్నాడని నా రామునికి తెలియచేయి.



"ఓ పుణ్యగోదావరీ! నీకు నమస్కరిస్తున్నాను. రావణుడు సీతను అపహరిస్తున్నాడని తొందరగా నా రామునికి చెప్పు. ఓ వనదేవతలారా! ఈ పాపి నన్ను అపహరిస్తున్నాడని రాముడికి చెప్పండి.

" ఓ మృగాల్లారా! పక్షుల్లారా! ప్రాణుల్లారా! మిమ్మల్నందరినీ శరణువేడుచున్నాను. నేను రామునికి ప్రాణములకంటె మిన్నయైన దాన్ని. నిస్సహాయురాలిగా ఉన్న నన్ను రావణుడు అపహరిస్తున్నాడు. మీరందరూ నా భర్తతో తొందరగా చెప్పండి. నా భర్త యమునికూడా జయించగలడు;" ఇలా పలుకుతూ ఆ ప్రాంతంలో చెట్టుపైనున్న జటాయువును చూచింది.

" ఓ జటాయూ! ఓ జటాయూ! ఈ దుర్మార్గుడైన రావణుడు నన్ను అనాథలాగా భావించి హరిస్తున్నాడు. జటాయూ! నువ్వు దగ్గరికి రాకు. వీడు దుర్మార్గుడు. క్రూరుడు. ఆయుధములు గలవాడు. నువ్వు వీణ్ణి ఎదుర్కోలేవు.

"జటాయూ! నా అపహరణమును గూర్చి రామలక్ష్మణులకు యథాతథంగా చెప్పు;" అని అరచింది సీతమ్మ.

సీతమ్మ పలుకులు జటాయువుకి వినిపించాయి. జటాయువు ఉలిక్కిపడి చూచింది. సీతమ్మను తీసుకపోతున్న రావణుని చూచి, వెంటనే జటాయువు ఇలా పలికింది.

"ఓరీ రావణా! నేను సనాతనధర్మ మార్గమున చరించు గృధ్రరాజును. నాపేరు జటాయువు. నేను సత్యాశ్రయుడను. ధర్మమూర్తి, దశరథుని కుమారుడు అయిన శ్రీరాముని ధర్మపత్నిని నీవు అపహరిస్తున్నావు.

"రాజువైన నీవు ధర్మాన్ని కాపాడాల్సింది పోయి పరస్త్రీలను స్పృశిస్తావా? పరపురుషుల నుండి తన భార్యను ఎలా రక్షించుకుంటాడో, రాజైనవాడు పరపురుషుల భార్యలను అలా రక్షించాలి. పరస్త్రీని తాకడం అధర్మం.

"రాముడు నీకు ఏమి అపకారం చేశాడు? నా మాట విను. సీతను విడిచిపెట్టు. ఆమె సంకల్పిస్తే నీవు గడ్డిలా తగలబడిపోతావు. కోఱల్లో విషాన్ని నింపుకొని యున్న భయంకరమైన సర్పాన్ని తెలియక ఒడిలో పెట్టుకున్నావు. నామాట విను. మృత్యుపాశము నీ మెడను అలంకరించి వుంది.

"మోయలేని భారాన్ని తలకెక్కించుకోవడం మంచిది కాదు. ఆరోగ్యాన్ని పాడుచేసే ఆహారాన్ని భుజించడము యుక్తము కాదు. నీవు చేసే అపహరణములో నీ మరణము దాగి ఉంది. నామాట విను.

"రావణా! నా వయస్సు అరవైవేల సంవత్సరాలు. నేను వృద్ధుణ్ణి. నీవు యువకుడవు. నీకు రథము, ఆయుధాలు ఉన్నాయి. నేను రిక్తహస్తాలతో ఉన్నాను. అయినా నీవు సీతను తీసుకొని వెళ్ళుటను నేను జరుగనివ్వను.

**న శక్తస్త్వం బలాద్ధర్తుం వైదేహీం మమ పశ్యతః**
**హేతుభిర్న్యాయ సంయుక్తై ర్ధ్రువాం వేదశ్రుతీ మివ**

"యుక్తియుక్తములైన తర్కములతో శ్రుతిప్రమాణాన్ని ఎలా ఖండించలేరో అలాగే నేను చూస్తూ వుండగా నీవు సీతను అపహరించలేవు.

"రావణా! ఆగు! నీవు వీరుడవేనా! అయితే నాతో పోరాడు. పూర్వము నీ సోదరుడు ఖరుడు రాలినట్లు రాలిపోతావు. నేను బ్రతికి ఉండగా నీవు సీతను తీసుకొనిపోలేవు. రాముని

కొరకు నేను ప్రాణాల్ని కూడా లెక్కచేయను. ఒరేయ్! తొడిమ నుండి ఊడిన పండు క్రిందపడునట్లు నీవు రథంనుండి నేలపడ్తావు.

## వీర జటాయువు

జటాయువు మాటలు విని రావణుడు క్రుద్ధుడయ్యాడు.అతని ఇరవైకళ్ళూ నిప్పుల్లా ఎరుపెక్కాయి. రావణుడు పౌరుషంతో జటాయువు మీదికి ఉరికాడు. రావణ జటాయువుల పోరాటము భయంకరంగా సాగింది. గాలికి చెదిరి ఆకాశంలో ఎగిరే రెండు మేఘాలు బలంగా ఢీకున్నట్లు ఉండింది. రెండు పర్వతాలు పరస్పరము పోరాడుతున్నట్లు గోచరించింది.

రావణుడు జటాయువుపై దారుణమైన బాణాలను ప్రయోగించాడు. రావణుడు సంధించే అస్త్రాలను తట్టుకుంటూ తన వాడియైన గోళ్ళతో రావణుని ఎదుర్కొని తీవ్రంగా గాయపరచింది జటాయువు.

ఉక్కుమొనలు గల భయంకరమైన శరాల్ని ప్రయోగించి జటాయువు దేహాన్ని రావణుడు గుల్ల చేశాడు. అయినా సడలని పౌరుషముతో జటాయువు రావణునిపై బడి అతని ధనుస్సును, బాణాన్ని విరిచేసింది.

క్రుద్ధుడైన రావణుడు కొన్ని వందల బాణాలను జటాయువుపై ప్రయోగించాడు. దేహమంతా బాణాలు గుచ్చుకోగా గూటిలోని పక్షిలాగా జటాయువు కన్పించింది. అయినా జటాయువు జడవకుండా రావణుని ధనుస్సును ముక్కలు చేసింది. కవచాన్ని ఛేదించి క్రింద పడేసింది.



రావణుని కాంచనరథానికి పూన్చిన కంచర గాడిదలను జటాయువు చంపేసింది. సారథిని వధించింది. రథాన్ని ముక్కలు ముక్కలుగా విరగగొట్టింది. సీతను ఒడిలో పెట్టుకొనియున్న రావణుడు వెంటనే నేలమీద పడ్డాడు.

నేలపై బడిన రావణుని చూచి వనదేవతలు, పంచభూతాలు జటాయువును శ్లాఘిస్తూ ఆనందించారు. రావణుని దారుణ బాణాలచే కొట్టబడిన ముసలి జటాయువు అలసిపోయినట్లు అగుపించింది. అది చూచి సంతోషపడిన రావణుడు సీతమ్మను ఎత్తుకొని ఆకాశంలో పక్షిలా ఎగిరిపోతున్నాడు.

పారిపోతున్న రావణుని జటాయువు చూచింది. తన శక్తినంతా కూడగట్టుకొని రావణుని అడ్డగించింది. రావణుని వీపుపై వాలింది. అంకుశముతో మావటివాడు మదపు టేనుగును పొడిచినట్లు, వాడియైన తన ముట్టెతో రావణుని తీవ్రంగా గాయపరచింది.



రావణుని పది ఎడమ భుజాలను క్షణాలమీద ఖండించింది. క్రిందపడిన ఆ పదిభుజాలు పగపట్టిన పాములు పుట్టనుండి లేచినట్లు కదిలి మళ్ళీ రావణుని అలంకరించాయి.

పక్షిరాజు పరాక్రమం ముందు రాక్షసరాజు బలహీను డవుతున్నట్లు కనిపించాడు. సీతను క్రింద దింపి, ఖడ్గమును పిడికిలితో పట్టుకొని, తన బలాన్నంతా ప్రయోగించి జటాయువు రెక్కలను, ప్రక్కలను, పాదాలను దారుణంగా నరికేశాడు.

రామునికొరకు భయంకరంగా పోరాడిన మహాత్ముడగు జటాయువు కొనఊపిరితో నేలకొరిగాడు. రక్తసిక్తమైన దేహంతో క్రిందపడి యున్న జటాయువును చూచి సీతమ్మ బిగ్గరగా రోదిస్తూ, ఆత్మీయుడైన జటాయువు వద్దకు పరుగెత్తింది. తీవ్రంగా గాయపడిన జటాయువు ఆరిపోతున్న అగ్నిలాగా అగుపించింది.

సీతమ్మ క్రిందపడియున్న జటాయువును పట్టుకొని రోదించింది. గుండెలకు హత్తుకుంటూ విలపించింది.

"అయ్యో! జటాయూ! నాకోసం పోరాడావు. దేహాన్ని ఈ వృద్ధాప్యంలో శిథిలం చేసుకున్నావు. కొన ఊపిరితో మిగిలావు. నిన్ను చూస్తుంటే నా గుండె తరుక్కుపోతోంది.

"తండ్రీ! దశరథుని స్నేహితుడవని నిన్ను తన తండ్రిలాగా రాముడు భావించాడు. బిడ్డల్ని కాపాడే తండ్రిలాగా చివరిక్షణం వరకు పోరాడావు. మా మామగారు దశరథమహారాజు పునర్జీవితులై వచ్చినట్లు నాకనిపించింది.

"జటాయూ! మమ్మల్ని వదలి వెళ్తున్నావా? మమ్మల్నంతా ఋణగ్రస్తుల్ని చేసి పుణ్యలోకాలకు పోతున్నావా? తండ్రీ! మా నాన్న జనకుడు నా కళ్ళముందు ఉన్నట్లుంది" అని సీతమ్మ రోదిస్తూ ఉంది.

జటాయువు మూతబడుతున్న నేత్రాలను బలంగా తెరుస్తూ సీతమ్మను వీక్షిస్తోంది. ఏమీ చేయలేక పడియున్న తన నిస్సహాయతకు పరితపిస్తున్నట్లు గోచరిస్తూ ఉంది. ఎండిపోయిన నాలుకను మాటిమాటికి చప్పరిస్తూ ముందుకు చాస్తూవుంది.

రావణుడు ఈలోగా సీతను సమీపించాడు. రావణుని చూచి భయకంపితురాలైన సీత 'రామా-రామా' అంటూ అరుస్తూ చెట్లమధ్య పరుగెత్తింది. రావణుడు వెంబడించి పరుగెత్తాడు.

సీతమ్మ రాముని పట్టుకున్నట్లు ఒక పెద్ద వృక్షాన్ని వాటేసుకుంది. "ఛీ! విడువు. ఆ చెట్టును వదులు" అని కేకలేస్తూ సీతమ్మ జుట్టును గట్టిగా పిడికిటితో పట్టుకున్నాడు దుష్టుడైన రావణుడు..

గాలి స్తంభించింది. సూర్యుడు మందగించాడు. ప్రకృతి నిశ్చేష్టురాలైంది. ప్రపంచమంతా కాంతిహీన మైంది. దివ్యదృష్టితో ఇదంతా వీక్షించిన బ్రహ్మదేవుడు, "అనుకున్న కార్యము అయినట్లే" అన్నాడు.

"ఈనాటితో వీడి బ్రతుకు అంతరించింది. వీడికి ఇక మరణమే మిత్రుడు" అని ఋషులు సంతోషించారు. సీతమ్మ దీనావస్థను గాంచి వెంటనే దుఃఖించారు కూడా.

ధనుస్సు నుండి దూసుకుపోతున్న బాణం లాగా సీతమ్మను చంకనెత్తుకొని 'రామా-రామా, లక్ష్మణా-లక్ష్మణా' అంటూ ఆకాశమార్గాన రివ్వున ఎగిరిపోతున్నాడు రావణుడు.

సీతమ్మ రోదిస్తూనే ఉంది. మెరుపులా ప్రకాశిస్తున్న సీతమ్మను పట్టుకొని పర్వతరూపుడై పక్షిలా వెళ్తున్నాడు రావణుడు.

**ఉద్ధూతేన చ వస్త్రేణ తస్యాః పీతేన రావణః**
**అధికం పరిబభ్రాజ గిరిర్దీప్త ఇవాగ్నినా**

"సీతమ్మ పచ్చని పట్టుచీరకొంగు గాలికి ఎగురుతూ ఉండగా, రావణుడు కాలిన కొండలాగా ప్రకాశిస్తున్నాడు," అని పలికి మనల్ని ఊహాలోకాలకు పట్టుకపోతున్నాడు వాల్మీకిమహర్షి.

సీతమ్మ పచ్చని పట్టుచీర పైటచెంగు అగ్నిశిఖల వలె ప్రకాశిస్తున్నది అంటున్నాడు మహర్షి. రావణుడు కొండతో పోల్చబడ్డాడు. సీతమ్మను ఎత్తుకొని ఆకాశంలో దూసుకుపోతున్న రావణుడు అగ్నితప్తమైన కొండలాగా తెలుస్తున్నాడు అంటున్నాడు వాల్మీకి.

అగ్ని పవిత్రమైంది. సీతమ్మ కూడా పవిత్రురాలే. రావణుడు సీతమ్మను స్పృశించి, అపహరిస్తున్న సమయంలో కూడా సీతమ్మతల్లి అగ్నిలాగా పవిత్రురాలై ఉంది.

అపహరణంలో ఎలా పవిత్రురాలో పరిగ్రహణంలో కూడా పవిత్రురాలే. రావణుడు పట్టుకపోయే సమయంలో ఎలా అగ్నిలా గోచరిస్తున్నధో, రాముడి ప్రక్కన నిలబడే ముందు కూడా అగ్నిలో నుండే బహిర్గత మౌతుంది సీతమ్మ. ఆద్యంతముల యందు అగ్నిలా గోచరించిన సీతమ్మ లంకలో వసించిన మధ్యకాలంలో కూడా అగ్ని మధ్యమున ఉన్నదానివలె పవిత్రురాలై శోభించింది అని భావము.

సీతమ్మ పవిత్రాగ్నితో పోల్చబడగా రావణుడు కొండతో పోల్చబడ్డాడు. కొండలాగా నల్లనైనవాడు అనే బాహ్యార్థమే కాకుండా బండలాంటి గుండె కలవాడు అని అంతరార్థము.

పర్వతము కదలదు. దాన్ని ఎవరూ కదిలించలేరు. అలాగే రావణుడు కూడా కొండలాగా కదలని, మారని మొండివాడు. మారీచుడు ఎంతో చెప్పి చూశాడు. ఏమి ఉపయోగం? బండబ్రతుకు అంతే. కొండబ్రతుకు అంతే.

కొండ ఎంత ఉన్నతమైనది అయినా కొండ నాశ్రయించిన అగ్ని పర్వతాన్ని దహించి వేస్తుంది. అంతేకాదు. కొండను అంటిపెట్టుకొని యున్న అరణ్యాల్ని కూడా కాల్చేస్తుంది.

రావణుడు గొప్పవాడే కావచ్చు. సీత అనే అగ్నిని స్పృశించడం వల్ల కొండలా కాలిపోతాడని భావం. కొండను ఆశ్రయించి యున్న అరణ్యాలవలె రావణుని ఆశ్రయించుకొని యున్న రాక్షసులు కూడా దగ్ధమై పోతారని కూడా అర్థము. ఈ విషయాన్ని పవిత్రాత్ముడైన జటాయువు, మహాత్ముడైన మారీచుడు ఇద్దరూ రావణునికి చెప్పియే యున్నారు.

ఈ సీతాపహరణ సన్నివేశాన్ని మరొక ఉపమానంతో కూడా వర్ణిస్తున్నాడు వాల్మీకి.

**తరుప్రవాళ రక్తాసా నీలాంగం రాక్షసేశ్వరమ్**
**ప్రాశోభయత వైదేహీ గజం కక్ష్యేవ కాంచనీ ॥**

"చిగురుటాకు వలె ఎర్రగా వున్న సీత, నల్లని దేహముగల రావణుని బంగారు వడుముత్రాడు కట్టిన ఏనుగులాగా ప్రకాశింపచేసింది."



ఇది మహర్షి తెలిపిన రెండవ ఉపమానం. సీతమ్మ స్వర్ణానికే శోభనిస్తుంది. సీతమ్మ చిగురుటాకు వలె ఎర్రగా ప్రకాశిస్తోంది. రావణుడు అసురుడు. అసురులను గజములతో పోల్చడము శాస్త్రీయమే. గజాసుర శబ్దము మనకు తెలియనిది కాదు. స్పర్శేంద్రియానికి గజము బానిస. కామాంధులైన రాక్షసులు అందుకే గజముతో పోల్చబడ్డారు.

ఏనుగు వలె మదించిన రావణుడు సీతమ్మ అనే బంగారు నడుముత్రాడును అలంకరించి యున్నాడు. బంగారు త్రాడుతో కట్టబడిన ఏనుగులాగా తెలుస్తున్నాడు.

త్రాడు బంధానికి కారణము. బంగారైనా, ఇనుమైనా బంధము బంధమే. సీతాపహరణము వలన రావణుడు మృత్యుపాశానికి బంధించబడ్డాడని భావము.

ఏనుగుకు చుట్టబడినంత మాత్రాన బంగారు విలువ తరగదు. రావణుడు స్పృశించినంత మాత్రాన, అపహరించినంత మాత్రాన సీతమ్మ పవిత్రతకు భంగం వాటిల్లదు.

అంతేకాదు. ఏనుగు నెత్తిన ఎవరో దుమ్ము పోయనవసరం లేదు. ఆమాత్రం చొరవ దానికే ఉంది. అలాగే రావణునికి ఎవరూ చెడును తలపెట్ట పనిలేదు. చెడిపోయేందుకు అనువైన పనులన్నీ చెడకుండా తానే జాగ్రత్త పడుతాడు.

తనకు చుట్టబడియున్న బంగారము విలువ ఏనుగుకెలా తెలియదో తన సమీపమునవే ఉన్న సీతమ్మ వైభవము రావణునికి కూడా అలా తెలియదు.

వాల్మీకి తెలిపే మూడవ ఉపమానం.

**తాం మహోల్కా మివాకాశే దీప్యమానాం స్వతేజసా**
**జహారాకాశ మావిశ్య సీతాం వైశ్రవణానుజః ॥**

"స్వప్రకాశంతో మహోల్కలాగా మెరిసిపోతున్న సీతను రావణుడు ఆకాశమార్గాన అపహరించాడు;" అంటున్నాడు మహర్షి.

ఈ శ్లోకంలో సీతమ్మను గొప్పదైన ఉల్కతో పోల్చాడు వాల్మీకి. ఉల్క ఎక్కడ పడుతుందో ఆ ప్రాంతము దగ్ధమౌతుంది. సీతమ్మ మహోల్క. ఆమె సామాన్యమైనది కాదు. గొప్పదైన అగ్ని పిండము. అట్టి సీతమ్మ లంకలో ప్రవేశించడం వల్ల గొప్ప అగ్నిప్రమాదమే సంభవించవచ్చు. లంకంతా బూడిద కావచ్చు అని అర్థము. ఇది వాల్మీకిమహర్షి భవిష్యద్వాణి.

మహాభక్తశిఖామణి హనుమంతునివల్ల లంక దహనం కాగా, ధర్మాత్ముడైన రాముని దారుణ బాణాలకు గురియై దగ్ధమైపోతుంది కదూ!

ఈ శ్లోకంలో రావణుని "వైశ్రవణానుజః" అన్నాడు వాల్మీకి. అంటే కుబేరుని తమ్ముడని అర్థము.

రావణుడు తన సవతి సోదరుడైన కుబేరుని తరిమికొట్టి అతని సంపదను అపహరించాడు. ఈనాడు సీతమ్మ అనే మహోల్క లంకలో ప్రవేశించడము వలన ఆ సంపదనంతా రావణుడు పోగొట్టుకుంటాడు అని భావము.

ఈవిధంగా సీతాపహరణ సన్నివేశాన్ని మూడు ఉపమానాలతో ముచ్చటగా వర్ణించాడు వాల్మీకి.

ఇక్కడ ఒక విషయాన్ని మనం మననం చేసుకోవాలి. పంచవటిలో రావణుడు సీతను సమీపించేటప్పుడు ఆ సన్నివేశాన్ని మూడు ఉపమానాలతో వర్ణించాడు వాల్మీకిమహర్షి.

అలాగే రావణుడు ఆకాశమార్గాన సీతమ్మను అపహరించే సమయంలో మళ్ళీ ఇక్కడ మూడు ఉపమానాలతో వర్ణించాడు ఆదికవి.

మహర్షి వర్ణించిన ఈ సన్నివేశాలలో దివ్యమైన సామ్యములు, కర్మఫలాలు, భవిష్యద్దర్శనము, మనస్తత్వాలు ఎలా ప్రదీప్తమయ్యాయో చూడవచ్చు. పైగా ఈ రెండు సన్నివేశాలకు మూడేసి ఉపమానాలే ప్రత్యేకంగా ఇవ్వడం గమనార్హం.

రావణుడు అజ్ఞానము. సీతమ్మ పవిత్రతకు ప్రతిరూపము. అనగా జ్ఞానము. ప్రపంచంలో జ్ఞానమే పవిత్రమైనది.

**న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే**

ఈ ప్రపంచములో జ్ఞానముకన్నా పవిత్రమైన వస్తువు లేదని భగవద్గీత.

అజ్ఞానము జ్ఞానమును మూడు దశలలో ఆవరిస్తుంది. దేహము, ఇంద్రియములు, మనస్సు ఈ మూడింటిని అజ్ఞానము ఆవరిస్తుంది. రావణుడు అజ్ఞానస్వరూపము గనుక జ్ఞానరూపిణి యైన సీతమ్మను ఆశ్రయించే ఆ సన్నివేశాలకు మూడేసి ఉపమానాలు ఇచ్చాడు వాల్మీకి. అజ్ఞానము మూడు స్థాయిలలో ప్రత్యక్షమౌతుంది అని చెప్పడానికే అలా చేశాడు. త్రిపుటిలోనే అజ్ఞానము దర్శనమిస్తుంది. సీతాపహరణము పంచవటిలో జరగడంలోని అంతర్భావము కూడా ఇదే.

పాంచభౌతికమై, పంచకోశములను పొదివి పట్టుకొనియున్న దేహమే పంచవటి. పంచవటిలో రాము డున్నంతవరకు రావణుడు ప్రవేశించలేడు. రాముడు సీతమ్మకు దూరం కాగానే రావణుడు ప్రవేశించాడు.

దేహంలో వసించు జీవాత్మయే సీతమ్మ. జీవాత్మయనే జానకి పరమాత్మయైన రామునికి దగ్గరగా ఉన్నంతకాలము అజ్ఞానమనే రావణుడు ప్రవేశించి హాని తలపెట్టలేడు. సుఖజీవనాన్ని భగ్నం చేయలేడు.

రామునితో హాయిగా జీవిస్తున్న సీతమ్మ మనస్సు బహిర్ముఖమై బంగారు జింకను వాంఛించింది. ఈ ప్రపంచంలోని విషయసుఖాలన్నీ మాయా స్వరూపాలే. బంగారు జింకలే.

కోరికలు దుఃఖానికి మిత్రులు. హరిణిని వాంఛించిన సీతమ్మ హరికి దూరమైంది. విషయ సుఖాలలో రమించాలని భావించే జీవుడు శాంతికి దూరుడవుతాడు. రావణుడు సీతమ్మను హరించునట్లు అజ్ఞానము శాంతిని హరిస్తుంది. కనుక వాంఛలు ఏనాడైనా ముంచేవే గాని తేల్చేవికావు.

రావణుడు సీతమ్మను ఆకాశమార్గాన ఎత్తుకొని పోతున్నాడు.

రత్నఖచితమైన సీతమ్మ కాలి అందె జారిపోయి మధురమైన ధ్వనితో క్రిందపడింది. సీతమ్మ అలంకరించుకొని యున్న ఆభరణాలు తెగిపోయి అక్కడక్కడ భూమిపై బడి నక్షత్రాల్లాగా మెరుస్తున్నాయి.



ఆమె వక్షస్థలమునందు ప్రకాశిస్తున్న ముత్యాలహారము కూడా జారి క్రిందపడింది. రావణుడు ఆకాశమార్గాన వేగంగా దూసుకు పోతున్నాడు. ఆ వేగానికి పెద్దపెద్ద చెట్లు తీవ్రంగా చలించిపోయాయి. ఊగుతున్న చెట్లకొమ్మలు "భయపడకు-భయపడకు" అని సీతమ్మను ఊరడించినట్లున్నాయి. అరణ్యంలోని పులులు, సింహాలు, లేళ్ళు, వన్యమృగాలన్నీ దుఃఖముతో క్రుంగిపోయి, రావణునిపై కోపించి, వాడి నీడను అనుసరిస్తూ భూమిమీద పరుగెత్తాయి.

సీతాపహరణమును గాంచిన పర్వతాలు జలపాతాలనే కన్నీళ్ళను కార్చుతూ, శిఖరాలనే చేతులెత్తి ఏడుస్తున్నట్లు గోచరించాయి.

**నాస్తి ధర్మః కుతః సత్యం నార్జవం నానృశంసతా**

**యత్ర రామస్య వైదేహీం భార్యాం హరతి రావణః**

**ఇతి సర్వాణి భూతాని గణశః పర్యదేవయన్**

"రాముని భార్యయైన సీతను రావణుడు అపహరించుకొని పోతున్నాడు. ఇక ధర్మమెక్కడుంది? సత్య మెక్కడుంది? ఋజుత్వానికి స్థాన మెక్కడ? మంచితనానికి మనుగడెక్కడ?" అని సర్వభూతాలు విచారించాయి.

"రామా-లక్ష్మణా" అంటూ సీతమ్మ ఏడుస్తోంది. రామలక్ష్మణులు కనిపిస్తారేమో నని మాటిమాటికి భూమిని చూస్తుంది భూసుత.

సీతమ్మ జుట్టుముడి విడిపోయింది. కొప్పున నిలిచిన పూలు రాలిపోయాయి. తిలకం చెరిగిపోయింది. ఇంతకన్నా రావణుని వినాశానికి ఏమికావాలి?

"దుష్టుడా! గొప్పలు చెప్పుకున్నావే, ఒంటరిగా వున్న స్త్రీని అపహరించుటకు సిగ్గులేదూ! ఛీ! నీవు చరిత్రహీనుడవు. పిరికిపంద లాగా వాయువేగంతో నన్ను హరిస్తున్నావు. శూరుడవైతే పారిపోవడ మెందుకు? క్షణం ఆగి నా భర్తముందు నిలబడు. తరువాత నీవు పారిపోనవసరం లేదు. నీనుండి నీ ప్రాణాలు పారిపోతాయి.

**సన్యాసీ అణి చోరి కరీ యతి ధర్మీ అణె పరద్వారీ**

**హెతుజచి సాజెగా థోరీ తూ నానాపరీ మాతృగమనీ!**

"సన్యాసిగా వచ్చి దొంగలించావు. యతిగా వచ్చి పరసతిని హరించావు. ఇది నీకు భావ్యమా! నీవు తల్లిని కాంక్షించే క్రూరాత్ముడవు" అని నిందిస్తుంది భావార్థరామాయణంలో సీతమ్మ.

"క్రూరాత్ముడా! నామాట విని నన్ను విడిచిపెట్టు. లేదా నీ బ్రతుకే సమాప్తమవుతుంది. రాముణ్ణి శత్రువుగా చేసికొని ఎంతకాలం జీవించగలవు? నీకు మృత్యుకాలం దాపురిస్తోంది.

**న నూనం చాత్మనః పథ్యం శ్రేయోవా సమవేక్షసే**

**మృత్యుకాలే యథా మర్త్యో విపరీతాని సేవతే।**

చచ్చేకాలం చేరువైనపుడు మానవుడు విపరీతంగా ప్రవర్తిస్తాడు. ఓరీ దుష్టుడా! నీ శ్రేయస్సును నీవు పట్టించుకోవడం లేదు. ఏది నీకు మంచో అది నీకు శత్రువులా తెలుస్తోంది. విషం త్రాగినవాడు ఎంతకాలం జీవిస్తాడురా! రామునికి ద్రోహం చేసిన నీకు ఈ భూమితో ఋణం తీరిపోయింది;" అని భయశోకాలతో కుమిలిపోతున్న సీత కుపితయై పరుషంగా

మాట్లాడింది. అయోగ్యుని చెవుల్లో ప్రవేశించిన తత్త్వజ్ఞానం లాగా ఆమె మాటలు రావణునిపై ప్రభావాన్ని చూపలేదు.

## లంకలో సీతమ్మ

రావణుడు సీతమ్మ నపహరించి ఆకాశంలో విహంగంలా తేలిపోతున్నాడు. ఈలోగా ఐదుమంది వానరులు ఒక పర్వతశిఖరముపై సీతమ్మకు కన్పించారు. వెంటనే తన ఆభరణములు కొన్నిటిని ఉత్తరీయంలో మూటగట్టి ఆ వానరుల మధ్య విడిచింది. వారు రామునికి చెప్తారేమోనని భావించి అలా చేసింది. తొందరగా పయనించాలనే ఉబలాటంతో ఉన్న రావణుడు ఈ విషయాన్ని గమనించలేదు. దుఃఖిస్తున్న జానకిని రావణుడు బలవంతంగా అపహరించడాన్ని ఆ వానరశ్రేష్ఠులు చూశారు.

సీతమ్మయొక్క సమయస్ఫూర్తిని, సునిశితమైన ప్రజ్ఞను మనం ఇక్కడ చూడవచ్చు. రాక్షసుడు అపహరించుకొని పోతున్న భయంకర సన్నివేశంలోకూడా సమయస్ఫూర్తిని ఉపయోగించి నగల మూటను రావణునికి తెలియకుండా వానరుల ముందు విడిచింది.

రావణుడు నదులు, పర్వతాలు, వనాలు, సరోవరాలు దాటుతూ, పంపానదిని దాటి, సముద్రము మీదుగా లంకానగరం చేరాడు. అంతఃపురములో ప్రవేశించాడు. మూర్ఛిల్లి యున్న సీతను అంతఃపురములో ఉంచాడు. సీతను కాపాడుతూ ఉండమని రాక్షసస్త్రీలను ఆజ్ఞాపించాడు.

అంతఃపురము నుండి బయటకు వచ్చి బలవంతులైన ఎనిమిది మంది రాక్షసుల్ని పిలిచాడు. జనస్థానమునకు వెళ్ళి రామునికి సంబంధించిన సమాచారమును ఎప్పటికప్పుడు తనకు తెలుపుతూ ఉండమని ఆదేశించాడు. వీలైతే రాముని చంపే ప్రయత్నాన్ని విస్మరించవద్దని తెలిపాడు. వారు రావణునికి నమస్కరించి జనస్థానానికి వెళ్ళారు.

తాను అనుకున్నది సాధించినట్లు రావణుడు భావించి, బుద్ధి వక్రగతిని పట్టుచుండగా సీతమ్మ ఉన్న అంతఃపురములో ప్రవేశించాడు.

సీతమ్మ కన్నీరు కార్చుతూ దీనురాలివలె కూర్చొని ఉంది. గాలి వేగానికి ఊగిపోతున్న ఓడలాగా, గుంపునుండి తప్పిపోయి కుక్కలచే చుట్టబడిన ఆడలేడిలాగా తలవంచుకొని కూర్చొనుంది మహాపతివ్రత యైన సీతమ్మ. రావణుడు సీతమ్మను బలవంతంగా తీసికొనివెళ్ళి అంతఃపురమంతా చూపించాడు. అదంతా చూచి సీత మారుతుందని భ్రమించాడు.

రావణుని అంతఃపురములోని మేడలు, మిద్దెలు రత్నఖచితములై శోభిస్తున్నాయి. గృహస్తంభములు స్వర్ణరజత మయములై ప్రకాశిస్తున్నాయి. వాటిపై వజ్రవైడూర్యాలు పొదిగి ఉన్నాయి. బంగారు ముఖద్వారముతో ఆ భవనము దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది.

మిద్దె మెట్లన్నీ బంగారుతో చేయబడి ఉన్నాయి. దంతములతోను, వెండితోను నిర్మించబడిన కిటికీలు చూడముచ్చటగా ఉన్నాయి. ద్వారాలకు వెండిపూసలు గుచ్చిన బంగారు వలలు అందంగా అమర్చబడి ఉన్నాయి.



"సీతా! బాలురు, వృద్ధులను మినహాయిస్తే ఇక్కడ ముప్పదిరెండు కోట్లమంది రాక్షసులున్నారు. వారంతా నా సేవకులే. ఏ పని చెప్పాలనుకున్నా, నేను పిలవగానే వెయ్యిమంది ఒకేసారి అన్నివైపులనుండి వస్తారు. ఈనాడు అన్నిటికన్నా, ముఖ్యంగా నా ప్రాణం కన్నా నీవు నాకు ముఖ్యమయ్యావు.

"సీతా! ఎందరో ప్రియురాండ్రను పొందిన నేను నీ కొరకు పరితపిస్తున్నాను. నీవు నాకు భార్యవు కా! వారంతా నీ దాసీజను లవుతారు.

"ఈ లంకచుట్టూ నూరు యోజనముల దూరము సముద్రము ఉంది. ఇంద్రుడు కూడా ఇక్కడికి వచ్చి నన్ను జయించలేడు. ఇక రాముడంటావా! దీనుడు. హీనుడు. రాజ్యభ్రష్టుడు. తాపసి. మానవుడు. ఇక అతని విషయ మెందుకు? అతని ఆయుర్దాయము తీరిపోయింది. అతణ్ణి మరచిపో.

### యౌవనం హ్యధ్రువం భీరు రమస్వేహ మయా సహ

"సీతా! యౌవనం స్థిరంకాదు. ఇక్కడ నాతో సుఖించు.

"రాముడు ఇక్కడికి రావడం కల్ల. అతని ఊహ కూడా ఇక్కడికి చేరలేదు.నా అధీనంలో ఉన్న నిన్ను అపహరించ గలవాడు ముల్లోకాలలో లేడు.

"సీతా! నీవు గతంలో చేసిన పాపము వనవాసాన్ని అనుభవించడం వల్ల నశించింది. ఈ క్షణం నుండి పుణ్యఫలం నీకు అందబోతున్నది. అందమైన నీ ముఖకమలం అలా వాడిపోయి ఉండటం నేను చూడలేను;" అని ఏదో ఏదో వాగుతున్నాడు.

రావణుని మాటలు విన్న సీతమ్మ ముఖాన్ని పైట చెంగులో దాచుకొని దుఃఖించింది.

"దేవీ! సంశయించకు. ధర్మం చెడుతుందని సందేహించకు. ఇదిగో. నీ పాదాలను స్పృశించి నీకు నమస్కరిస్తున్నాను. నన్ను వెంటనే ఆమోదించు. నీకు వశుడై ఉంటాను. దాసుడై ఉంటాను. ఇప్పటివరకు నేను ఏ స్త్రీకి నమస్కరించి ఎరుగను;" అని పలికి తాను కృతకృత్యు డైనట్లే భావించాడు రావణుడు.

కామం ఎంత బలవత్తరమైనదో చూశారా! రావణుడు అసమాన పరాక్రమవంతుడు. ముల్లోకాలలో ఎదురులేనివాడు. కానీ సీత పాదాలకు సిగ్గుమరచి నమస్కరిస్తున్నాడు. కామంలో మనిషి ఎక్కడికైనా దిగజారతాడు.

రావణుని వయస్సు ఇరవైవేల సంవత్సరాలు. రావణునితో పోల్చినపుడు నలభై సంవత్సరాల లోపు వయసుగల రాముడు ఎంత చిన్నవాడు! రామునికన్నా చిన్నది, ముప్పై సంవత్సరాలుకూడా నిండని సీతమ్మను వాంఛించడం ఎంత దారుణమో చూడండి. పైగా కాళ్ళమీద పడి ప్రాధేయపడడం ఎంత ఘోరం! అదే కామముయొక్క ప్రభావము.

## అశోకవన ప్రవేశము

రావణుని మాటలను ఆలకించిన సీతమ్మ ఏమాత్రం భయం లేకుండా మధ్యలో గడ్డిపరకను ఉంచి ఇలా మాట్లాడింది.

"రావణా! దశరథమహారాజు ధర్మాత్ముడు. సత్యసంధుడు. ఆయన పుత్రుడే శ్రీరాముడు.

**రామో నామ స ధర్మాత్మా త్రిషు లోకేషు విశ్రుతః**

**దీర్ఘబాహు ర్విశాలాక్షో దైవతం హి పతిర్మమ ।**

"రాముడు ముల్లోకముల యందు ప్రసిద్ధుడు. దీర్ఘమైన బాహువులు కలవాడు. ధర్మాత్ముడు. విశాలమైన నేత్రములు కలవాడు. అతడే నా భర్త. అతడే నా దైవం" అంది సీత.

ముల్లోకములలో తనను ఎదిరించేవారు లేరని, సముద్రమధ్యమున ప్రకాశిస్తున్న లంకకు ఎవరూ చేరలేరని, వారి ఊహలు చేరడం కూడా కష్టమని, రాముడు దీనుడని, హీనుడని, మానవమాత్రుడు అయిన రాముడు అల్పతేజము గలవాడని రావణుడు పలికిన అనర్థ వచనాలకు సీతమ్మ భావగర్భితముగా పలికిన సమాధానమే పైశ్లోకం.

ముల్లోకముల యందు తనను ఓడించేవారు లేరని రావణుడు పలికాడు. ముల్లోకముల యందు రాముడు సుప్రసిద్ధుడు అంటున్నది సీతమ్మ. ముల్లోకాలలో రావణుడు అధర్మపరుడుగా ప్రసిద్ధుడైతే రాముడు ధర్మాత్ముడుగా సుప్రసిద్ధుడు.

లంకచుట్టూ నూరు యోజనముల దూరము సముద్రము ఉంది. కనుక అక్కడ ఉన్న సీతను కనిపెట్టడం ఎవరికి సాధ్యం? అక్కడికి వచ్చి తనను పరాభవించడం ఎవరికి సులభం? అనే ధోరణిలో రావణుడు ఆర్భాటాలు చూపాడు. వాటికి సమాధానంగా "**దీర్ఘబాహుః, విశాలాక్షః**"అనే పదాలతో రాముని కీర్తించింది జానకి.

రాముడు విశాలాక్షుడు. కనుక లంకలో ఉన్న తనను గుర్తించగలడు అని ధ్వనించేలా మాట్లాడింది. అలాగే దీర్ఘబాహువులు కలవాడు. రాముని బాహువులు దగ్గర ఉన్న వానినే కాకుండా దూరంగా ఉన్న వారిని కూడా పట్టుకుంటాయి. లంకలో ఉన్నా, రాముని దీర్ఘబాహువుల నుండి రావణుడు తప్పించుకోలేడని పలుకుతూ రావణాసురుని నిర్భయంగా హెచ్చరించింది సీతమ్మ.

దేవరాజైన ఇంద్రుడు కూడా లంకకు చేరి తనను ఓడించలేడని రావణుడు పలికాడు. దేవరాజైన ఇంద్రుడు ఒకవేళ జయింపలేక పోవచ్చునేమో, రాముడు మాత్రం రావణుని వధించి తీరుతాడు అనే భావాన్ని వ్యక్తం చేస్తూ "రాముడే నా దైవం" అని పలికింది సీతమ్మ.

"రావణా! సింహస్కంధుడైన రాముడు సోదరుడైన లక్ష్మణునితో కలిసి నిన్ను తప్పక వధిస్తాడు. రాముని సమక్షంలో కనుక నీవు నన్ను అపహరించి ఉంటే అక్కడే ఖరునివలె నేలరాలుండేవాడివి.

"భయంకర రూపులైన నీ ముప్పది రెండు కోట్ల రాక్షసులు గరుడుని ముందు సర్పాలవలె నిస్సారమై నిర్వీర్యు లవుతారు. యూపస్తంభానికి కట్టిన పశువు ఎలా జీవించదో నన్ను అపహరించిన నీవు కూడా ఇక జీవించవు.

**గతాయుస్త్వం గతశ్రీకో గతసత్త్వో గతేన్ద్రియః**

**లంకా వైధవ్య సంయుక్తా త్వత్కృతేన భవిష్యతి॥**



"నీ ఆయుర్దాయము గతించింది. నీ ఐశ్వర్యము నశించింది. నీ బలము అంతరించింది. నీ ఇంద్రియాలు ధ్వంసమయ్యాయి. నీవు చేసిన పనికి లంక వైధవ్యాన్ని పొందింది.

"నీచుడా! జడమైన నా ఈ దేహాన్ని నీకిష్టమైతే బంధించు. లేదా వధించు. ఈ దేహప్రాణాల్ని కాపాడుకోవాలనే ఉబలాటం నాకు లేదు. తలవంచుకొనే కార్యాన్ని నేనెప్పుడూ చేయను;" అని సీతమ్మ మండిపడింది.

**సురవరవంద్య శ్రీరామచంద్ర త్యాపుఘె తుచ్ఛ రాక్షసేంద్ర**

**సాండోనియా గజేంద్ర! ఆరోహణా ఖర తైసా తూ॥**

"శ్రీరాముడు సురవరవంద్యుడు. రాక్షసేంద్రా! రాముని ముందు నీవు తుచ్ఛమైనవాడివి. గజేంద్రునివంటి శ్రీరాముని త్యజించి గాడిదలాంటి నిన్ను చేపట్టడమా?" అంటోంది భావార్థ రామాయణంలో సీతమ్మ.

"సీతా! కాస్త జాగ్రత్తగా విను. నీకు పన్నెండు మాసాలు వ్యవధి ఇస్తున్నాను. ఆలోచించుకో. ఈలోగా నన్ను చేరావా! సరేసరి. ఇక నిన్ను మించిన భాగ్యశాలు రుండరీ ప్రపంచంలో.

"లేదా, ఆ సమయం లోగా నన్ను చేరకపోయావా! ఆ తరువాత ఇంకోవిధంగా, మరో రూపంలో నాలో ప్రవేశిస్తావు. వంటవాళ్ళు నిన్ను ముక్కలు ముక్కలుగా తరిగి నాకు ఉదయంపూట అల్పాహారంగా వడ్డిస్తారు. బ్రతికినా, చచ్చినా నీవు నాకే చెందుతావు." అని పలికి క్రుద్ధుడైన రావణుడు రాక్షసస్త్రీలతో ఇలా పలికాడు.

"వికారులైన రాక్షస మహిళలారా! ఈమె గర్వాన్ని, అహంభావాన్ని త్వరగా పోగొట్టండి. ఈమెను అశోకవనములో ఉంచండి. రహస్యంగా దాచి రక్షించండి."

రావణుని మాట ననుసరిస్తూ రాక్షసస్త్రీలు సీతమ్మను అశోకవనానికి తీసికొనిపోయారు. ఆడజింక ఆడపులుల వశమైనట్లు సీతమ్మ రాక్షసస్త్రీల వశమైంది. భయశోకాలతో కుమిలిపోతోంది సీతమ్మ.

## అపశ్రుతులు - ఆవేదనలు

"అయ్యో! సీతా!, అయ్యో! లక్ష్మణా!" అని అరచి మారీచుడు మరణించాడు. రాముని గుండె జలదరించింది. రకరకాల ఊహలు మనసులో కదిలాయి.

ఖరదూషణాదుల వధతో జనస్థానంలో రాముడు రాక్షసులకు శత్రువయ్యాడు. మాయజింక రూపంలో వచ్చిన మారీచుడు రాముని కంఠస్వరాన్ని, ధ్వని అనుకరిస్తూ సీతాలక్ష్మణులను పిలిచాడు.

ఈ అరుపు సీత విని ఉంటుంది. రామునికి ఆపద వచ్చినట్లు శంకించి, లక్ష్మణుని బలాత్కారముగా రామునివద్దకు పంపుతుంది. అదను చూసుకొని రాక్షసులు సీతకు అపకారం చేస్తారేమో! - ఇదంతా రాముని మనస్సు ఊహించింది. రాముని హృదయం ఆవేదనా భరితమైంది.

ఈలోగా భయంకరమైన నక్కకూత రోమాంచము కలిగించేలా వినిపించింది. ఈ నక్కకూత దుశ్శకునమని రాముడు భావించాడు. వెంటనే ఆశ్రమం చేరేందుకు రాముడు బయలుదేరాడు.

మృగాలు, పక్షులు దీనస్వరాలతో రామునికి ఎడమవైపుగా చరిస్తూ భయంకర ధ్వనులు చేశాయి. ఈ అపశకునాలు, అపశ్రుతులు రాముణ్ణి తీవ్రంగా కుదిపేస్తున్నాయి. ఇంతలో లక్ష్మణుడు ఎదురయ్యాడు.

"లక్ష్మణా! ఎంతపని చేశావు? సీతను వదలిపెట్టి ఎందుకు వచ్చావు? నాకన్నీ దుశ్శకునాలే గోచరిస్తున్నాయి. ఏమో! ఈ వేళకు సీత నశించి ఉంటుందేమో! రాక్షసులు సీతను భక్షించారేమో!

"లక్ష్మణా! నీవు చెప్పినట్లు ఆ కాంచనమృగము మారీచుడే. అడుగో. నా బాణానికి గురియై అక్కడ చచ్చి పడియున్నాడు. సౌమిత్రీ! నా వామనేత్రము అదురుతోంది. సీత ఆశ్రమంలో ఉండదని నా మనసు సందేహిస్తున్నది. హరణమో-మరణమో, ఏదో జరిగి ఉంటుంది.

"లక్ష్మణా! సీత ఎక్కడ? నా సీత ఎక్కడ? ఎవరు లేకపోతే నేను క్షణం జీవించలేనో అట్టి నా సీత ఎక్కడుంది? లక్ష్మణా! మనం తిరిగి ఆశ్రమానికి వెళ్ళేసరికి సీత ఉంటుందంటావా? ఒకవేళ లేకపోతే?

"లక్ష్మణా! నేను అక్కడే మరణిస్తాను. నాయనా! నా మరణవార్తను నీవు అయోధ్యలో చెప్పగానే కైకేయి ఆనందిస్తుందా? సౌమిత్రీ! నా కంఠధ్వనిని అనుకరిస్తూ మారీచుడు సీతను, నిన్ను పిలిచినపుడు నీకుకూడా సందేహం కలిగే ఉంటుంది. కదూ!

"అయితే ఎందుకు వచ్చావు? సీత బలవంతపెట్టిందా? ఎంత బాధాకరమైన పని చేశావు లక్ష్మణా! రాక్షసులు మనల్ని బాధించుటకు నీవే మార్గాన్ని సుగమం చేశావా? నేను ఖరుణ్ణి వధించినానని రాక్షసులు క్రుద్ధులై యున్నారు. వారంతా కలిసి సీతను చంపారేమో!" అంటూ దుఃఖిస్తున్న రాముడు వేగంగా నడచి ఆశ్రమాన్ని చేరాడు.

సీత కనిపించలేదు. ఆశ్రమం చుట్టూ వెదికాడు. విహారస్థలాలలో అన్వేషించాడు. అన్నివైపులా గాలించాడు. సీత జాడలే లేవు. **"ఏతత్తదిత్యేవ"** - "ఇది అదే" అని నిర్ణయించుకొని రాముడు విలపించాడు.

"లక్ష్మణా! నిన్ను నమ్మి నేను సీతను విడిచి వెళ్ళాను. నా మాటను కాదని ఆమెను వదలి నీవు ఎందుకు వచ్చావు? ఒంటరిగా నాకు నీవు కన్పించగనే నా వామనేత్రము, వామభుజము అదిరాయి. హృదయము కంపించింది," అని రాముడు లక్ష్మణునితో పలికాడు.

లక్ష్మణుడు దుఃఖిస్తూ, "అన్నా! నాకు నేనుగా ఆమెను విడచి రాలేదు. ఆమె నన్ను వెళ్ళమన్నది. నీపై నాకున్న విశ్వాసాన్ని ఆమెకు వివరించి చెప్పాను. రాక్షసమాయ అని కూడా చెప్పాను. నిర్భయంగా ఉండమని ప్రాధేయపడ్డాను. దేవతలను కూడా రక్షించే సమర్థుడైన రాముడు తనను రక్షించమని కేకవేయునా! * అనికూడా చెప్పాను.

* ఈ మాటను సీతాలక్ష్మణ సంభాషణములో లక్ష్మణుడు ఉటంకించలేదు. ఇదే వాల్మీకిమహర్షి విషయ పునర్వివరణములో అనుసరించే నాటకీయత.



"అన్నా! రామా! నా తల్లి సీతమ్మ నన్నేమన్నదో తెలుసా! ఓరీ కులనాశకా! రాముడు మరణిస్తే నీవు నన్ను పొందాలని భావిస్తున్నావు. నీవు, భరతుడు కలిసి ఈ నాటకం ఆడుతున్నారు. నీవు రామునికి రహస్య శత్రువు;" అని అనరాని మాటలు అనింది. తండ్రీ! ఆ మాటలు నా వీనుల్లో బాణాల్లా గ్రుచ్చుకున్నాయి. మతిచలించిన వాడిలాగా నీ పాదాల వద్దకు పరుగెత్తాను" అని ఏడుస్తూ రాముని పాదాలపై పడ్డాడు లక్ష్మణుడు.

"లక్ష్మణా! నీవు ఏమైనా చెప్పు. నువ్వు సీతను విడచివచ్చి చాలా తప్పు చేశావు. సీతకు నామీదుండే ప్రేమ నీకు తెలీదా! ఆ ప్రేమతో భయశోకాదులకు గురియై పిచ్చిదానిలా మాట్లాడి ఉంటుంది. అంతమాత్రాన విడచిపెట్టి వచ్చేస్తావా!

"పరుషంగా మాట్లాడిందని ఆమె మాటను ఆలకించి, నా ఆజ్ఞను తిరస్కరించావు. చాలా పెద్ద తప్పు చేశావు.

**నహితే పరితుష్యామి త్యక్త్వా యద్యాసి మైథిలీమ్**

"నీవు సీతను విడచి వచ్చావు. నీవేమి చెప్పినా నాకు తృప్తి కాదు;" అన్నాడు ధర్మాత్ముడైన రాముడు.

ఈ మాటలు విని లక్ష్మణుడు ఎలా నిర్ఘాంతపోయి ఉంటాడో మనం ఊహించుకోవచ్చు.
తాను ఇష్టపడి రాలేదు. సీతను విడచి రావడం లక్ష్మణునికి సుతరామూ ఇష్టం లేదు.
ఎటువంటి పరిస్థితులలో తాను సీతను విడచి రావలసి వచ్చిందో లక్ష్మణుడు రామునికి వివరించి చెప్పాడు. అయినా రాముడు తృప్తిపడలేదు. లక్ష్మణుని చర్యను గర్హిస్తూ మాట్లాడుతున్నాడు.

మరి, రాముని ఉద్దేశ్య మేమిటి? సీత అలా మాట్లాడటం సబబే నంటాడా? లక్ష్మణుని మనసులో నీచపు భావాలు ఉన్నట్లు సీత పలికిన మాటల్ని రాముడు సమర్థిస్తాడా?
రాముడు సీత మాటల్ని సమర్థించినట్లు ఎక్కడా కనిపించడం లేదు. రాముడు ఆలోచించే దంతా లక్ష్మణుని గురించే. సీతమ్మ అర్థరహితంగా మాట్లాడిందని రామునికి తెలుస్తూనే ఉంది.

కోపావేశంలో సీతమ్మ పలికిన మాటల్ని రాముడు పట్టించుకోవడం లేదు. ఆవిడ కుపితయై అలా మాట్లాడింది. కానీ లక్ష్మణుడు ధర్మనిర్వహణలో ఉన్నాడు. రామాజ్ఞను పాటించే కర్తవ్యంలో ఉన్నాడు.

సీతమ్మ కోపించి, లక్ష్మణుని పంపే ప్రయత్నంలో అనరాని మాటలు అని ఉండొచ్చు.
సీతమ్మతో పాటు లక్ష్మణుడు కూడా క్రుద్ధుడు కాకపోయి ఉంటే ఎలా ఉండేది?
ఆమె కోపగించిందని లక్ష్మణుడు కూడా కోపగించుకోవడం సబబేనా? ధర్మనిర్వహణలో నిలిచియున్నవాడు ఆలోచనకు ప్రాధాన్యత నివ్వాలిగాని ఆవేశానికి కాదు. మరి లక్ష్మణుడు చేసిందేమిటి? అది రాముని ఆలోచన.

కాంచనమృగము మారీచుడే అని మొదట అనుమానించింది లక్ష్మణుడే. రాక్షసులు క్రుద్ధులై యున్నారని లక్ష్మణునికి తెలుసు. అలాంటి పరిస్థితుల్లో సీతను ఒంటరిగా విడచి రావచ్చా? కోపతాపాలకు పోయి జీవితాలతోనా క్రీడించేది?

విచక్షణ కోల్పోయి కుపితురాలైన సీత తాను ఏమి మాట్లాడుతున్నదో తనకే తెలియడం లేదు. ఈ విధమైన భాషణము వల్ల తనకు తాను హాని చేసుకుంటూ ఉంది. దానికి తోడు లక్ష్మణుడు కూడా కోప్పడి పరిస్థితిని మరీ విషమంగా మార్చాడు కదా? అని రాముని ఆలోచన.

లక్ష్మణుడు, భరతుడు కలిసి తనను అపహరించాలనే పన్నాగములో ఉన్నట్లు మాట్లాడిన తరువాత లక్ష్మణుని స్థానంలో ఎవరుంటే మాత్రం ఏం చేయగలరు? దీనికి రాము డేమంటాడు?

రాముడు ధర్మపరాయణుడు. ఈ వాదాలను అంగీకరించడు. "అవును. సీత అలా మాట్లాడింది. ఆవిడికి నేనంటే ప్రాణం. నేను లేకపోతే ఆవిడ జీవించలేదు. నా విషయంలో సీత పిచ్చిది. పిచ్చిపట్టిన వాళ్ళు ఏదేదో అంటారు. వాళ్ళకి సమాధానం చెప్పాల్సిన అగత్య మేముంది? వాళ్ళ మాటలను ఎవరు పట్టించుకోరో వారు పిచ్చిలేనివాళ్ళు" అని రాముడు సమాధానం చెప్పగలడు.

చివరగా లక్ష్మణుణ్ణి మనం అడిగితే ఏం చెప్తాడు? "సీతమ్మ నా తల్లి. ఆమె తిట్టినా, కొట్టినా నాకు బాధలేదు. ఆమె కేవలం తిట్టిందనే నేను విడచి వెళ్ళలేదు.

"గోదావరిలో దూకుతాను. పైనుండి దూకి మరణిస్తాను. అగ్నిలో ప్రవేశిస్తాను. ఇప్పుడే చస్తాను" అంటూ ప్రాణత్యాగానికి సిద్ధపడింది సీతమ్మ. ఏం చేయాలో నాకు బోధపడలేదు. "విడచి వెళ్ళడం - విడవకుండా ఉండడం" ఏది ఆచరించడంలో తక్కువ దోషమో ఆలోచించాను. విడచిపెట్టి వెళ్ళాను. తెలిసి ఏ పాపం చేయలేదు. ఫలితం ఎంత ఘోరమైనా అనుభవిస్తాను" అని తప్పక చెబుతాడు కళంక మెరుగని లక్ష్మణుడు.

ఏం చేద్దాం! విధి చేతిలో అందరమూ కీలుబొమ్మలం. పరిస్థితులు దారుణాగ్నిలా చుట్టుముట్టినపుడు ఎవరు చేయగలిగిందీ వుండదు. ప్రతికూల పవనాలు విజృంభించినపుడు అందరమూ అశక్తులమే. విధాత నిర్ణయ ప్రవాహానికి ఎదురీదేవా రెందరుంటారు? ఈదినా సాధించే దేముంటుంది?

సీతమ్మ స్థితిలో ఉంటే ఎవ్వరైనా అలాగే మాట్లాడుతారు. రాముడు చెప్పిన దాంట్లో ఎక్కడా తప్పు లేదు. లక్ష్మణుడు చేసిన దాంట్లో సూక్ష్మదర్శినితో వెదికినా దోషం అగుపించదు. జరగవలసినవి జరిగేటప్పుడు అందరూ సాక్షులే. ఇక్కడ మిగిలేది అంతర్మథనమే.

## సీతాన్వేషణము

శూన్యంగా గోచరిస్తున్న ఆశ్రమాన్ని రాముడు చూశాడు. సీత లేని ఆశ్రమము ప్రాణం లేని మనిషిలా కన్పించింది. వస్తువులన్నీ చెల్లాచెదరై పడి ఉన్నాయి. అన్నివైపులా చూచాడు రాముడు. సీత కన్పించలేదు. లక్ష్మణుని భుజాలు పట్టుకొని దారుణంగా దుఃఖించాడు రాముడు.

"లక్ష్మణా! సీత ఏది? ఎక్కడి కెళ్ళింది? నాయనా! సీతను ఎవరైనా హరించారా? లేక వధించారా? ఇది హరణమా? లేక మరణమా?



"సీతా! సీతా! నన్ను పరిహసించాలని ఎక్కడన్నా దాగావా? సీతా! చూడు. నీతో ఆడుకొనే లేళ్ళు నీవు లేవని ఎలా విచారిస్తున్నాయో? పరిహాసము మంచిదే. నాకూ సంతోషమే. కానీ నేను వ్యథతో క్రుంగిపోతున్నాను. ఈ సమయంలో పరిహాసం వాంఛనీయం కాదు.

"లక్ష్మణా! నాయనా! సీత లేకుండా నేను బ్రతకగలనా? నన్ను మన తండ్రి దశరథుడు త్వరలోనే చూస్తాడు. లక్ష్మణా! నాన్నగారు నన్ను నిందిస్తారేమో.

"పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చేస్తానని మాట ఇచ్చావు. నిలబెట్టుకోకుండా ఈ లోకానికి వచ్చావా! ఛీ! నీవు అధర్మపరుడవు. అసత్యపరుడవు" అని నాన్న నన్ను దూషిస్తాడేమో! అసహ్యించు కుంటాడేమో! ఏ తండ్రి మాటను నిలబెట్టాలని అయోధ్యను త్యజించి అడవులకు వచ్చానో అట్టి తండ్రికి నావల్ల మనస్తాపం కల్గుతుందా లక్ష్మణా!" అంటూ, "సీతా-సీతా" అని రోదిస్తూ నిలబడ్డాడు రాముడు.

"అన్నా! బాధపడకు. మనం వదినను వెతుకుదాం. ఆమెకు వనాలంటే ఇష్టం. జలాలంటే ప్రేమ. వనాలు వెతుకుదాం. పద్మసరోవరాలను అన్వేషిద్దాం. మనల్ని భయపెట్టాలని భావించి వదిన ఎక్కడన్నా దాగిందేమో!" అని లక్ష్మణుడు సముదాయించగా, ఊరట చెందిన రాముడు సీతను అన్వేషించుటకు లక్ష్మణునితో కలిసి బయలుదేరాడు.

వనాలు తిరిగారు. నదులు దాటారు. పర్వతాలు ఎక్కారు. సరస్సులు దర్శించారు. గుహల్లో ప్రవేశించారు. కొండ చరియలు గాలించారు. సీతమ్మ కనిపించలేదు.

"లక్ష్మణా! ఏది? నా సీత కనిపించదే! అయ్యో! సీతా! ప్రియురాలా! ఎక్కడున్నావు? ఎలా ఉన్నావు? ఉన్నావా లేవా? చూడు. కృశించిన నీ రాముణ్ణి చూడు. దీనుడైన నీ రాముణ్ణి చూడు. నీవు లేనిదే నేను బ్రతకలేను" అని పసిబిడ్డలా రోదించాడు రాముడు.

"అన్నా! రామా!" అంటూ రామునికి నమస్కరిస్తూ లక్ష్మణుడు కూడా విలపించాడు.

రాముడు తనలో తాను ఇలా మాట్లాడుకుంటున్నాడు.

"సీత ఏమైనట్లు? పరిహాసమేనా? ఇంతసేపా! కాదు. నన్ను ఒంటరివాణ్ణి చేసి వెళ్ళింది. సీత లేకుండా నేను బ్రతకనని ఆమెకు తెలుసుకదా! ఏమో! మరచిపోయిందేమో! ఊహుఁ...సీత మరచిపోదు. నా దురదృష్టం ఆమెకు మరపును కల్పించి ఉంటుంది.

"ఓ కదంబవృక్షమా! నా సీతకు కదంబపుష్పాలంటే చాలా ప్రీతి. నా సీతను నువ్వు చూశావా? ఓ అర్జునవృక్షమా! నా సీత కనిపించిందా?

**అశోక శోకాపనుద శోకోపహత చేతసమ్**

**త్వన్నామానం కురు క్షిప్రం ప్రియా సందర్శనేన మాం ॥**

"అశోకవృక్షమా! నీవు శోకాన్ని పోగొట్టగలవు కదా! నా సీతను నాకు చూపించి నన్నుకూడా నీ పేరుగల వాణ్ణిగా మార్చేయి.

"లక్ష్మణా! లక్ష్మణా! సీత ఎక్కడుందో! ఏ ప్రదేశంలో ఉందో! నాయనా! సీతను రాక్షసులు తప్పక హరించి ఉంటారు. కాదా? అయితే భక్షించి ఉంటారు. లేకపోతే ఆ లేళ్ళు అలా ఎందుకు దుఃఖిస్తున్నాయి?

"సీతా! నీకు ఎంత కష్టం వాటిల్లింది? నీ కష్టం కైకేయికి ఆనందంగా ఉంటుంది. నువ్వు లేకుండా నేను అయోధ్యలో కాలు పెట్టగలనా? నన్ను దుర్బలుడని, పిరికివాడని పౌరులు నిందించరా?

"లక్ష్మణా! వనవాసము పూర్తిచేసికొని సీత లేకుండా నేను అయోధ్యకి వెళ్తే, జనకుడు వచ్చి, "క్షేమమా!" అని అడిగితే అతని ముఖం ఎలా చూచేది? "నా కుమార్తె ఎక్కడ?" అని ప్రశ్నిస్తే ఏం సమాధానం చెప్పేది? భార్యను రక్షించుకోలేని చవటను అని చెప్పేనా?

"ఊహుం... నేను వెళ్ళను. సీత లేకుండా నేను అయోధ్యకి వెళ్ళను. లక్ష్మణా! నీవు వెళ్ళు. భరతుణ్ణి కౌగలించుకొని, నేను రాజ్యాన్ని భరతునకే ఇచ్చేశానని చెప్పు.

"నాయనా! మన తల్లులైన కైకేయి, సుమిత్ర, కౌసల్యలకు రోజూ వందన మాచరించు. వాళ్ళు చెప్పిన పనులన్నీ భక్తితో ఆచరించు. నాయనా! నేను, సీత ఎలా నశించిపోయామో మా అమ్మకు వివరంగా చెప్తావుకదూ!" అని రాముడు రోదిస్తుండగా, అది చూచి లక్ష్మణుడు కూడా భీతిచెందాడు. అన్నతో కలిసి పసిబిడ్డలా రోదించాడు.

"లక్ష్మణా! నేను గతజన్మలో పాపాలు చేసుంటానేమో? లేకపోతే కష్టాలు ఒకదాని తరువాత ఒకటి గొలుసులాగా వస్తున్నాయి చూశావా? నా హృదయాన్ని బ్రద్దలు చేసే శోకాలు ప్రాప్తిస్తున్నాయి.

"రాజ్యం పోయిందా? లక్ష్మణా! బంధువులంతా దూరమయ్యారా! తండ్రి మరణించాడా? బాధలు చెప్పుకోడానికి తల్లికూడా దగ్గర లేదా? చూశావా! నా దీనస్థితి.

"నాయనా! బంధువియోగం వలన కలిగిన దుఃఖాగ్ని అరణ్యంలో శాంతించింది. ఇప్పుడు ఈ సీతావియోగము ప్రాప్తించింది. ఇది ఆరిన అగ్నిని మళ్ళీ కట్టెలువేసి ప్రజ్వలింప జేసినట్లైంది.

"నా సీతను రాక్షసులు అపహరిస్తూ ఉంటే ఆమె ఎంతగా రోదించిందో? చక్కని హారములను ధరించే నా సీత కంఠాన్ని ఆ రాక్షసులు నులిమి రక్తం త్రాగేసి ఉంటారు.

"తమ్ముడూ! నీకు జ్ఞాపకముందా! ఇదిగో ఈ రాతిబండమీద ఒకప్పుడు మనం ముగ్గురం కూర్చున్నాం. సీత నవ్వుతూ భాషించింది. నీతోకూడా ఏదో ఏదో మాట్లాడింది. అవేమిటో నీకు జ్ఞాపక మున్నాయా? ఉంటే చెబుతావా!

"ఓ సూర్యుడా! లోకములో జరిగేవన్నీ నీకు తెలుస్తాయి. నా సీత ఎక్కడుంది? ఆమె నెవరైనా హరించారా? నాకు చెప్పవా?

"ఓ వాయుదేవా! నీవు అన్నిచోట్లా విహరిస్తూ ఉంటావు. నా సీత కనిపించిందా! ఆమెను ఎవరైనా హరించారా? లేక మరణించిందా! నేనేమి బాధపడనులే. చెప్పు;" అని రాముడు ఏదోఏదో మాట్లాడుతున్నాడు.

కొంతసేపు రాముడు కదలలేక అలా కూర్చుండిపోయాడు. లక్ష్మణుడు చేతులు కట్టుకొని దుఃఖిస్తూ రాముని వెంట నిలబడ్డాడు. రాముడు లేచాడు. మళ్ళీ అన్వేషణ ప్రారంభించారు.



"లక్ష్మణా! పద్మాలను తెచ్చుకొనేందుకు సీత గోదావరికి వెళ్ళిందేమో! చూస్తావా?" అన్నాడు రాముడు. లక్ష్మణుడు వెళ్ళి అక్కడెక్కడా లేదని చెప్పాడు.

రాముడు లేచి గోదావరిని సమీపించాడు. "సీతా! సీతా! నన్ను విడచి ఎక్కడికెళ్ళావు?" అని విలపించాడు. గోదావరి మారు పలకలేదు. సీతను రావణుడు అపహరించిన విషయం గోదావరికి తెలిసినా రామునికి చెప్పలేదు.

**తతః ప్రబోధితా భూతైః శంసచాస్మై ప్రియామితి**

**న తు సాభ్యవదత్సీతాం పృష్టా రామేణ శోచతా**

"రాముడు సీతను గూర్చి దుఃఖిస్తున్నా "సీతను గూర్చి రామునికి చెప్పు" అని జలచరములు ప్రేరేపిస్తున్నా, గోదావరి మాత్రం సీతను గూర్చి రామునికి చెప్పలేదు.

**రావణస్య తు తద్రూపం కర్మాణి చ దురాత్మనః**

**ధ్యాత్వా భయాత్తు వైదేహీం సా నదీ న శంశస తామ్ ॥**

"దురాత్ముడైన రావణుని రూపము, అతడు చేసే పనులు గుర్తుకు రాగానే భీతిచెందిన గోదావరి సీతాపహరణమును గూర్చి రామునికి చెప్పలేదు;" అంటున్నాడు మహర్షి వాల్మీకి.

**నిరాశస్తు తయా నద్యా.** - రామునికి గోదావరినది కూడా నిరాశ కల్గించిందని మహర్షి అంటున్నాడు. గోదావరి ఇలా ప్రవర్తించడం వాల్మీకికి కూడా నైరాశ్యాన్ని కల్గించినట్లే ఉందని అనిపిస్తోంది.

ఈ సందర్భంలో నా స్మృతిలో యమునానది ప్రవహిస్తోంది. గోదావరి స్థానంలో యమున ఉంటే ఎలా ఉండేది? అనే విచిత్రమైన ఆలోచన నాలో కదుల్తూఉంది.

గోదావరి రావణుని నివాసస్థానానికి కొన్ని వందల యోజనాల దూరంలో ఉంది. సీతాపహరణాన్ని గూర్చి రామునికి చెప్తే రావణుడు తనను శోషింపచేస్తాడేమో నని భయపడి గోదావరి తెలియనట్లు ప్రవహించసాగింది.

ధర్మాత్ముడైన రాముడు ఒడ్డునపడి దొర్లుతున్నా కనికరం లేకుండా కదలిపోతూనే ఉండింది. రాముడంతటివాడు శోకిస్తున్నా, తనకేమీ కాకూడదనే స్వార్థంలో పట్టించుకోకుండా ఉండిపోయింది.

"కానీ, చల్లని యమునాతల్లి ఎంత ప్రేమమయి? కొన్ని వందల యోజనాల దూరంలో ఉన్న రావణునికి భయపడి గోదావరి రాముని కన్నీళ్ళను తుడవలేక పోయింది. యమునను చూడండి. కంసుడు పది కిలోమీటర్ల దూరంలోనే ఉన్నాడు. వసుదేవుడు శ్రీకృష్ణుని తలపై పెట్టుకొని వచ్చినపుడు, రెండవ ఆలోచన లేకుండా దారి ఇచ్చింది. భగవత్సేవలో తాను ఏమైనా ఫరవాలేదని భావించింది.

అందుకే రాసవిభునికి యమునాదేవి అంటే అంత ప్రేమ. ఆమె ఒడిలోనే ఆడుకొనేవాడు. ఆమె తీరంలోనే పాడుకొనేవాడు. యమునా జలాల్లో మైమరచి జలకాలాడేవాడు.

**రమతే యమునా పులినవనే విజయీ మురారి రధునా**

అంటూ, శ్రీకృష్ణుడు యమునా సైకతస్థలాల్లో చేసిన విహారాన్ని పరవశించి గానంచేశాడు జయదేవుడు.

రాళ్ళు కరిగేలా రాముడు ఏడుస్తున్నా గోదావరి తటస్థంగా ఎలా ఉండగలిగిందో? అదే వాల్మీకికి విస్మయం. అదే మనకూ ఆశ్చర్యం.

జీవనది అంత నిర్జీవంగా, నిర్దయతో వ్యవహరించడ మేమిటో? పుణ్యగోదావరి అని మనం శ్లాఘిస్తూ ఉంటే ఆమె పాపాన్ని చూస్తూ దొంగకు తేలుకుట్టినట్లు మిన్నకుంటే ఏమి ఆదర్శము?

ధర్మాత్ముల్ని దురాత్ములు బాధిస్తుంటే చూస్తూ నోరు మెదపలేని గోదావరి హృదయం ఎంత ప్రమాదకరం? నిజం తెలిసి నోరు విప్పకపోవడం ఎంత దారుణం? వంచించడం, వంచనకు వంత పలకడం లేదా సాక్షిలా వీక్షించడం కూడా పాపమే కదా!

రాముని విషయంలో ప్రవర్తించినట్లు మరొకరి విషయంలో గోదావరి ప్రవర్తించకుండా ఉండుగాక! సీతమ్మ విషయంలో వలె మరొకరి విషయములో అలా వర్తించకుండుగాక!

బిడ్డల బాధల్ని చూసి కలత చెందినపుడే తల్లి శబ్దానికి అర్థం. పవిత్రులైన బిడ్డల్ని కాపాడినపుడే తల్లులైన వారికి పరమార్థం. గోదావరిమాత విషయంలోకూడా మన ఆశలు అలాగే ఉన్నాయి. ఇక ఆమె ఇష్టం.

రాముడు లక్ష్మణునితో చెప్తున్నాడు.

"లక్ష్మణా! గోదావరి నోరు విప్పడంలేదు.నాయనా! అటుచూడు. ఆ మృగాలు నావైపు ఏదో చెప్పాలని చూస్తున్నాయి కదూ!" అని రాముడు దు:ఖించగనే మృగాలన్నీ దక్షిణవైపు చూసి, ఈవైపే తీసికొని వెళ్ళాడు అని తెలుపుచున్నట్లు దక్షిణ దిక్కుగా పరుగెత్తాయి. అలా పరుగెత్తుతూ తిరిగి తిరిగి రాముని చూశాయి గ్రహించావా! అన్నట్లు.

ఆ మృగాలు దీనంగా ఆకాశాన్ని చూస్తూ, భూమిని చూస్తూ, మళ్ళీ ఆకాశాన్ని చూస్తూ పరుగెత్తుటను చూచిన బుద్ధిశాలియగు లక్ష్మణుడు వాటి మనసును గ్రహించాడు. అవి పరుగెత్తే దిక్కున వెళ్ళడమే మంచిదని రామునికి చెప్పాడు. రాముడు అందుకు అంగీకరించాడు.

"ఓ పర్వతమా! నేను, సీత అనేకసార్లు నీపై విహరించాము. చెప్పు. సీత ఎక్కడుంది? చెప్పు. లేదా నిన్ను నా బాణాలతో పేల్చేస్తాను. లక్ష్మణా! సీతనుగూర్చి చెప్పని ఈ నదిని శుష్కింపచేస్తాను;" అని పలుకుతున్న రామునికి భూమిమీద రాక్షసుని ఒక పెద్ద అడుగు కన్పించింది. దానిప్రక్కనే భయంతో అటూ ఇటూ పరుగెత్తినట్లు సీతమ్మ అడుగులు కన్పించాయి.

అక్కడే కొంతదూరములో ముక్కలైన ధనుర్బాణాలు కనిపించాయి.ముక్కలై పడియున్న రథము గోచరించింది. సీత ఆభరణాల నుండి రాలిపడిన స్వర్ణఖండాలు, పూలు కనిపించాయి. అక్కడక్కడ నెత్తురుబొట్లు కన్పించాయి.

"లక్ష్మణా! దుర్మార్గులైన రాక్షసులు సీతను ముక్కలు ముక్కలుగా ఖండించి ఉంటారు. లేదా భక్షించి ఉంటారు. ఇక్కడ ఇద్దరు భయంకరంగా పోరాడిన గుర్తులున్నాయి కదూ! బహుశ ఇద్దరు రాక్షసులు సీత కొరకు కలహించుకొని ఉంటారు. చూశావా! అక్కడ పెద్ద ధనుస్సు, రథము ముక్కలై పడి ఉన్నాయి. గాడిదలు చచ్చిపడి ఉన్నాయి. అతడు సారథి. చచ్చిపడి ఉన్నాడు.



"లక్ష్మణా! నా సీత మరణించినట్లు భావిస్తున్నాను. నా మంచితనము, నా మృదుత్వమే నాకు శత్రువు లయ్యాయి. ముల్లోకాలను బ్రద్దలు కొట్టేస్తాను. గ్రహగతుల్ని ఆపేస్తాను. సూర్యచంద్రుల్ని నిరోధిస్తాను. సముద్రాన్ని ఇంకిపోయేలా చేస్తాను.

"బాణప్రయోగం చేసి ఈ ప్రపంచంలో రాక్షసులు, పిశాచాలు లేకుండా చేస్తాను. నా పరాక్రమ మేమిటో ప్రపంచానికి ఇప్పుడు తెలుస్తుంది. దేవతలు సీతను నాకు తిరిగి ఇవ్వనిచో వారిక జీవించరు. దేవలోకాలన్నీ దగ్ధమైపోతాయి;" అని ప్రళయకాల రుద్రుని వలె కనిపిస్తున్నాడు. మాటిమాటికి ధనుస్సును సంధించాలనే ప్రయత్నంలో ఉన్నట్లు అగుపిస్తున్నాడు.

రాముణ్ణి గతంలో ఇలా ఎప్పుడూ లక్ష్మణుడు చూడలేదు. భయంతో లక్ష్మణుని ఆంతర్యం కలత చెందింది. రామునికి నమస్కరిస్తూ లక్ష్మణుడు ఇలా పలికాడు.

" అన్నా ! రామా ! నీవు జితేంద్రియుడవు. మృదుస్వభావము గలవాడవు. సర్వభూత హితుడవు. క్రోధము వలన నీ దివ్యమైన స్వభావాన్ని విస్మరించడం యుక్తము కాదు. చంద్రునిలో సౌందర్యము, సూర్యునిలో వెలుగు, వాయువులో చలనము, భూమిలో ఓర్పు ఎలా స్థిరములో నీ కీర్తి కూడా అలా స్థిరమైనది.

"ఖండములై పడియున్న ఈ రథము, ధనుర్బాణాలు ఎవరివో మనకు తెలియదు. తొందరపడకు. ఎవడో ఒకడు చేసిన తప్పుకు లోకాల నన్నిటినీ నశింపచేయడం ధర్మం కాదు.

"నీవు సర్వలోక హితుడవు. నీ భార్య నశించాలని ఎవరు భావిస్తారు? సీతను ఎవడు అపహరించాడో వాడికొరకు అన్వేషిస్తాము. అన్నిచోట్ల వెతకుదాము. సీత అగుపించేవరకు అన్వేషిస్తాము. అప్పటికీ సీత లభించనిచో, సహకరించని దేవతల విషయంలో ఏమి నిర్ణయించుకోవాలో అప్పుడు ఆలోచిస్తాము. మన ప్రయత్నాలు ఏ లోపం లేకుండా చేద్దాము. అప్పటికీ సీత లభించనిచో ధనుస్సులను ఎక్కు పెడదాం" అని లక్ష్మణుడు పలకగానే రాముడు పసిబిడ్డలా విలపిస్తూ "సీతా-సీతా" అని అరచాడు.



లక్ష్మణుడు రాముని ఓదార్చుతూ, రామునికి నమస్కరిస్తూ, రాముని పాదాలు పట్టుకొని దు:ఖంతో ఇలా పలికాడు.

"రామా! నీవు దశరథుని పుణ్యాల పంటవు. నీ వియోగాన్ని భరించలేక తండ్రి ప్రాణాలు విడిచాడు. ఈ కష్టాన్ని నీవే భరించలేకపోతే మరెవరు భరించగలరు? తండ్రీ! దు:ఖము ఎవరినీ విడచి పెట్టదు.

"అన్నా! నహుషుని కుమారుడైన యయాతి దేవేంద్రలోకాన్ని పొందినాడు కదా! ఆయనకు దు:ఖం తప్పిందా?మన గురువైన వసిష్ఠుని నూరు మంది కుమారులు ఒకేరోజు మరణించారు కదా!

"తండ్రీ! సర్వులకు తల్లియైన భూమాతకు కూడా అప్పుడప్పుడు కంపనము సంభవిస్తూ ఉంటుంది కదా! మహా తేజోవంతులైన సూర్యచంద్రులకు గ్రహణం తప్పడం లేదుకదా!

"అన్నా! సీతకు ఏమీ జరగదు. ఒకవేళ ఏదైనా జరిగినా సామాన్యులవలె నీవు దుఃఖించకూడదు. రామా! నీలాంటి సత్యసంధులు, ఆలోచనాపరులు కష్టాలలో దుఃఖించరుకదా! అన్నా! ఇదంతా పూర్వము నీవు నాకు బోధించినదే. శోకముతో కప్పబడియున్న నీ జ్ఞానాన్ని నేను జాగృతం చేస్తున్నాను. అంతే. నీకు బోధించే శక్తి బృహస్పతికి కూడా లేదు.

"రామా! సర్వనాశనము వాంఛనీయము కాదుకదా! శత్రువు ఎవడో తెలుసుకొని వాణ్ణి శిక్షిస్తాము" అన్నాడు లక్ష్మణుడు.

రాముడు సారగ్రాహి. సత్యగ్రాహి.చిన్నవాడు చెప్పినా మంచి కనిపిస్తే దానిని గ్రహించే శుభలక్షణ సంపన్నుడు. మృదుస్వభావము కలవాడు. లక్ష్మణుని మాటలు రామునికి ధర్మబద్ధంగా తోచాయి.

రాముడు కోపాన్ని నిగ్రహించుకున్నాడు. లక్ష్మణుని చేయి పట్టుకొని ఇలా పలికాడు.

"నాయనా! లక్ష్మణా! ఇపుడు మనం ఏం చేద్దాం? ఎక్కడికి పోదాం? సీత మనకు ఎలా లభిస్తుందో ఆలోచించు" అన్నాడు.

"అన్నా! ఈ జనస్థానము రాక్షసులు నివసించే ప్రదేశము. మనము ఇక్కడ వెతకడమే మంచిది;" అన్నాడు లక్ష్మణుటు.

ధనుర్బాణాలు ధరించి రామలక్ష్మణులు సీతాన్వేషణలో బయలుదేరారు. బయలుదేరిన కొద్ది సమయంలోనే జటాయువును చూశారు. రక్తసిక్తమైన దేహముతో జటాయువు భూమిపై పడి ఉంది. రాముడు లక్ష్మణునితో ఇలా పలికాడు.

లక్ష్మణా! అటుచూడు. రక్తసిక్తమైన దేహముతో గ్రద్ద రూపములో పడియున్న వీడెవడో రాక్షసుడు. వీడు సీతను భక్షించి ఇక్కడ కూర్చుని యున్నాడు. వీణ్ణి ఇప్పుడే బాణాలతో చంపేస్తాను," అని పలికి ధనుస్సును ఎక్కుపెట్టి ఆ గ్రద్దమీదికి రాముడు పరుగులు తీశాడు.

## జటాయువు కైవల్యము

ప్రాణాపాయ స్థితిలో పడియున్న జటాయువు నోటినుండి రక్తము స్రవిస్తోంది. నురుగు జారుతోంది. జటాయువు రామునితో మెల్లగా ఇలా పలికింది.

"రామా! గొప్పదైన ఓషధిని అన్వేషించునట్లు ఏ దేవిని నీవు వెదకుచున్నావో, ఆ దేవిని, ఆమెతోపాటు నా ప్రాణాల్ని కూడా రావణుడు తీసికొనిపోయాడు.

"రామా! నీవు, లక్ష్మణుడు లేని సమయం చూసి, దుష్టుడైన రావణుడు సీతను అపహరించాడు. అది చూసిన నేను ఆ దుష్టుణ్ణి నివారించాను. నిరోధించాను. వాడితో పోరాడాను.

"రామా! అది నేను విరిచేసిన ధనుస్సు. అదిగో నేను విరగగొట్టిన కవచము, రథమూ. అక్కడ పడియున్న సారథిని కూడా నేనే చంపాను. చివరగా అలసిపోయిన నన్ను రావణుడు ఖడ్గముచే ఖండించాడు.



"నా రెక్కలను ఖండించి, సీతను ఎత్తుకొని ఆకాశమార్గాన వెళ్ళాడు. రాక్షసునిచే వధించబడి ప్రాణం పోయే పరిస్థితిలో ఉన్నాను. నీవు మళ్ళీ నన్ను చంపకు" అని జటాయువు హీనస్వరంతో పలికింది.

సీత వార్తను తెలిపి, మరణయాతనను అనుభవిస్తున్న జటాయువును చూచి రాముడు కన్నీళ్ళు కార్చాడు. ధనుర్బాణాలను క్రింద పడేసి రెండు చేతులతో జటాయువును కౌగలించుకున్నాడు. ఏడుస్తూ నేలపై పడ్డాడు. జటాయువును చూసి రామలక్ష్మణులు ఇద్దరూ దుఃఖించారు. రాముడు లక్ష్మణుని చూచి ఇలా పలికాడు.

**రాజ్యం భ్రష్టం వనేవాసః సీతా నష్టా పితా మృతః**
**ఈ దృశీయం మమాలక్ష్మీః నిర్దహేదపి పావకమ్ ॥**

"రాజ్యం పోయింది. వనవాసము ప్రాప్తించింది. సీత అపహరించబడింది. ఇప్పుడు మన తండ్రి జటాయువు మరణించాడు. లక్ష్మణా! నా దురదృష్టాన్ని చూశావా! అది అగ్నిని కూడా దహించే స్థితిలో ఉంది.

"నాయనా! నేను అగ్నిలో దూకినా మరణిస్తాననే నమ్మకం లేదు. ఆ అగ్ని కూడా చల్లబడవచ్చు. సౌమిత్రీ! సాగరాన దూకినా ప్రయోజనం లేకపోవచ్చు. నా వల్లవల్ల సముద్రము ఎండిపోవచ్చు.

"లక్ష్మణా! నన్ను ఎన్ని కష్టాలు చుట్టుముట్టాయి. నాలాంటి దురదృష్టవంతుడు ప్రపంచంలో ఉంటాడా? నావల్లనే కదా తండ్రిలాంటి ఈ జటాయువు మరణిస్తున్నాడు. నాయనా! సౌమిత్రీ! అందరినీ పోగొట్టుకుంటున్నాను. నిన్నుకూడా దూరం చేసుకుంటానేమో!" అంటూ రాముడు భోరున విలపించాడు.

రామలక్ష్మణులు తండ్రిని కౌగలించుకున్నట్లు జటాయువును పట్టుకొని పెద్దగా రోదించారు. జటాయువు దేహాన్ని ప్రేమతో నిమిరారు. తడిమారు. "తండ్రీ! నా ప్రాణసమానురాలైన సీత ఎక్కడుంది?" అని రాముడు జటాయువును అడిగాడు.

జటాయువు మాట్లాడలేక పోతున్నది. "లక్ష్మణా! జటాయువు ప్రాణాలు దుర్బల మయ్యాయి. దేహంలో నిలవలేక పోతున్నాయి. ఏ క్షణమైనా ఎగిరిపోయేలా ఉన్నాయి.

"కంఠస్వరం బాగా క్షీణించింది. నాకు సహాయం చేయాలని పోరాడి, రాక్షసునిచే హతుడై, అన్నిటికన్నా తియ్యనైన ప్రాణాలను విడిచేందుకు సిద్ధంగా ఉన్నాడు.

"ఓ జటాయూ! ఓ తండ్రీ! నీవు మాట్లాడగలిగితే సీత విషయము ఒక్కసారి చెప్పు. నీవు ఎలా వధించబడ్డావో మరొకసారి చెప్పు; రావణుడు సీతను ఎందుకు అపహరించాడు? నేను అతనికి ఏమి అపకారం చేశాను?" అని రాముడు ప్రశ్నించాడు.

జటాయువు మెల్లగా కళ్ళు తెరచి సెలయేళ్ళవలె అశ్రువులను స్రవిస్తున్న రాముని కళ్ళల్లోకి చూస్తూ, "రామా! రావణుడు సీతను ఆకాశమార్గాన హరించాడు. నేను యుద్ధం చేసి అలసిపోయి ఉన్న సమయంలో రావణుడు నా రెక్కలు ఛేదించాడు. సీతను తీసికొని దక్షిణదిక్కుగా పారిపోయాడు.

"రామా! నా ప్రాణాలు అల్లాడుతున్నాయి. నాకేమీ కనిపించడం లేదు. మృత్యుశకునాలు తెలుస్తున్నాయి.

"రామా! రావణుడు సీతను విందముహూర్తములో హరించాడు. ఆ ముహూర్తములో అపహరించబడిన సంపద త్వరలోనే యజమానికి చేరుతుందని శాస్త్రవచనము. అది రావణునికి తెలియదు.

"రామా! సీతను అపహరించిన రావణుడు గాలమును మ్రింగిన చేప లాంటివాడు. వాడు తొందరగా నశిస్తాడు. నీవు దుఃఖించకు. వాణ్ణి నీవు యుద్ధములో సంహరిస్తావు. సీతను పొందుతావు" అని మాట్లాడుతున్న జటాయువు నోటినుండి రక్తము స్రవించసాగింది.

"రామా! రామా! రామా! రావణుడు విశ్రవసుని కొడుకు. కుబేరుని సవతి సోదరుడు. రామా! రామా! రామా! రా....!" అంటూ కళ్ళు త్రిప్పేసి, మెడను వంచేసి, జటాయువు ప్రాణాలు విడిచేసింది.

రాముడు దుఃఖంతో కుమిలిపోయాడు. "లక్ష్మణా! మన తండ్రి మనల్ని వదలిపెట్టి వెళ్ళాడు. దండకారణ్యంలో హాయిగా జీవిస్తూ ఉండిన నాయన నావల్లే మరణించాడు. నాకు మేలు చేయాలని తాను మరణాన్ని కౌగిలించుకున్నాడు.

"లక్ష్మణా! దశరథుడు నాకు ఏవిధంగా పూజ్యుడో ఈ పక్షిరాజుకూడా అంతే. చూశావా! నాయనా! ఇద్దరి మరణానికి నేనే కారణమయ్యాను. నాలాంటి దురదృష్టవంతు డుంటాడా? తండ్రుల మరణానికి కారకుడైన కుమారుడుగా మిగిలిపోయాను.

**సర్వత్ర ఖలు దృశ్యన్తే సాధవో ధర్మచారిణః**
**శూరాః శరణ్యాః సౌమిత్రే తిర్యగ్యోనిగతే ష్వపి ॥**

"లక్ష్మణా! చూశావా! శూరులు, శరణ్యులు, ధర్మాత్ములు, సాధువులు పక్షిజాతిలో కూడా కనిపిస్తున్నారు కదూ!

"లక్ష్మణా! జటాయువు మరణం నన్ను కృంగదీస్తున్నది. పైగా నా కొరకు మరణించాడనే బాధ నన్ను తీవ్ర దుఃఖానికి గురిచేస్తున్నది. జటాయువు మరణంలో ఈ క్షణాన నాకు కలిగిన దుఃఖం సీతాపహరణము వల్ల కూడా కలగలేదు. సీతావియోగము కంటే జటాయువు మరణమే నాకు దుర్భరంగా ఉంది.

"నాయనా! లక్ష్మణా! కట్టెలు తీసికొనిరా! అగ్నిని ప్రతిష్ఠించు. నాకొరకు ప్రాణాలు విడిచిన తండ్రికి దహనసంస్కారము చేస్తాం;" అన్నాడు రాముడు.

లక్ష్మణుడు కట్టెలు తెచ్చాడు. అగ్నిని మథించాడు. రామలక్ష్మణులు జటాయువును చితిపైకి ఎక్కించారు. ఏడుస్తూ చితికి నిప్పంటించారు. బంధువుల్లా దుఃఖిస్తూ, చూస్తూ నిలబడిపోయారు.

మంటలు లేచాయి. జటాయువు కాలిపోతూ ఉంది. రామునిలో ఆరని మంటలు లేచాయి. "తండ్రీ! పోతున్నావా! ఇక నీ రూపం మాకు కనిపించదు కదూ" అని రాముడు తనలో తాను మాట్లాడుకుంటూ దగ్ధమవుతున్న జటాయువు దేహాన్ని చూస్తూ ఆగని కన్నీటిని స్రవింపచేస్తున్నాడు.

ఏనాటి బంధమో ఇది! ఏ జన్మ సంబంధమో! విడదీయలేని అనుబంధం ఋణానుబంధమో! ప్రేమానుబంధమో!



పుట్టిందెక్కడో? పెరిగిందెక్కడో? జాతి ఏమిటో? గోత్ర మేమిటో? రాముణ్ణి తలుస్తూ కన్నతండ్రి దశరథుడు మరణించాడు. రాముణ్ణి తిలకిస్తూ కనని తండ్రి జటాయువు కన్ను మూసాడు.

జటాయువు మరణమే రాముని ఎక్కువగా క్రుంగదీసింది. జటాయువు కొరకు తన కళ్ళలో ఎంతకాలంగా ఈ కన్నీరు కాపుర ముంటున్నాయో? లోకానికి, శోకానికి వీడని బంధం ఉందని బోధించే కన్నీళ్ళు కులగురువులే కదూ!

వాడుక లేదుగాని, ఏడుపులో ఎంత వేడుక ఉంది. ఎంత తియ్యదనముంది. లేకుంటే అందరూ ఎందుకు ఏడుస్తారు? రాముడు కూడా ఏడుస్తున్నాడే! రాముణ్ణి కూడా ఏడిపించే ఓ ఏడుపా! నువ్వు ఏడిస్తే ఎలా ఉంటుందో! నిన్ను ఏడిపించాలని కాదుగాని, నీలా ఏడవగలమో లేదో చూడాలని. అంతే.

జటాయువు కాలిపోయింది. బొందె పోయింది. బూడిద మిగిలింది. యుగాలు జీవించినా క్షణాల్లో అదృశ్యం కావలసిందే కదూ!

కొందరు ఉండి ఏడిపిస్తే, కొందరు పోయి ఏడిపిస్తారు. అందరూ ఏడిపించేవారే. వేడుక చూసేవారే.

జటాయువు అరవై వేల సంవత్సరాలు జీవించింది. ఎంత పుణ్యం చేసిందో పోయేముందు రాముని సహచర్యాన్ని పొందింది. చివరి క్షణంలో రాముని కోసం పోరాడింది. ధర్మంకోసం శ్రమించింది. అసువులు బాసింది. అయితేనేమి?

పోయేందుకు వచ్చిన దేహం ఎలాగూ నిలవదు. రాలిపోయే ముందు రామదర్శనం ఎంతమందికి లభిస్తుంది? రాముని ఒడిలో మరణం ఎవరికి ప్రాప్తిస్తుంది?

**కోమల చిత అతి దీనదయాలా! కారన బిను రఘునాథ కృపాలా**
**గీధ అధమ ఖగ ఆమిష భోగీ! గతి దీన్హి జో జాచత్ జోగీ!**
**సునహు ఉమా తే లోగ్ అభాగీ! హరి తజి హోహిఀ బిషయ అనురాగీ!**

"ఉమా! రాముని చిత్తము కోమలము. రాముడు దీనదయాళుడు. వారిది నిర్హేతుక కటాక్షము. గ్రద్ద నీచమగు పక్షి. మాంసాదులను భక్షిస్తుంది. అయినా రాముని కృపకు పాత్రురాలై యోగులు పొందలేని ఉత్తమగతిని పొందింది. పార్వతీ! అలాంటి రాముని చరణకమలములను త్యజించి విషయానురక్తి గల మానవుడు ఎంత దురదృష్టవంతుడు?" అని శివుడు పార్వతితో చెప్పినట్లు తులసీదాసు రామచరితమానసంలో తెలుపుతాడు.

రెక్కలు తెగిపడియున్న జటాయువును సీతమ్మ హృదయానికి హత్తుకొని "తండ్రీ!" అంటూ దుఃఖించింది. ప్రాణం విడిచేముందు రాముడు జటాయువును తన ఒడిలో పెట్టుకొని దుఃఖిస్తున్నాడు. జటాయువు భాగ్యమే భాగ్యము!

రాముడు వెళ్ళి రెండు పెద్ద మృగాలను చంపి తెచ్చాడు. మృగమాంసాన్ని తీసి, దర్భలు భూమిమీద పరచి, ఆ మృగమాంసాన్ని జటాయువుకు పిండప్రదానం చేశాడు రాముడు.

ఏ మంత్రమును ఉచ్చరించడము వలన స్వర్గప్రాప్తి కలుగుతుందో, పితృదేవతలకు సంబంధించిన అట్టి మంత్రాన్ని రాముడు పలికాడు.

రామలక్ష్మణులు గోదావరికి వెళ్ళి జటాయువుకు జలతర్పణా లిచ్చారు. జటాయువు ఉత్తమగతిని పొందినట్లు వాల్మీకి వర్ణించాడు.

స గృధ్రరాజః కృతవా న్యశస్కరం
సుదుష్కరం కర్మ రణే నిపాతితః
మహర్షి కల్పేన చ సంస్కృత స్తదా
జగామ పుణ్యాం గతిమాత్మనః శుభామ్ ॥

దుష్కరమైన, కీర్తిదాయకమైన పని చేసి, యుద్ధములో ప్రాణాలు విడిచింది జటాయువు. అట్టి జటాయువుకు మహర్షివంటి రాముడు సంస్కారములు చేయుట వలన జటాయువు పుణ్యప్రదమైన, మంగళప్రదమైన లోకాలకు వెళ్ళింది.

జటాయువు వృద్ధజీవి. అయినా యువకునిలాగా రావణునితో పోరాడింది. ప్రాణాన్ని కూడా లెక్కచేయకుండా హోరాహోరీగా తలపడింది. రావణుని తీవ్రంగా గాయపరచింది. ఆ ధర్మపోరాటంలో ప్రాణాలు పోగొట్టుకుంది.

ఇది మన ప్రాచీన భారతీయ సంస్కృతీ వైభవము. సమాజంలో ఒక స్త్రీకి జరిగే అన్యాయాన్ని పక్షికూడా ప్రతిఘటించింది. ఆ మహాకార్యంలో అసువులుబాసింది.

ఈరోజు ఆ పరిస్థితి ఉందేమో ఆలోచించండి. ఎవరికి అన్యాయం జరిగినా దిక్కులేదు. స్త్రీలకు ప్రత్యక్షంగా అన్యాయం జరుగుతున్నా కళ్ళప్పగించి చూచే స్థితికి దిగజారిపోయాం. ప్రతిఘటించే శక్తి లేని దుర్బలులయ్యాం.

స్వేచ్ఛగా కళాశాలలకు వెళ్ళలేని విద్యార్థినులు, కార్యాలయాలకు వెళ్ళలేని మహిళలు, రాత్రిపూట ఒంటరిగా ఇంటికి రాలేని గృహిణులు ఎంతటి మానసిక వ్యథకు గురి అవుతున్నారో సానుభూతితో ఆలోచించే హృదయాలే లేకుండా పోయాయి. పైగా మానభంగాలు, మారణహోమాలు దినచర్యలుగా మారిపోయాయి.

జటాయువు లాంటి యువకులు ఈనాడు అవసరం. సంస్కృతిని రక్షించే వ్యక్తులు ఈనాడు సమాజానికి కావాలి. ధర్మపోరాటానికి సిద్ధపడే మనస్తత్త్వాలు తయారుకావాలి. ఈ వీరజటాయువు గాథ పాఠకులలో సామాజిక చైతన్యాన్ని జాగృతం చేస్తుందని విశ్వసిస్తున్నాను.

## కబంధ వధ

సీతను అన్వేషిస్తూ రామలక్ష్మణులు బయలుదేరారు. జనస్థానానికి మూడు క్రోసుల దూరం ప్రయాణం చేసి ప్రవేశించుటకు సాధ్యము కాని క్రౌంచారణ్యములో కాలు పెట్టారు.

క్రౌంచారణ్యములో సీత జాడ తెలియలేదు. క్రౌంచారణ్యానికి మతంగాశ్రమానికి మధ్య అనేకమైన క్రూర జంతువులకు నివాసమైన అరణ్యముంది. అక్కడ చీకటి గుహలో అయోముఖి అనే రాక్షసస్త్రీ ఉంది. కామాంధురాలైన ఆ రాక్షసస్త్రీ శూర్పణఖలాగా లక్ష్మణునిపై బడింది. లక్ష్మణుడు తన సహజధోరణిలో అయోముఖి ముక్కు చెవులను, అదనంగా స్తనములు ఖండించాడు. ఆ రాక్షసి ఏడుస్తూ పరుగెత్తింది.



ఆ తరువాత రామలక్ష్మణులు భయంకరారణ్యంలో ప్రవేశించారు. లక్ష్మణుని బాహువు అదరింది. మనసు కలత చెందింది. దానికి తోడు అపశకునాలు కన్పించాయి.

ఆపదలు ఎదురయ్యే దుశ్శకునాలు కన్పిస్తున్నందువ సిద్ధంగా ఉండమని లక్ష్మణుడు రాముని జాగృతం చేశాడు. ఈలోగా వంచులకము అనే పక్షి కూతవేసింది. ఆ పక్షికూత విజయచిహ్నము అన్నాడు లక్ష్మణుడు.

ఈలోగా గొప్ప శబ్దము వినిపించింది. అది ఏమిటా అని రామలక్ష్మణులు ఆలోచించారు. ఒక పొదలో పెద్ద ఉదరమే ఆకారముగా గల రాక్షసుడు కనిపించాడు. వాడే కబంధుడు.

మెడా తలా లేనివాడు. మొండెము, చేతులు మాత్రమే ఉన్నాయి. వాడి ముఖం పొట్టలో ఉంది. దట్టమైన రోమాలతో వల్లటి పర్వతంలాగా కనిపిస్తున్నాడు. మేఘరూపుడైన ఆ రాక్షసుని కంఠధ్వని మేఘగర్జనములా వుంది. అతని కన్ను కడుపుమీదే ఉంది: ఆ కన్ను పెద్ద రెప్పలు కలిగి, పచ్చని గ్రుడ్డుతో అతి భయంకరంగా ఉంది. పెద్ద నోరు, పొడనైన కోరలు ఉన్నాయి. వాడు క్షణక్షణానికి ఏదో నాకుతున్నట్లు నాలుక చాస్తూ వున్నాడు.

ఏనుగులను, పులులను, సింహాలను భక్షిస్తూ జీవించే ఆ రాక్షసుడు భుజాలు చాస్తే ఆమడ పొడవున్నట్లు తెలుస్తున్నాయి. చేతులు చాచి దూరంగా ఉండే మృగాలను పట్టుకొని, తానున్న చోటికే ఈడ్చుకొని భక్షిస్తూ జీవిస్తాడు.

కబంధుడు భయంకరమైన తన బాహువులను చాచి రామలక్ష్మణులను కలిపి పట్టుకున్నాడు. వాళ్ళిద్దరిని తనకు సమీపంగా లాగుతున్నాడు. రామలక్ష్మణులు కబంధునికి దగ్గరగా లాగబడ్డారు.

"ఎవరు మీరు? ఖడ్గములు, ధనుస్సులు ధరించి భయంకరమైన ఈ అరణ్యంలో ఎందుకు ప్రవేశించారు? నాకు ఆహారంగా వచ్చారా? ఇక్కడ మీకు ఏమి పని? ఇక మీరు బ్రతకరు;" అన్నాడు కబంధుడు.

"లక్ష్మణా! ఏమిటిది? ఒక కష్టముపై మరొక కష్టము వచ్చిపడుతూ ఉంది. సీత లభించలేదు. దానికి బదులుగా ఈ ఆపద సంభవించింది. కాలము విపరీతంగా విరుచుకపడి మనల్నిద్దరిని బాధిస్తోంది;" అన్నాడు రాముడు.

రామలక్ష్మణులను అలాగే బంధించి పట్టుకొని, "మిమ్మల్ని దైవం నాకు ఆహారంగా పంపింది. ఈరోజు మంచి ఆహారము నాకు లభించింది;" అన్నాడు కబంధుడు.

"రామా! ఈ మూర్ఖుడు మనల్నిద్దరినీ కబళించేలా ఉన్నాడు. ఆలస్యము చేయకుండా వీడి బాహువుల్ని ఖండిస్తాము. వీడి శక్తి అంతా భుజాలలోనే ఉన్నట్లు తెలుస్తోంది;" అంటున్న లక్ష్మణుని మాటలను కబంధుడు విన్నాడు. క్రుద్ధుడైన కబంధుడు నోరు తెరచి వారిని భక్షించుటకు ప్రయత్నించాడు.

రామలక్ష్మణులు విజృంభించి, ఖడ్గములను చేబూని కబంధుని చేతులను భుజముల వద్దకు నరికేశారు. రాముడు కుడిచెయ్యిని ఖండించగా, లక్ష్మణుడు ఎడమచేయిని నరికేశాడు. భూమ్యాకాశాలు దద్దరిల్లేలా అరచి కబంధుడు క్రింద పడ్డాడు.

దీనుడై పడి ఉన్న కబంధుడు రామలక్ష్మణుల వివరాలను అడిగి, లక్ష్మణుడు చెప్పగా విన్నాడు. కబంధుని గూర్చి లక్ష్మణుడు ప్రశ్నించాడు. వెంటనే కబంధునికి గతస్మృతులు తెలిశాయి. ఇంద్రుని మాటలు జ్ఞాపకమొచ్చాయి.

"లక్ష్మణా! పూర్వము నేను చక్కని రూపవంతుణ్ణి. కఠోరమైన తపస్సు చేసి బ్రహ్మదేవుని నుండి దీర్ఘాయువును పొందాను. నాకు ఆక్షణం నుండి గర్వము అధికమైంది.

"దీర్ఘాయువు అయిన నన్ను ఇంద్రుడేమి చేయగలడు? అని గర్వించి ఇంద్రునిపై దండెత్తాను. ఇంద్రుడు భయంకరమైన వజ్రాయుధమును ప్రయోగించాడు. నా తొడలు, తల కూడా మొండెములోకి దూరిపోయాయి.

"బ్రహ్మదేవుని మాటను గౌరవించి, నన్ను యమలోకానికి పంపకుండా ఇంద్రుడు విడచిపెట్టాడు. నేను ఎలా జీవించాలి? అని ఇంద్రుని ప్రార్థించాను.

"యోజనము పొడవుగల బాహువులను ఇంద్రుడు నాకు ఇవ్వడమే కాక నా పొట్టలో దంతములున్న నోరుకూడా అమర్చాడు. నా భుజాల సహాయముతో జంతువులను దగ్గరికి ఈడ్చుకొని తింటూ బ్రతుకుతున్నాను.

"లక్ష్మణునితో కూడి రాముడు నీ బాహువులను ఛేదించిననాడు నీవు స్వర్గాన్ని పొందుతావు" అని ఇంద్రుడు నాతో పలికాడు. "రామా! ఈనాడు నీవు రావడం చేత నేను ధన్యుణ్ణయ్యాను;" అన్నాడు కబంధుడు.

రాముడు కబంధునితో ఇలా పలికాడు. "జనస్థానములో నేను, నా తమ్ముడు ఆశ్రమంలో లేని సమయాన నా భార్యయైన సీతను రావణుడు అపహరించాడు.

"నేను అతని పేరు మాత్రమే విన్నాను. అతణ్ణి చూడలేదు. అత నెక్కడుంటాడో, అతని ప్రభావము ఎలాంటిదో కూడా తెలియదు. దారీ తెన్నూ తెలియక మేము ఈ అరణ్యములో సీతను వెతుకుచూ తిరుగుచున్నాము. మేము నీకు సహాయము చేశాము కదా! నీకు తెలిసి ఉంటే సీత జాడను మాకు తెలియచెప్పు;" అన్నాడు రాముడు.

"రామా! మీరు నాకు దహనసంస్కారము చేయండి. అంతవరకు నేను శక్తిహీనుడనే. నన్ను మీరు దహించిన తరువాత నేను మీకు సలహా ఇవ్వగలను. చక్కని స్నేహితుని చూపగలను.

"రామా! శాపకారణంగా నా జ్ఞానము నశించిపోయింది. కానీ నా దేహము దహించబడిన తరువాత రాక్షసుడైన రావణుని గూర్చి చెప్పగలిగిన వ్యక్తిని గూర్చి నీకు చెప్తాను. అతని స్నేహము వలన నీవు సుఖాన్ని పొందుతావు. ఈ మూడులోకాల్లో అతనికి తెలియనిది లేదు" అని పలికాడు కబంధుడు.

రామలక్ష్మణులు కబంధుని శరీరాన్ని దగ్ధం చేశారు. కబంధుడు దివ్యదేహంతో, దివ్యమైన వస్త్రాలతో, దివ్యమైన హారాలతో శోభిస్తూ దర్శనమిచ్చాడు. అతని కొరకు వచ్చిన విమానాన్ని ఎక్కి ఇలా పలికాడు.

"రామా! నీవు సీతను పొందే ఉపాయాన్ని చెబుతాను విను.



"రామా! లోకంలో సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయము అని ఆరు యుక్తులు ఉన్నాయి. ఈ ఆరింటి ద్వారా సాధించలేని కార్యముండదు.

"నీకు దుర్దశ నడుస్తూ ఉంది. అందుచేతనే భార్యావియోగము సంభవించింది. వీలాగే దుర్దశను అనుభవించు వానితో నీవు స్నేహము చేయడం మంచిది. మిత్రుడు లేకుండా నీకు కార్యసిద్ధి లభించదని నా అభిప్రాయము;" అన్నాడు కబంధుడు.

కబంధుడు చెప్పిన ఆరు ఉపాయాలు:- **1. సంధి:-** శత్రువుతో సంధి చేసుకోవడం. **2. విగ్రహము:-** శత్రుత్వాన్ని కొనసాగించడం. **3. యానము:-** సమరానికి వెళ్ళడం **4. ఆసనము:-** సమయానికి నిరీక్షించడం. **5. ద్వైధీభావము:-** శత్రుపక్షములో కలతలు రేపడం. **6. సమాశ్రయము:-** మరొకరి సహాయాన్ని పొందడము. ఇవి కార్యసిద్ధికి కబంధుడు చెప్పిన ఆరు ఉపాయాలు. ఈ ఆరింటిలో రామునికి సమాశ్రయమే చక్కని ఉపాయమని కబంధుని అభిప్రాయము. కబంధుడు రామునితో చెప్తున్నాడు.

"రామా! పంపాతీరాన, ఋష్యమూక పర్వతము మీద సుగ్రీవుడు అనే వానరనాయకుడు ఉన్నాడు. అతడు గొప్ప వీరుడు. తేజోవంతుడు. అసమాన పరాక్రమవంతుడు. సత్యసంధుడు. ధైర్యశాలి. బుద్ధిమంతుడు. ఒక్కమాటలో చెబితే గొప్పవాడు. మంచివాడు కూడా.

"ఇంద్రుని కుమారుడైన వాలి అతని జ్యేష్ఠభ్రాత. రాజ్యకారణంగా వాలి తమ్ముడైన సుగ్రీవుని తరిమేశాడు. సుగ్రీవుడు నలుగురు వానరవీరులతో కలిసి ఋష్యమూక పర్వతముపై నివసిస్తున్నాడు.

"రామా! సీతను అన్వేషించడములో అతడు నీకు సహాయం చేయగలడు. నీకు మేలు చేయగలడు. దుఃఖించకు.

**భవితవ్యం హి యచ్చాపి న తచ్ఛక్య మిహాన్యథా**

**కర్తు మిక్ష్వాకు శార్దూల కాలో హి దురతిక్రమః**

"రామా! జరిగేది జరిగే తీరుతుంది. కాలాన్ని ఎవరూ అతిక్రమించలేరు. అడ్డుకోలేరు.

"రామా! నీవు తొందరగా సుగ్రీవుని చేరు. అగ్నిసాక్షిగా స్నేహాన్ని కుదుర్చుకో. దానివల్ల మిత్రద్రోహం జరగదు. రామా! సుగ్రీవుడు కృతజ్ఞుడు. వానరుడని అతణ్ణి చిన్నచూపు చూడకు.

"సుగ్రీవుడుకూడా ఇతరుల సహాయం అవసరమై ఉన్నాడు. మీరిద్దరూ అతనికి సహాయం చేయండి. అతని కార్యము నెరవేరలేదని మీ కార్యాన్ని అతడు అలక్ష్యం చేయడు.

"సుగ్రీవుడు సూర్యుని పుత్రుడు. గొప్ప పరాక్రమవంతుడు. సోదరుడైన వాలికి భయపడి ఋష్యమూక పర్వతముపై ఉన్నాడు. నీవు అక్కడికి వెళ్ళి అతని మైత్రిని పొందు.

"నరమాంస భక్షకులైన రాక్షసుల స్థావరములన్నీ సుగ్రీవునికి తెలుసు. సూర్యుని కిరణములు ఎక్కడెక్కడ ప్రసరిస్తాయో ఆ ప్రదేశాలన్నీ సూర్యపుత్రుడైన సుగ్రీవునికి తెలుసు. సీత ఎక్కడుండేది అన్వేషించి నీకు చెబుతాడు.

"రామా! పంపాతీరంలో మతంగ మహర్షి శిష్యులైన ఋషులు ఉండేవారు. వారంతా ఇప్పుడు లేరు. తరించిపోయారు. వారికి ఉపచారాలు చేస్తూ, వారితో కలిసి తపస్సు చేసిన శబరి అనే సాధుమాత అక్కడుంది. ఆమె చాలా వృద్ధురాలు. నీ దర్శనార్థమై ఆమె నిరీక్షిస్తోంది.

"రామా! మతంగముని శిష్యులు పంపాతీరము నందలి వనమునుండి సమిధలు మూటకట్టుకొని తెస్తూ వుండేవారు. వారి శరీరమునుండి రాలి క్రిందపడిన చెమట బిందువులు వారి తపఃప్రభావముచేత పూలమాలలుగా మారాయి. రామా! ఆ పుష్పమాలలు వాడవు. ఊడవు.

"రామా! ఋష్యమూక పర్వతము బ్రహ్మదేవునిచేత నిర్మించబడిందని చెబుతారు. ఆ పర్వతముపై నిద్రించిన వానికి స్వప్నములో ఏ సంపద లభిస్తుందో అట్టి సంపదను మేల్కొనగానే అతడు పొందుతాడని చెబుతారు. దుష్టుడెవ్వడూ ఆ పర్వతాన్ని ఎక్కలేడని అంటారు.

"రామలక్ష్మణులారా! ఋష్యమూక పర్వతముపై జాతితో మూయబడిన పెద్ద గుహ ఉంది. నలుగురు వానరశ్రేష్ఠులతో కలిసి సుగ్రీవుడు ఆ గుహలో నివసిస్తున్నాడు;" అని పలికి రామలక్ష్మణుల అనుమతితో కబంధుడు అంతర్హితుడయ్యాడు.

రామలక్ష్మణులు బయలుదేరారు. కబంధుడు చెప్పిన మార్గాన్ని అనుసరించి నడచి పంపా సరోవరం చేరారు. సుగ్రీవుని జాడకై అన్వేషించసాగారు. అలా తిరుగుతూ ఉండగా పంపాతీరమున ఒక రమ్యమైన ఆశ్రమాన్ని చూశారు. రామలక్ష్మణులు ఆశ్రమాన్ని సమీపించుటకు బయలుదేరారు.

## పరమపావని శబరి

అది పంపాసరోవరం. ఎందరో మహర్షులు చరించి తరించిన పుణ్యస్థలం. మహోన్నత వృక్షాలతో, మనోహరమైన లతలతో నయనానందమును కూర్చే ఆ పుణ్యభూమి నందనవనంలా శోభిస్తోంది.

దివ్యపరిమళములను వెదజల్లు తెల్లకలువలు, ఎఱ్ఱతామరలు, నల్లకలువలతో రంగురంగులుగా ప్రకాశించే ఆ పంపాసరోవరము అందమైన తివాసీలా తెలుస్తోంది. సుమపరిమళంతో, తియ్యని జలముతో పంపాసరోవరం ఆశ్రితులను ఆనందింప జేస్తోంది.

పంపాతీరాన పుష్పించిన మామిడి వృక్షాలూ, పొన్నచెట్లు, జాజితీగలు, మట్టిచెట్లు, మల్లెపొదలు, మొగలి డొంకలు, దానిమ్మచెట్లు విరగబూసి ఉన్నాయి. జోరుగ కాసి ఉన్నాయి. పుష్కలంగా పండి ఉన్నాయి.

తేనె లొలుకు తియ్యమామిడి చెట్లను చూస్తూ, నిర్మలమైన వనంలో నిర్భయంగా చరించే మృగ సమూహాన్ని వీక్షిస్తూ, రామలక్ష్మణులు రమ్యమైన మతంగ మున్యాశ్రమం చేరారు. వివిధ వృక్షాలచే కప్పబడి, పారిజాత సుమ సౌరభంతో శోభించే ఆ పవిత్ర పుణ్యాశ్రమంలో వసించే శబరిని చూశారు రామలక్ష్మణులు.

మల్లెల తెల్లదనంతో మనసు కలిపి వచ్చిన నల్లనయ్యను, తేనె తీపి కలబోసిన ప్రేమతో వెంట నడచి వచ్చిన ఎఱ్ఱనయ్యను చూచి, ఎదపొంగే ఆనందంతో ఎదురొచ్చింది శబరి. కల



పుష్పించిందని, కథ ఫలించిందని, నిండిన నేత్రాల నుండి రాలకుండా కన్నీటిని కళ్ళల్లోనే ఆపుకొని, నిండుకుండలా కదిలొచ్చి రాముని పాదాలను తన అశ్రువులతో అభిషేకించింది. పూలమనసుతో పూజించి పులకరించింది.

***ఏనాటికైనా నీ వాకిట నిలుస్తాడు రాముడని***
***ఆనాడు ప్రేమతో పలికాడు మతంగముని***
***కలిసొచ్చిన భాగ్యాన్ని నేడు కనులారా చూసుకొని***
***మాటరాక మూగదై మనసుతో అంది రమ్మని ....***

శబరి వృద్ధురాలు. కడు సిద్ధురాలు. హద్దులెరుగని తపస్సుతో శుద్ధబ్రహ్మాను సాక్షాత్కరించుకొనిన ప్రసిద్ధురాలు. పరమ తపోనిధి మతంగమహర్షి శిష్యురాలు.

అర్ఘ్యపాద్యాదులు సమర్పించి అన్నదమ్ములను అర్చించింది శబరి. ఆమె సద్భక్తికి సంతసించాడు సుగుణాభిరాముడు. ఆమె సంయమనానికి ఆనందించాడు సలక్షణుడైన లక్ష్మణుడు.

పలకలేక, పలుకురాక పరవశిస్తున్న శబరి హృదయ పారవశ్యాన్ని తిలకించిన రామభద్రుడు తానే ముందుగా మాట కదిపాడు.

**కచ్చిత్తే నిర్జితా విఘ్నాః కచ్చిత్తే వర్ధతే తపః**
**కచ్చిత్తే నియతః క్రోధ ఆహారశ్చ తపోధనే ॥**

"తపోధనురాలా! నీ తపస్సు విఘ్నము లేకుండా సాగుతోంది కదా! తపస్సు వృద్ధి చెందుతోంది కదా! క్రోధమును పూర్తిగా జయించావా? ఆహార నియమాన్ని పాటిస్తున్నావు కదా!

"శబరీ! నీ మనసుకు సుఖం లభించిందా? నీవు చేసిన గురుసేవ ఫలించిందా?" అని ప్రశ్నించాడు రాముడు ఆదరంతో.

తాపసియై దండకారణ్యంలో తన్మయత్వం చెందిన రాముడు తపోభూమికల్ని సున్నితంగా స్పృశిస్తూ, సాధనలే శ్వాసలుగా భావించి జీవించిన శబరిని జాగృతం చేస్తూ ప్రశ్నించాడు.

ఏదో ఒక వృత్తి చేసుకుంటూ మనిషి జీవిస్తాడు. ఏదో ఒక వృత్తిని (సంకల్పాన్ని) కదలించుకుంటూ మనసు మనుగడను సాగిస్తుంది. వృత్తులే ప్రవృత్తిని నిర్ణయిస్తాయి. వాటి నివృత్తికి కృషి చేసేదే తపస్సు. ఆ మార్గంలో నిరంతరం తపించేదే తపస్సు. దీనినే యోగంలో చిత్తవృత్తినిరోధ మన్నారు.

అనేక జన్మలయందు చేసిన పనులు, చూసిన రుచులు మనసులో దాగి ఉంటాయి. కారాగృహము నుండి బయట పడాలని ఊహించే ఖైదీలాగా, పంజరం నుండి బయటపడాలని పరితపించే పక్షిలాగా మనసులో దాగియున్న ప్రవృత్తులు బాహ్యవిషయాల యందు రమించాలని ఉబలాట పడుతుంటాయి. ఇవియే వాసనలు. వీటిని వ్యుత్థాన సంస్కారము అనికూడా అంటారు.

తపస్సు వృత్తులను నిరోధిస్తుంది. ఈ నిరోధప్రవాహము నిరాటంకంగా సాగడాన్ని సరళధ్యానము అంటారు. నిరోధసంస్కార ప్రభావము వ్యుత్థానసంస్కారమును అదృశ్యం చేస్తుంది. తపస్సులో ఇది మనకు గోచరించే క్రమ పరిణామము. ఇట్టి విరళము కాని సరళధ్యానము సాగుతున్నదా? అని రాముడు శబరిని ప్రశ్నిస్తున్నాడు.

**వృత్తి పావల్యా చిత్స్వరూప్ తైమన్ హోతె సుఖరూప్**
**మనీ అసతా దుఃఖ సంతాప్ కేల్యా హీ తప్ అతిమిథ్య**

"వృత్తి చైతన్యరూపంగా లయిస్తే మనసు సుఖిస్తుంది. మనసు ఉన్నంతవరకూ దుఃఖాలు, సంతాపాలు తప్పవు. అవి పోగొట్టుకోకుండా తపస్సు చేయడ మనేది ఊహ మాత్రమే" అంటూ శ్రీరాముడు శబరికి బోధ చేసినట్లు చెబుతుంది భావార్థ రామాయణము.

తపస్సు నిరాటంకముగా సాగుతూ ఉండవచ్చు. అంతమాత్రాన సరిపోదు. సాధనలో ప్రగతి గోచరించాలి. అందుచేత నీ తపస్సు వృద్ధిచెందుతూ ఉందా? అని రాముని రెండవ ప్రశ్న.

ఆహారం పెడ్తే మనిషి పెరగాలి. నీరు పోస్తే మొక్క ఎదగాలి. ఆహారం తిన్నా మనిషి క్షీణిస్తూ, నీళ్ళు పోసినా మొక్క నశిస్తూ ఉందంటే లోపం ఎక్కడో ఉండాలి. ఆ లోపాల్ని తొలగించినపుడే ప్రగతి సాధ్యపడుతుంది. భక్తిలో ఆవిధమైన ప్రగతి లభిస్తూ ఉందా? అంటున్నాడు రాముడు.

**ద్రవీభావ పూర్వికాహి మనసో భగవదాకారతా సవికల్పక వృత్తి రూపా భక్తిః**

"మనసు ప్రేమపారవశ్యంలో ద్రవీభవించి భగవంతుని ఆకారమును పొందుటయే భక్తి" అని మధుసూదన సరస్వతి నిర్వచించారు.

ఈ స్థితి తేలికగా అందరికీ లభించదు. కళ్ళకు గంతలు కట్టి చూడమంటే ఎలా అసాధ్యమో అవరోధాల మధ్య నిలిచి ఆత్మానందాన్ని పొందడము కూడా అసాధ్యమే. కనుక అడ్డుతెరలు తొలగాయా! లేదా! అని ప్రశ్నిస్తూ "క్రోధాన్ని పూర్తిగా జయించావా?" అని అడిగాడు రాముడు.

క్రోధము కామము వలన ఏర్పడుతుంది. ఇవి రజోగుణము నుండి పుడుతాయి. రజోగుణము మనసులో ఉన్నంత వరకు కామక్రోధాలు నిరోధింపబడవు.

క్రోధము మనసును పాడుచేస్తుంది. క్రోధము శాంతిని హరిస్తుంది. అగ్ని లాగా దహించి వేస్తుంది. క్రోధమనే అగ్నికి కామము నెయ్యి లాంటిది. ఈ కామక్రోధాలే ఆధ్యాత్మిక మార్గంలో ప్రబల శత్రువులు. కనుక వాటిని నిశ్శేషంగా నిర్మూలించావా? లేదా? అని రాముడు శబరిని ప్రశ్నించాడు. కామక్రోధాల వేగాన్ని నిరోధించినవారు మాత్రమే ఈ ప్రపంచంలో సుఖవంతులు.

**శక్నోతీ హైవ యస్సోఢుమ్ ప్రాక్శరీర విమోక్షణాత్**
**కామ క్రోధోద్భవం వేగమ్ సయుక్త స్స సుఖీ నరః**



"ఎవడు ఈ జన్మము నందే దేహమును చాలించుటకు పూర్వమే కామక్రోధముల వలన కలిగిన సంక్షోభమును అరికట్ట గలుగుచున్నాడో వాడే యోగి; వాడే సుఖి అగుచున్నాడు" అని భగవద్గీత-కర్మసన్యాస యోగమునందు శ్రీకృష్ణపరమాత్మ బోధించియున్నాడు.

క్రోధము మనసు యొక్క స్వభావము. మనము గ్రహించే ఆహారము యొక్క సూక్ష్మాంశమే మనసుగా మారుతూఉంది. రాజసికాహారమును గ్రహిస్తే అది మనమును రజోగుణంతో నింపి, రజోగుణ సముద్భవములైన కామక్రోధాదులను కదిలిస్తుంది. కనుకనే ఆహార నియమమును పాటిస్తున్నావా! అని రాముడు శబరిని ప్రశ్నించాడు.

ఈవిధమైన సాధనల వల్ల మనసు సుఖించాలి. అట్టి సుఖం లభ్యమైనదా? అని ప్రశ్నించాడు రాముడు. ఇవన్నీ జరిగినపుడే గురువును సేవించినందుకు ఫలం. గురుసేవ ద్వారా నిత్యానందాన్ని పొంది తరించడమే శిష్యుల ఏకైక లక్ష్యం.

"శబరీ! గురుసేవకు ఫలితం లభించిందా?" అని రాముడు ప్రశ్నించాడు. రాముడు అడిగిన ఆరు ప్రశ్నలకు కలిపి ఒక్కమాటలో సమాధానం చెప్పింది శబరి.

**అద్యప్రాప్తా తపః సిద్ధి స్తవ సందర్శనా న్మయా**
**అద్య మే సఫలం తప్తం గురవశ్చ సు పూజితాః**

"రామా! ఈనాడు నీ దర్శనభాగ్యం లభించుటచేత నాకు తపస్సిద్ధి లభించిందని భావిస్తున్నాను. నేను చేసిన తపస్సు, నేను చేసిన గురుసేవ సఫలము లైనాయని విశ్వసిస్తున్నాను!"

పరమాత్మను దర్శించడమే సమస్త సాధనలయొక్క లక్ష్యము. గురుసేవ ద్వారా భగవంతుని దర్శించవచ్చునని నిరూపించిన పవిత్రాత్మురాలు శబరి. పవిత్రమైన జీవితం గడిపిన నిర్మల భక్తుల ఇంటికి పిలవకుండానే భగవంతుడు వస్తాడనే ఆదర్శాన్ని అందించిన ప్రేమమూర్తి శబరి.

పరమాత్మ హృదయాన్ని చూస్తాడు. మధురమైన ప్రేమకు లొంగుతాడు. షడ్రసోపేతంగా విందును సిద్ధం చేశాడు దుర్యోధనుడు. శ్రీకృష్ణునికి దానియందు అభిరుచి లేదు. పిలవకపోయినా విదురుని ఇంటికి వెళ్ళి పండ్లతొక్కలను ప్రియంగా ఆరగించాడు. అవే కృష్ణునికి చాలా రుచిగా ఉండినాయి. పరమాత్మ రసస్వరూపుడు. ఆయన సారగ్రాహి.

శబరి రామునికి నమస్కరించి చెబుతోంది.

"తండ్రీ! నీవు చిత్రకూటపర్వతముపై ఉన్నప్పుడే నేను సేవించిన మునులందరూ దివ్యమైన విమానాలెక్కి స్వర్గానికి వెళ్ళిపోయారు. వారు వెళ్తూ నాతో ఇలా పలికారు.

"శబరీ! రాముడు పవిత్రమైన నీ ఆశ్రమానికి వస్తాడు. రామలక్ష్మణులకు అతిథిసేవలు అందించిన తరువాత నువ్వు ఉత్తమ లోకాలకు చేరుతావు" అని పలికారు.

"రామా! ఈ పంపాతీరమున లభించే ఉత్తమమైన ఫలాలను, పదార్థములను నీకోసం భద్రపరచి ఉంచాను;" అని పలికింది శబరి.

మహర్షులకు చేసిన సేవలు వృథా కావు. శబరి ఉత్తమోత్తమమైన ఫలితాన్ని అందుకొని సంతోషించింది. రాముని రాకను ముందుగానే తెలియచేసి రాముని కొరకు నిరీక్షిస్తూ ఉండమని ఋషులు చెప్పి వెళ్ళారు. శబరి వద్దకే రాముడు వస్తాడని మరీ చెప్పి వెళ్ళారు.

శబరికి మహర్షుల వచనాలపై అకుంఠిత విశ్వాసముంది. వారి వచనాలు వృథా కావనే నమ్మకం ఉంది. ఆమె నమ్మకం వమ్ము కాలేదు. ఆమె నిరీక్షణకు ఫలితం లభించింది. రాముడు లక్ష్మణసమేతుడై రానేవచ్చాడు. శబరిని ఆశీర్వదించాడు.

మహాత్ములను సమీపించవచ్చు. వారి మాటలు ఆలకించవచ్చు. కానీ ఆలకించిన విషయాన్ని త్రికరణశుద్ధిగా ఆచరించువారే పరమాత్మకృపకు పాత్రులై తరిస్తారు.

రాముని కొరకు వనములో లభించే ఉత్తమ పదార్థములను భద్రపరచి ఉన్నట్లు శబరి చెప్పిందే గాని ఫలాలను ఆమె పెట్టినట్లు గాని, రాముడు తినినట్లు గాని వాల్మీకి రామాయణంలో చెప్పబడలేదు.

కొడుకు పేరు సోమలింగం అన్నట్లు లేని విషయానికి కాల్పనిక గాథలు ఎన్నో పుట్టుకొచ్చాయి. రాముడు శబరి ఎంగిలిచేసి పెట్టిన ఫలాలను ఆరగించాడని ఒక విషయం లోకంలో గొప్పగా ప్రాచుర్యమై ఉంది.

ఇది ఎవరు చేసిన ఎంగిలో తెలియదు గాని మొత్తానికి పెద్ద రుచికరంగా తయారైంది. వాల్మీకమునందు గాని, అధ్యాత్మరామాయణము నందుగాని, కంబరామాయణము నందుగాని, తులసీరామాయణము నందుగాని ఈ ప్రసక్తి రాలేదు. మరి ఎలా పుట్టుకొచ్చినట్లు?

**శ్లో॥ ఫలానిచ సుపక్వాని మూలాని మధురాణిచ**
**స్వయ మాస్వాద్య మాధుర్యం పరీక్ష్య పరిభక్ష్యచ**
**శ్లో॥ పశ్చా న్నివేదయామాస రాఘవాభ్యాం దృఢ వ్రతా**
**ఫలా న్యాస్వాద్య కాకుత్థ్సః తస్యై ముక్తిం పరాం దదౌ॥**

"చక్కగా పండిన పండ్లను, మధురములైన ఫలమూలాదులను శబరి స్వయంగా ఆస్వాదించి, వాటియందలి తియ్యదనాన్ని పరిశీలించి, తాను భక్షించి ఆ తరువాత రామునికి సమర్పించింది. రాముడు ఆ ఫలాలను ఆరగించి ఆమెకు ముక్తిని ప్రసాదించాడు" అని పద్మపురాణము ప్రవచించింది.

బహుశ దీనిని ఆధారముగా తీసుకున్నారేమో! భద్రాచల రామదాసు ఈ విషయాన్ని దాశరథీ శతకములో ప్రస్తావించారు.

**ఉ॥ ఎంతటి పుణ్యమో శబరి యెంగిలి గొంటివి వింతగాదె నీ**
**మంతన మెట్టిదో యుడుతమైని కరాగ్ర నఖాంకురంబులన్**
**సంతస మంద జేసితివి సత్కుల జన్మములేమి లెక్క వే**
**దాంతము గాదె నీ మహిమ దాశరథీ కరుణా పయోనిధీ!**

"రామా! శబరి ఎంగిలి తిన్నావు. ఆశ్చర్యంగా ఉంది. ఆమె ఎంత పుణ్యం చేసుకున్నదో? ఉడుతను చేత పట్టుకొని మునిగోళ్ళతో గీరి తృప్తి పరచావు. దానిపై అంత ప్రేమ కలుగుటకు కారణమేమో తెలియడం లేదు. దీనిని బట్టి చూడగా నీవు జాతికులాలను చూచేవాడివి కాదని తెలుస్తోంది. వేదాంతమే నీ వైభవమని స్పష్టమవుతోంది. దాశరథీ! కరుణాపయోనిధీ! నీ మహిమ అసమానము" అన్నాడు గోపన్న.



ఒకవేళ ఆనాడు కులపిచ్చితో సమాజాన్ని కుళ్ళబెడుతున్న వారి మహోన్మాదాన్ని దులపాలని భావించి అలా ఎంగిలిని ఎన్నుకున్నాడేమో?

జాతి కులాలకన్నా భక్తి అమోఘమైనది. ఈ సందర్భములోనే తాను జాతికులాలను చూచేవాడు కానట్లు రాముడు రామచరితమానసంలో చెబుతాడు.

రాముని శబరి కన్నులారా చూచింది. రాముని స్తుతించే శక్తి తనకు లేదని, తాను మందమతినని, నీచ జాతి స్త్రీనని రామునితో సవినయంగా మొరపెట్టుకుంటుంది.

**అధమ తేఁ అధమ అధమ అతినారీ! తిన్హ మహమై అతి మంద అ ధారీ!**
**కహ రఘుపతి సును భామిని బాతా! మానౌ ఏక్ భగతి కర నాతా!**
**జాతి పాంతి కుల్ ధర్మ బడాయీ! ధనబల్ పరిజన గుణ చతురాయీ!**
**భగతిహీన నర సోహై కైసా! బిను జల బారిద దేఖి అ జైసా!**

"రామా! నేను అధములలో అధమమైన నీచజాతి స్త్రీని. మందమతిని. మూర్ఖురాలను. హే పాపవినాశకా! నిన్ను నేను ఎలా స్తుతించేది?" అన్నది శబరి.

"శబరీ! నామాట విను. నాకు కేవలము భక్తి ప్రధానము. జన్మము, వంశము, కులము, ధనము, శక్తి, సామర్థ్యము కంటె భక్తియే నాకు ముఖ్యము. భక్తి లేని వ్యక్తి జలము లేని మేఘము వంటివాడు" అని శబరికి రాముడు సమాధాన మిచ్చాడు తులసీ రామాయణంలో.

రామునికి ఏదో పెట్టాలని శబరి భావించలేదు. ఆమె పెట్టేదేదో తినాలని రాముడు రానూ లేదు. పెట్టేందుకు శబరి వద్ద ఏముంది? తినవలసిన అవసరం రాముడి కేముంది?

ఒకవేళ సమర్పించ దలచుకుంటే శబరి ఏమి సమర్పించాలని ఉందో, రాముడు గ్రహించాలని భావిస్తే దేనిని గ్రహించాలని భావిస్తున్నాడో మనం గ్రహిస్తే చాలు. మన జన్మలు చరితార్థమవుతాయి.

రామునికి అతిథిపూజలు చేయుటకు ఆశ్రమంలో ఉండమని ఋషులు శబరికి చెప్పారు. ఆ తరువాత ఉత్తమలోకాలకు వెళ్ళమన్నారు.

ఈ దేహం ప్రతిక్షణము రాముని సేవకే నిరీక్షిస్తూ ఉండాలి. రాముని సేవలోనే తృప్తి చెందాలి. రామానుగ్రహంతో తరించిపోవాలి. దేహాన్ని దైవసేవ కొరకే నిలుపుకోమని వాల్మీకి రామాయణంలో ఋషులు శబరికి చెప్పారు.

**యావ దాగమనం తస్య తావద్రక్ష కళేబరమ్**
**దృష్ట్వైవ రాఘవం దగ్ధ్వా దేహం యాస్యసి తత్పదమ్॥**

"శబరీ! రాముడు నీవద్దకు వచ్చేవరకు ఈ దేహాన్ని రక్షించుకో. రామదర్శనం కాగానే దేహాన్ని అగ్నికి సమర్పించి పరమాత్మను పొందు" అన్నది అధ్యాత్మరామాయణము.

తీరం చేరిన తరువాత తెప్ప అవసరం లేదు. పరమాత్మను పొందిన తరువాత దేహము యొక్క అవసరం లేదు. అంతవరకు దేహాన్ని రక్షించుకోవాలి. దేహమనగడ కూడా దైవసేవ నిమిత్తమే.

"రామా! వనములో లభించే ఉత్తమ పదార్థాలు నీ కొరకు జాగ్రత్తచేసి ఉంచాను" అని శబరి పలికినపుడు రాముడు ఆ విషయమునందు ఆసక్తి చూపలేదు. అసలు పట్టించుకున్నట్లు కూడా లేదు.

రాముడు శబరిని ఏదో అడగా లనుకుంటున్నాడు. ఆమె నుండి ఏదో ఆశిస్తున్నాడు. అదేమిటో చెప్పబోయే ముందు రాముడు ఎవరితో భాషిస్తున్నాడో ఆ శబరిని భక్తురాలిగా కాకుండా మహాజ్ఞానిగా వాల్మీకి పరిచయం చేయడం గమనించదగిన విషయం.

**ఏవ ముక్త స్స ధర్మాత్మా శబర్యా శబరీ మిదమ్**
**రాఘవః ప్రాహ విజ్ఞానే తాం నిత్య మబహిష్కృతామ్॥**

"ఫలాదులు భద్రపరచి ఉన్నట్లు శబరి చెప్పిన మాటలు విన్న రాముడు సదా జ్ఞానములో రమించు శబరితో ఇలా పలికాడు" అన్నాడు వాల్మీకిమహర్షి.

జ్ఞాన భూమికలో ప్రవేశించే ముందు పాఠకుల మనసులను సిద్ధం చేస్తూ శబరిని జ్ఞానిగా పరిచయం చేస్తున్నాడు వాల్మీకి.

"శబరీ! కబంధుడు నిన్ను గూర్చి, నీ గురువు ప్రభావాన్ని గూర్చి చెప్పాడు. ఆ వైభవాన్ని చూడాలని అభిలషిస్తున్నాను" అన్నాడు రాముడు.

రాముడు మతంగవనాన్ని చూడాలని కోరుతున్నాడని గ్రహించింది శబరి. గురువైభవమును తెలిపే ఆ వనాన్ని చూపాలని లేచింది. ఈలోగా మనల్ని ఉపనిష ద్వనవిహారము చేయించాలని భావిస్తాడు వాల్మీకిమహర్షి.

**ఏతత్తు వచనం శ్రుత్వా రామ వక్త్రా ద్వినిః సృతమ్**
**శబరీ దర్శయామాస తా ఉభౌ తద్వనం మహత్.**

"రాముడు అలా పలకగానే రామలక్ష్మణులకు గొప్పదైన ఆ వనమును శబరి చూపింది" అంటాడు వాల్మీకి.

**తద్వనం** అనే పదాన్ని ప్రయోగించి ఒకేసారి ఆత్మజ్ఞాన పర్వతశిఖరాన్ని అధిరోహించి కూర్చున్నాడు వాల్మీకిమహర్షి.

తద్వనం అంటే, తత్+వనం, తద్వనం అనగా ఆ వనము అనే బాహ్యార్థంతో తృప్తిపడేందుకు సిద్ధపడకూడదు. దానిని నిగూఢంగా శోధిస్తే విచిత్రాలన్నీ గోచరిస్తాయి.

**తత్ హ 'తద్వనం' నామ, తద్వనం ఇతి ఉపాసితవ్యం**

తత్=ఆ భగవంతుడు, తద్వనం నామహ='తద్వనం' అను పేరు కలవాడు. తత్=దానిని, వనం=భజనీయం, ఇతి=అని, ఉపాసితవ్యం=ఉపాసించాలి.

"పరమాత్మ 'తద్వనం' అనే పేరుతో ప్రసిద్ధుడు. కనుక బ్రహ్మము "తద్వనం" అని తెలిసి ఉపాసించాలి" అన్నది కేనోపనిషత్తు.

శంకరాచార్యుల వారు కేనోపనిషత్తులోని పై మంత్రముపై వ్యాఖ్యానిస్తూ ఇలా అంటారు.



**తస్య ప్రాణి జాతస్య ప్రత్యగాత్మ భూతత్వాత్ వనం వననీయం**

**సంభజనీయం। అతః తద్వనం నామ ప్రఖ్యాతం బ్రహ్మ।**

"ప్రతి ప్రాణియందును అంతరాత్మ రూపంగా ప్రతిష్ఠింపబడి యున్న కారణమువ ఆ బ్రహ్మ **(తత్)** భజనీయము **(వనం)** అని శంకరభాష్యము.

కనుక వైభవోపేతమైన మతంగవనము కేనోపనిషత్తు ప్రవచించిన 'తద్వనమే'. రామ లక్ష్మణులకు ఆ వనాన్ని చూపించుటకు శబరి బయలుదేరింది. సోదరులు ఆమెను అనుసరించారు. వనంలో ప్రవేశించారు.

శబరి చెప్తోంది.

"రామా! మృగపక్షులతో కూడి మేఘమండలంలా గోచరించే ఇదే మతంగవనం. మా గురువులైన మహర్షులు మంత్రాలతో అర్చించి గంగాది పుణ్యతీర్థాలను ఇక్కడికి రప్పించేవారు.

"రామా! వృద్ధాప్యం వల్ల వణుకుతున్న చేతులతో పుష్పాలను సమర్పించే దేవతాస్థానము అదిగో - అదే.

"రామా! చూశావా! వారి తపోమహిమ! ఇప్పటికీ ఆ వేది దివ్యప్రభలతో శోభిస్తోంది.

"అదిగో రాఘవా! దీర్ఘోపవాసాలచే దుర్బలులైన మహర్షులు కదలలేక సంకల్పమాత్రాన సప్తసముద్రాలను ఇక్కడికి రప్పించారు. అవి - ఆ ప్రక్కనున్నాయి చూడు, అవే.

"రఘునందనా! స్నానం చేసి, మహాత్ములైన ఆ ఋషులు చెట్లపై ఆరేసిన వారి నారచీరలు తడి ఆరలేదు చూశావా!

"వారు పూజకు ఉపయోగించిన పూలు ఇవిగో. వారు సమర్పించిన మాలలు అవిగో. అవి వాడకుండా అలాగే ఉంటాయి;" అని వనాన్నంతా చూపింది శబరి.

అది **తద్వనం.** అదే మతంగవనం.

సప్త సముద్రాలను ఒకచోట నిలిపేదే ఆ వనం. ఎంతో ఉందనుకొనే విశ్వాన్ని ఇంతేనని ఒకేచోట చూపెట్టగలిగే వనం. అయితే చూడాలి మనం. మహర్షులు చూశారు. శబరి చూసింది. రామలక్ష్మణులకు చూపింది.

వెళ్ళి చూడాలి. చూసి చెప్పాలి. అదే తద్వనం.

ఇందుకే ఋషులు అరణ్యాల్లో వసించేవారు. వనాల్లో నిలిచి తద్వనాన్ని దర్శించేవారు. వారు దర్శించిన దానిని కోరినవారికి చూపేవారు.

యావద్విశ్వమంతా వారికి తద్వనంలోనే లభిస్తుంది. కనుక వారికి కావలసింది రెండే వస్తువులు.

### *1. గునపము 2. గంప*

"నాకు ఏమీ అవసరము లేదు. ధనరాశులు అవసరం లేదు.నేను అరణ్యానికి వెళ్తున్నాను. నాకు కావలసింది గునపము, గంప - ఈ రెండే" అని రాముడు దశరథుని అంతఃపురములో అరణ్యవాసానికి వెళ్ళే ముందు అంటాడు.



"అన్నా! నిన్ను వదలి నేను అయోధ్యలో ఉండలేను. నీతోపాటు నేనూ వస్తాను. గునపము, గంప తీసుకొని ముందు నడుస్తాను" అని అయోధ్యాకాండములో లక్ష్మణుడూ అంటాడు.

తాపసజీవనంలో అవసరమైనవి గునపము-గంప, ఈ రెండే.

'తద్వనం'లో అవసరమైనవి ఈ రెండే.

త్రవ్వేందుకు గునపం. ఎత్తిపోసేందుకు గంప.

శాస్త్రలోతులను త్రవ్వి ఆశ్చర్యకరమైన విజ్ఞాన మణులను వెలికి తీసేందుకు విచారము అనే గునపము.

గునపము ద్వారా త్రవ్వి తీసిన మణులను ఎత్తి పోసేందుకు ఉపకరించేదే గంప అనే ప్రచారము.

విచారము ద్వారా శాస్త్రలోతుల్ని త్రవ్వితీయడము -

వచ్చిన జ్ఞానమణుల్ని సమాజంపై గంపలతో క్రుమ్మరించడం -

ఇవి ఋషుల కర్మలు. మహర్షుల కార్యాలు.

ఇవే సత్సంగాలు. ఇవే జ్ఞానయజ్ఞాలు. అన్నీ 'తద్వన' ప్రసాదాలే.

'తద్వనం'లో లభించిన జ్ఞానపుష్పాలే.

అవి వాడేవి కావు. ఊడేవి కావు అంటోంది శబరి.

మహర్షులు దర్శించిన 'తద్వనం'లో లభించిన జ్ఞానపుష్పాలు దేశకాలాలకు పరిమితంకావు.

కాలప్రభంజనానికి ఆ పూలు వాడవు.

దుండగుల దండయాత్రలకి వాటి రేకులు ఊడవు.

అవి దివ్యప్రభలతో శోభిస్తూనే ఉంటాయి. తద్వనం ఎప్పుడూ నిత్యకళ్యాణంగా అలరారుతూనే ఉంటుంది.

అవి తడి ఆరని బట్టలు అంటోంది శబరి.

నిజమే. విమర్శాగాలులు వాటిని ఎండగట్టలేవు. అవి జ్ఞానగంగా స్వరూపాలు. కనుక ఎప్పుడూ చల్లగానే ఉంటాయి. చల్లబరుస్తూనే ఉంటాయి.

చీకిపోని, మాసిపోని దివ్య చీనాంబరాలవి.

**ప్రహర్ష మతులం లేభే ఆశ్చర్యమితి తత్త్వతః**

శబరి చూపిన, చెప్పిన తద్వనాన్ని "ఆశ్చర్యం" అని ఒక్కమాటతో చెప్పి చూశారు రామలక్ష్మణులు. అంతకన్నా ఎవరు మాత్రం ఏం చెప్పగలరు?

**ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేనం**
**ఆశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః**
**ఆశ్చర్య వచ్చైన మన్య శ్శృణోతి**
**శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్**

"ఆత్మను ఒకడు ఆశ్చర్యమైన దానివలె చూస్తాడు. మరిఒకడు ఆశ్చర్యమైన దానివలె పలుకుతాడు. ఒకడు ఆశ్చర్యమైన దానివలె వింటాడు. విన్నా మరొకడు తెలుసుకోలేక పోతున్నాడు" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత సాంఖ్యయోగంలో తెలుపుతారు.

అదే తద్వనం. అదే మతంగవనం. అదే ఆశ్చర్యం. అద్భుతం.

మతంగవనంలో పూలు వాడకపోవడానికి కబంధుడు కారణంకూడా చెప్పాడు రామలక్ష్మణులకి. ఆ పూలు చెట్లనుండి పూసినవి కావు. గురుసేవ చేయుచున్న శిష్యుల స్వేద బిందువులే పూలుగా మారాయన్నాడు. అందుచేత అవి వాడవు.

గురుసేవ ఎప్పుడూ వాడదు. అది వాడని పువ్వులా ప్రకాశిస్తూనే ఉంటుంది. సనాతనధర్మ జీవన బాటలో లభించే విజ్ఞానమంతా గురుసేవలో శిష్యులు గ్రహించిందే కనుక అది నిత్యనూతనంగా విరాజిల్లుతూనే ఉంటుంది.

"రామా! నిన్ను సత్కరించుకొని నేను సంతృప్తిని పొందాను. నీవుకూడా వినదగింది విన్నావు. చూడదగింది చూశావు. నాకు ఆజ్ఞ ఇస్తే ఈ నా కళేబరాన్ని త్యజిస్తాను. ఏ మహాత్ములను గతంలో ఇక్కడ సేవించానో వారివద్దకే వెళ్ళాలని అభిలషిస్తున్నాను;" అని రామునితో పలికింది శబరి.

**అర్చితోఽహం త్వయా భక్త్యా గచ్ఛ కామం యథా సుఖమ్**

"శబరీ! నన్ను భక్తితో ఆరాధించావు. నీవు కోరిన చోటికి సుఖంగా వెళ్ళు" అన్నాడు రాముడు.



భక్తితో రాముని అర్చించిన శబరి కోరిన చోటికి వెళ్తూ వుంది. రాముని ఎవరైతే భక్తితో అర్చిస్తారో వారు తప్పకుండా అభిలషించిన మోక్షాన్ని పొందుతారు.

వృద్ధురాలైన శబరి నారచీరను, జింకచర్మమును వస్త్రముగా ధరించింది. అగ్నిని ప్రతిష్ఠించుకుంది. నిరాశ లేకుండా ఇంతకాలం తాను రాముని కోసం ఎంత ఉత్సాహంతో నిరీక్షించిందో తనకొరకు అదే ఉత్సాహంతో నిరీక్షిస్తున్న అగ్నిహోత్రునికి దేహాన్ని హోమద్రవ్యంలా సమర్పించింది.

వెంటనే దివ్యదేహాన్ని పొంది రామలక్ష్మణులకు నమస్కరిస్తూ స్వర్గానికి వెళ్ళింది. దివ్యమైన అలంకారాలతో, దివ్యమైన పుష్పమాలలతో వెలిగిపోతూ విమానం ఎక్కి వెళ్ళిపోయింది. శబరి ధన్యజీవి. పుణ్యజీవి.



**ఎంతని నే వర్ణింతును శబరీభాగ్యమె**
**దాంతులు వరకాంతలు జగమంత నిండియుండగ ॥ఎం॥**
**కనులార సేవించి, కమ్మని ఫలముల నొసగి**
**తనువు పులకరించ పాదయుగములకు మ్రొక్కి**
**ఇనకులపతి సముఖంబున పునరావృత్తి రహిత పద**
**మును పొందిన త్యాగరాజ నుతురాలి పుణ్యంబును ॥ఎం॥**

అని శబరి భాగ్యాన్ని పరవశించి గానంచేశారు త్యాగరాజస్వామి.

అరణ్యకాండము సాధనకు సంబంధించిన కాండము. ఈ కాండములో మనకు రెండు పాత్రలు ప్రత్యేకంగా గోచరిస్తాయి. ఒకటి శూర్పణఖ కాగా రెండవది శబరి.

శూర్పణఖ కామరూపం. క్రోధస్వరూపం. ముక్కు చెవులు పోగొట్టుకొని దుఃఖిస్తుంది. వికారస్వరూపంగా మారి విలపిస్తుంది. కామక్రోధాల పరిస్థితి ఎప్పుడూ అంతే. కనుక సాధకులైనవారు కామక్రోధాలను నిగ్రహించుకోవాలి. శూర్పణఖ లాగా జీవితం పాడుకాకుండా చూసుకోవాలి.

శబరి ప్రేమస్వరూపం. ప్రేమమూర్తి అయిన శబరి రాముని దర్శించింది. రామునితో భాషించింది. రాముని పాదాలను అర్చించింది. దివ్యమైన దేహాన్ని పొందింది. రాముని అనుగ్రహానికి పాత్రురాలై ఉత్తమలోకాలకు వెళ్ళింది.

ఈ రెండు పాత్రల్ని మనసులో ఉంచుకొని సాధకులు తమ జీవితాల్ని చరితార్థం చేసుకోవాలి.

**తస్మి న్ననన్యతా తద్విరోధి షూదాసీనతా చ ॥**

భగవంతుని యందు అనన్యమైన భక్తిని, దానికి వ్యతిరేకమైన విషయముల యందు ఉదాసీనతను కలిగియుండేలా జీవించమని నారదమహర్షి భక్తిసూత్రాలలో సూచిస్తాడు.

సదా హృదయంలో భక్తి నిండాలి. కామము ప్రవేశించకుండా చూసుకోవాలి.

## పంపకు పయనము

శబరి ఉత్తమలోకాలకు వెళ్ళింది. రామలక్ష్మణులు బయలుదేరారు. రాముడు లక్ష్మణునితో ఇలా పలికాడు.

"లక్ష్మణా! మహాత్ములైన మహర్షుల ప్రభావం చూశావు కదా! ఆ పవిత్రాశ్రమంలో పెద్దపులులు, లేళ్ళు కలిసి తిరుగుతున్నాయి. దివ్యములైన మృగపక్ష్యాదులు కూడా వైరం మరచి ఆనందంగా జీవిస్తున్నాయి".

మహాత్ముల సన్నిధిలో మిత్రత్వమే గాని శత్రుత్వము ఉండదు. నిర్వైర సర్వభూతేషులైన వారేకదా నిజభక్తులు.

**అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః**

"అహింసావ్రతులైన మహాత్ముల సన్నిధిలో సహజ వైరములుకూడా నశించిపోతాయి" అని పతంజలిమహర్షి యోగదర్శనంలో చెబుతారు.

"లక్ష్మణా! పవిత్రులైన మహర్షులు జీవించిన ఆశ్రమాలు చూశాము. సప్తసాగరముల నుండి వచ్చిన పవిత్ర జలాలలో స్నానం చేశాము. పితృదేవతలకు జలతర్పణాలు ఇచ్చాము.

"నాయనా! అశుభాలు నశించాయి. శుభాలు ప్రాప్తించాయి. నాకేదో సంతోషంగా ఉంది. సౌమిత్రీ! మంచి జరుగబోయేటప్పుడు మనసుకు తెలుస్తూ ఉంటుంది కదూ!

"మనం బయల్దేరుదామా! సూర్యుని పుత్రుడు, ధర్మాత్ముడు అయిన సుగ్రీవుడు ఋష్యమూక పర్వతముపై ఉంటాడు. ఆ పర్వతము పంపకు దగ్గరగా ఉంది. కనుక పంపా సరస్సుకు వెళ్దాము. పద.

**అభిత్వరే చ తం ద్రష్టుం సుగ్రీవం వానరర్షభమ్**
**తదధీనం హి మే సౌమ్య సీతాయాః పరిమార్గణమ్॥**

"సౌమ్యుడా! లక్ష్మణా! సుగ్రీవుని చూడాలని నాకు తొందరగా ఉంది. నాయనా! సీతాన్వేషణము సుగ్రీవుని మీదనే ఆధారపడి ఉంది కదా!" అన్నాడు రాముడు.

సుగ్రీవుడు ధర్మాత్ముడు. ఎంతో పుణ్యాత్ముడు. లేకపోతే రాముడు తనకు తానుగా సుగ్రీవుని వెతుక్కుంటూ వస్తాడా? ఎన్ని జన్మల పుణ్యఫల విశేషమో! ఈనాడు రామదర్శనం కాబోతుంది సుగ్రీవునకు.

రామకార్యం చేయుటకు అర్హత, సామర్థ్యం కలవారి వద్దకు రాముడు స్వయంగా వస్తాడు. తన పనిని వారిచేత చేయించుకుంటాడు. ఆ తరువాత వారిని పుణ్య పురుషులుగా చరిత్రలో నిలుపుతాడు.

రామకార్యం చేయడానికి మనమూ అర్హతను సంపాదించుకోవాలి. సామర్థ్యాన్ని పెంపొందించుకోవాలి. అప్పుడు సుగ్రీవుని వెతుక్కుంటూ వచ్చినట్లు మన వద్దకు కూడా రాముడు వస్తాడు.

రాముడు రాగానే మన శక్తి వెయ్యింత లవుతుంది. అంతవరకు అసాధ్య మనుకున్న కార్యాలు సులభసాధ్యా లవుతాయి. రాముడు వెనుక నిలిస్తే సాధించలేనిదంటూ ఉండదు.

ఏ వాలి చేత సుగ్రీవుడు కిష్కింధ నుండి తరిమివేయబడ్డాడో, అదే వాలిని రాముని అండతో నేలకూల్చుతాడు సుగ్రీవుడు. రాముని అనుగ్రహంతో సాధించలేనిదంటూ ఉండదు.

ఇదేదో పురాణకాలాలకే పరిమితమని భావించకూడదు. ఈరోజుల్లో కూడా పవిత్రమైన భక్తుల వెనుక రాముడు నడుస్తూనే ఉంటాడు. రామకార్యధురంధరు లైనవారి వెంట రాముని శక్తి కదుల్తూనే ఉంటుంది.

సుగ్రీవునికి బలంగా నిలిచిన రాముడే ఆదిశంకరులకు అండగా నిలిచాడు. ఆదిశంకరుల వెనుక నిలిచిన రామచైతన్యమే వివేకానందస్వామి వెనుక తరగని శక్తిగా భాసించింది. వివేకానందుని నడిపిన రాముడే రామతీర్థస్వామికి మార్గగామి అయ్యాడు.

రామకార్యానికి నడుంకట్టాలే గాని వారంతా రామానుగ్రహ పాత్రులై శోభిస్తారు. ఇదీ రహస్యం.



కనుకనే రామకార్యం చేపట్టిన వారిపై ఈర్ష్యాసూయలు పెంచుకొనే వారంతా భస్మాసురుని సోదరులై మిగిలిపోతుంటారు. శ్రీరామ జయమే శ్రీరామభక్తజయం. అదే రామభక్త విజయం.

రాముడు లక్ష్మణునితో కలిసి పంపను చేరాడు. పంపాతీరము శోభాయమానంగా ఉంది. వివిధములైన వృక్షాలతో, లతలతో సుందరముగా కన్పిస్తోంది. పద్మాలతో, నల్లకలువలతో, తియ్యని ఉదకంతో పంపాసరోవరము స్ఫటికంలా స్వచ్ఛంగా ప్రకాశిస్తోంది.

పంపాతీరమునందు మతంగ సరస్సు అనే చెరువు ఉంది. రాముడు ఆ చెరువులో స్నానం చేశాడు. పంపను సమీపించాడు. ఆ తీరంలో అనేక చెట్లు అందంగా పూసున్నాయి. బెగ్గురు పక్షులు, చిలుకలు మృదువుగా అరుస్తున్నాయి. నెమళ్ళ క్రేంకారాలు వినిపిస్తున్నాయి.

తిలక, అశోక, పున్నాగ, వకుళ, ఉద్దాల వృక్షాలతో మంగళప్రదంగా శోభిస్తున్న పంపాసరోవరాన్ని చూశారు రామలక్ష్మణులు. అచ్చట ఇసుక చాలా మెత్తగా ఉంది.

దివ్యమైన ఆ పంపాసరోవర శోభ రామునిలో నిగూఢంగా నిలిచియున్న విరహాగ్నిని ప్రజ్వలింప చేసింది. వియోగాగ్నిని రగుల్కొల్పింది. రాముడు అదోలా అయిపోయాడు. లక్ష్మణుని చూచి ఇలా పలికాడు.

**రాజ్యభ్రష్టేన దీనేన తస్యా మాసక్త చేతసా**
**కథం వినా మయా శక్యం సీతాం లక్ష్మణ జీవితుమ్॥**

"లక్ష్మణా! నేను రాజ్యభ్రష్టుడను. దీనుడను. నా మనసు సీతయందే లగ్నమై ఉంది. సీత లేకుండా నేను ఎలా జీవించేది?"

మండుతున్న హృదయంతో చల్లని పంపను చేరాడు రాముడు. రాముడు అడుగులు ముందుకు వేగంగా వేయలేక పోతున్నాడు. జలచరాలు కదులుతుంటే పంపలో జలం చలిస్తోంది. సీతమ్మ మదిలో మెదులుతుంటే రాముని కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి. పంపాసరోవరం తన జలాన్ని తనలోనే దాచుకో గల్గుతోంది. రాముడు కన్నీటిని జారవిడచుకుంటున్నాడు.

సీతమ్మను చూడలేక పోతున్నందుకు రాముని కళ్ళు కన్నీటితో నిండుతున్నాయి. మేము ఉండి ఏమి ప్రయోజనం? సీతమ్మ ఎక్కడుందో మేమన్నా వెళ్ళి తెలుసుకొని వస్తామని కన్నీళ్ళు జలజలమని కారుతున్నాయి. మీరు కూడా వదలి వెళ్తున్నారా! అని కళ్ళు కన్నీళ్ళను రెప్ప వేయకుండా చూస్తున్నాయి.

మాటలు మూగబోయిన వేళ మౌనమే మహాప్రసంగం. తాము ఎండిపోతూ ఇతరులకు నీడనిచ్చే చెట్లు ఏం మాట్లాడుతాయి? చల్లగా వెన్నెలను కురిసి మేనులను చల్లబరచే చందమామ భాష ఏది? పరుల కొరకు జీవించే పువ్వులకు మాట ఏది?

దౌర్జన్యాలు తలెత్తిన వేళ సౌజన్యాలు మౌనరూపాలు
లోభాలు విజృంభించిన వేళ త్యాగాలు మూగజీవులు....

రాముడు నీరునిండిన కళ్ళతో లక్ష్మణుని చూశాడు. రాముని బాధను చూడలేకనేమో తల దించుకున్నాడు లక్ష్మణుడు.

**అరణ్యకాండము సమాప్తము.**